











# వ్యాసమాలతి 3

## తెలుగు తూలికలో ప్రచురించిన వ్యాసాలు (2011-2014)

# విషయ సూచిక

# పరిచయవాక్యాలు

ఈసంకలనంలో 2011-2014మధ్య నేను రాసిన 17 వ్యాసాలు ఉన్నాయి. అన్నీ తెలుగు తూలికలో మాత్రమే ప్రచురించినవి. బ్లాగులో వ్యాసాలకీ విడిగా ఒక పుస్తకంగా ప్రచురించిన వ్యాసాలకీ తేడా ఉంది. బ్లాగులో టపాకి ముందుటపాలతో, వ్యాఖ్యలతో అనుబంధం ఉంటుంది. అవే వ్యాసాలు విడిగా తీసి వాటికి పుస్తకంరూపం ఇచ్చినప్పుడు కొన్ని అంశాలు, లింకులు అసందర్భమయి అయోమయస్థితికి దారి తీస్తాయి. అటువంటి వాక్యాలు, లింకులు తొలగించేను. నిజానికి కొన్ని వ్యాసాలకి వచ్చిన వ్యాఖ్యలు వ్యాసానికి మరింత పుష్టి చేకూర్చేయి. ఆయా వ్యాసాలకింద వ్యాఖ్యలు తెలుగు తూలిక చూడండి. లింకు మీద నొక్కి, వెతుకు పెట్టెలో వ్యాసం పేరు టైపు చేస్తే వ్యాసానికీ, వ్యాఖ్యలకీ దారి సుగమము కాగలదు.

అనగ అనగ రాగమతిశయిల్లు అని ఆప్తవాక్యం. రాయగా రాయగా, చదవగా చదవగా, విజ్ఞులతో పరిచయాలు రవంతయినా మెరుగు పడగా పడగా (ముఖ్యంగా ఫేస్బుక్కులో అని సవినయంగా చెప్పుకుంటున్నాను) నావ్యాసరచనలో ముందుకంటె కొంత స్పష్టత ఏర్పడింది అనే అనుకుంటున్నాను. ఆకారణంగా ఈ వ్యాసాలు మరొకసారి పరిశీలించి చూసుకుని అక్షరదోషాలు దిద్దుకుని, సందర్భశుద్ధి లేని పదాలు తొలగించి, కొన్ని వాక్యాలు తిరగరాసి ఒక్కొక్క వ్యాసమూ మరింత పటిష్ఠం చేయడానికి యథాశక్తి ప్రయత్నించేను. నాప్రయత్నం విజయవంతమయిందో లేదో మీరే చెప్పాలి.

ఈ సంకలనంలో రెండు ఆంగ్లనవలల సమీక్షలున్నాయి. మామూలుగా ఆంగ్ల రచనలగురించి రాయడం నాకు అభిమతం కాదు కానీ కదాచితుగా ఏదో ఒక అంశం లేదా కోణం ప్రత్యేకించి నాదృష్టిని ఆకట్టుకున్నప్పుడు రాస్తాను. ప్రధానంగా అది

దేశకాలసంస్కృతులని అధిగమించి, సర్వకాలీమూ, సర్వజాతీయమూ అయిన ఒక మానవీయకోణాన్ని ఆవిష్కరించేది అయినప్పుడు. అలాటివే ఈ రెండు వ్యాసాలు.

మొదటిది Sorrows of Satan నవల. ఇందులో మనం చెప్పుకునే కర్మసిద్ధాంతం చూస్తాం. మానవుడికి సదసద్వివేచన లేదా విచక్షణాజ్ఞానం ఉంది. మనిషి స్వయంనిర్ణేత. తనపతనానికి తనే కారకుడు. ఆ నవలలో నాదృష్టినాకర్షించిన రెండో అంశం 19వ శతాబ్దంలో బ్రిటిష్ సమాజంలో స్త్రీల, స్త్రీరచయితల స్థానానికీ 20వ శతాబ్దంలో ఆంధ్రదేశంలో తెలుగు రచయిత్రులస్థానానికీ గల సాపత్యం.

రెండో నవల An Autobiography of ex-colored man తోలురంగుకి సంబంధించినది. ఈ నవలలో తెలుపూ-నలుపూ సాంకర్యంవల్ల ఉద్భూతమయే మానసికస్థితి అద్భుతంగా ఆవిష్కృతమయినది. అమెరికాలో స్థిరపడిన తెలుగుకుటుంబాలలోని యువతీయువకులలో ఇదే విధమైన ఆలోచనలకీ, అనుభవాలకీ అవకాశం ఉందని నాకు అనిపించింది.

ఈ వ్యాసాలు రాయడానికి ఉపకరించిన మూలగ్రంథాలు digital library of India site, Archive.org నుండి తీసుకున్నాను. మరొక వనరు te.wikipedia.org. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ పుస్తకంలో చేర్చిన రచయితలబొమ్మలు అంతర్జాలంనుండి తీసుకున్నవి public domainలో ఉన్నవి. కాకపోతే నాకు తెలియజేస్తే, వెంటనే తొలగించగలను.

- నిడదవోలు మాలతి

ఫిబ్రవరి 24, 2015

# 1. ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర

## ఒక చరిత్ర పాఠం




ఏనుగుల వీరాస్వామయ్య(1780-1836) గారి కాశీయాత్ర తెలుగు సాహిత్యచరిత్రలో ప్రత్యేక స్థానం సంపాదించుకున్న గ్రంథం.

సూక్ష్మంగా వీరాస్వామయ్యగారివివరాలు చెప్పాలంటే వారి జననంగురించి నిర్ధారణగా తెలీదు కానీ 1780 అయిఉండవచ్చని వారిమిత్రులు కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళగారి అంచనా. మరణించిన తేదీ మాత్రం నిర్ధారణగా 1836 అక్టోబరు 3 అని ఈ గ్రంథానికి ముందుమాటలో ఉంది.

వీరాస్వామయ్యగారు "1830లో మే 18వ తేదీన బయలుదేరి 15 మాసముల 15 రోజుల 30 నిముషాలు" సాగించిన కాశీయాత్రావిశేషాలు వివరిస్తూ వారిమిత్రులు కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళగారికి రాసిన ఉత్తరాలే ఈ గ్రంథం. తొలిముద్రణ తేదీ దొరకలేదుట. రెండవ ముద్రణ కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్ళగారి ప్రోత్సాహంతో 1838లో వెలువడింది. ఈ ముద్రణకి పీఠిక రాస్తూ శ్రీనివాస పిళ్ళగారు ప్రస్తావించిన ఒక విషయం గమనార్హం. తమ కోరికపైనే వీరాస్వామయ్యగారు ఉత్తరాలరూపంలో వారి

ప్రయాణఅనుభవాలు ఎప్పటికప్పుడు వ్రాసి పంపేరుట. అవన్నీ ఒక చోట చేర్చి ప్రచురించాలన్న సంకల్పం మాత్రం మొదటిసారిగా కలిగింది తెలుగువారికి కాకపోవడం ఆశ్చర్యం! (పిడియఫ్ పుట 43). రాయమని కోరినది తామే ప్రచుణకి మాత్రం ఆయన పూనుకోలేదు. కరకరంబాటి పోస్టాపీసులో గుమాస్తాగా పని చేస్తున్న పనయూరి వెంకు మొదలారి గారు తమిళంలోకి అనువదించి ప్రచురించినదే తొలి ప్రచురణ అని శ్రీనివాస పిళ్లగారు తమ పీఠికలో రాసేరు. ఏ సంవత్సరం అన్నది స్పష్టంగా లేదు కానీ ఈ పీఠిక తేదీకి ముందే అనుకోవాలి. వీరాస్వామయ్యగారు 1831లో సి.పి. బ్రౌన్‌కి తమపుస్తకాన్ని ప్రచురించమని కోరుతూ ఉత్తరం వ్రాసారు. లాభం వస్తే తాను తీసుకోనని, నష్టం వస్తే తానే భరిస్తాననీ కూడా చెప్పేరు (పు. 10). వీలు పడదని బ్రౌన్ జవాబిచ్చేరు. ఆ ఉత్తరంలో కూడా ఈ తమిళ గ్రంథం ప్రస్తావన లేదు. అంటే తమిళ గ్రంథం 1932-1938 మధ్యకాలంలో వచ్చిందనుకోవాలి. త్యాగరాజకృతులలాగే, ఈ కాశీయాత్ర గ్రంథంవిలువ మొదట గుర్తించినది తమిళులు! ఆ తరవాత "అనేక తెలుగు ప్రభువులు కోరడంచేత" శ్రీనివాస పిళ్ళగారు తెలుగులో ప్రచురించడానికి పూనుకున్నామని పీఠికలో రాసేరు. (పు.43).

ప్రస్తుతం మనకి అందుబాటులో ఉన్నది 1941లో దిగవల్లి వేంకట శివరావుగారి సంపాదకత్వంలో ప్రచురించిన మూడవ ప్రచురణ. "గ్రంథకర్తను గురించీ, ఆయనకాలంనాటి భారతదేశ రాజకీయ సాంఘిక పరిస్థితులను గురించీ, గ్రంథంలోని విషయాలకు సంబంధించిన తప్పులు, వివరణలు, విశేషాలు, సమకాలీన వాఙ్మయంలోనుంచి సమకూర్చి సందర్భానుసారంగా ఇందులో చేర్చబడినవి" అని రెండోముఖపత్రంలో (half title page) రాసేరు వెంకట శివరావుగారు.

గ్రంథం ప్రారంభంలో ఆనాటి కుంఫినీపాలన, వారిపాలనలో ప్రజలు అనుభవిస్తున్న కష్టాలు, వీరాస్వామయ్యగారి మిత్రుల సాంఘికసేవ, హిందూ లిటరరీ సొసైటీ,

వీరాస్వామిగారు బ్రౌను దొరగారికి రాసిన ఉత్తరంవంటి అమూల్యమైన విషయాలు అనేకం పొందు పరిచేరు. విషయసూచిక ప్రకరణలవారీగా విపులంగా ఉంది. నిజానికి విషయ సూచిక, దాని వెన్నంటి ఇచ్చిన "ప్రసంగతాత్పర్యములు" చాలు వీరాస్వామయ్యగారు ప్రస్తావించిన విశేషాలేమిటో స్థూలంగా తెలుసుకోడానికి. ప్రసంగతాత్పర్యములో సంపాదకులు వీరాస్వామయ్యగారిరచనలో అనేకవిషయాలను విపులంగా సమకూర్చి మనకి అందించేరు (పు. 47-51). ఈ విషయంలో సంపాదకులు తీసుకున్న అధికశ్రమ శ్లాఘనీయమూ, అనుసరణీయమూను.

శ్రీనివాస పిళ్ళగారు రాసిన వీరాస్వామయ్యగారి జీవిత చరిత్ర (53-61), మళ్ళీ మూలపాఠం ముగిసినతరవాత చివర ఇచ్చిన అనుబంధములో విషయసూచిక, సౌరమాన చాంద్రమాన మాసములు అధిక క్షయమాసములు, సవరణలపట్టిక (తప్పొప్పుల పట్టిక), చెన్నపట్టణం ప్రాచ్యలిఖిత భాండాగారంలో ఉన్న వ్రాతప్రతినుండి తీసుకున్న  కొన్ని మచ్చు పుటలు, కొన్ని పదములకు అర్థములు, అకారాది విషయసూచిక, ప్రచురణకర్తల వ్యాపారప్రకటనలు అన్నీ కలిపి 80 పుటలకి పైనే ఉన్నాయి. ఇలా లెక్కలు వేసి చూసుకుంటే, మూలగ్రంథం 347 పుటలు (పు. 63-410 పిడియఫ్‌లో). శ్రీ వెంకట శివరావుగారు ఈ మూడవ ప్రచురణని సిద్ధాంతగ్రంథం అనలేదు కానీ ఈనాడు వస్తున్న కొన్ని సిద్దాంతగ్రంథాలతో పోలిస్తే, ఈగ్రంథం ఒక మెట్టు పైనే ఉందని ఒప్పుకోక తప్పదు.

ఈ గ్రంథంలో కేవలం ఊరు తరవాత ఊరు చెప్పుకుంటూ పోవడం కాక, ఆనాటి సామాజిక, భౌగోళిక, రాజకీయ, చారిత్రక అంశాలనెన్నిటిలో ఎంతో విపులంగా చర్చించేరు రచయిత. నాకు మొదటి 90 పేజీలు సామాన్యంగా అనిపించేయి కానీ, గ్రంథకర్త కడప దాటినతరవాతినించీ కథనం ఆసక్తికరంగా సాగిపోయింది. ఆనాటి నాణేలు, వంట దినుసులవంటి సామాన్య విషయాలతోపాటు ఆచారవ్యవహారాలూ,

శీతోష్ణ స్థితిగతులు, ఆ శీతగాలులూ, ఉష్ణోగ్రతలమూలంగా ప్రజలలో వ్యక్తమయే భిన్న ప్రకృతులూ-ఒకటేమిటి ఆయన స్పృశించని అంశం లేదేమో అనిపించింది.

చెన్నపట్టణము రూపాయి వేరు, హైదరాబాదు రూపాయి వేరు, నాగపూరు రూపాయి వేరు. నాగపూర్‌దగ్గరకి వచ్చేసరికి మారకంలో రూపాయి తరుగు కూడానుట. అలాగే చెన్నపట్టణంలో ఉన్న దుడ్డు, గవ్వలు ఉత్తరదేశంలో లేవు. గోవులని సొమ్ములు అనడం విన్నాను కానీ సముద్రపొడ్డున ఉచితంగా దొరికే గవ్వలకి ఆర్థికవిలువ ఉందని నాకు ఇప్పుడే తెలిసింది (కొండ్రెడ్డి భాస్కర్, సుధారాణి ఫేస్బుక్కులో వివరించేక.). అలాగే ఆలయాలకీ నదులకీ సంబంధించిన స్థానిక పురాణగాథలూ, ఆయా ప్రాంతాల్లో జనుల ఆచారావ్యవహారాలు పాదుకొన్న తీరువంటి ఎన్నో విషయాలు తమబుద్ధికి తోచిన తాత్వికచింతనతో విచారించి అనేక వాదనలు ప్రస్తావించి తమదైన నిర్ధారణకి రావడం విజ్ఞానదాయకంగా ఉంది. వీటిలో కొన్ని వాదనలు మనకి ఈనాడు అంగీకారయోగ్యం కాకపోవచ్చు కానీ ఇవి చర్చించడంలో వారు ప్రదర్శించిన నిష్ఠ గణనీయం.

యాత్రకి కావలసిన సామగ్రి, తోడుగా వెంట తీసుకువెళ్ళిన సిబ్బంది, దారిలో అవసరమైన సామగ్రి మోయడానికి సవారీలు సమకూర్చుకుని మొదలు పెట్టిన ఈ యాత్ర తాము చూసిన ఒకొక ఊరు వర్ణించుకుంటూ పోవడంతో సాగుతుంది. కాశీయాత్ర గ్రంథంలో అధికంగా ఉన్నవేమిటి అంటే మొదట చెప్పుకోవలసింది ప్రయాణసౌకర్యాలు. ఇప్పుడున్న ప్రయాణసౌకర్యాలు ఆ కాలంలో లేవు కనక ఆయన ప్రయాణం ఎలా సాగించేరు, ఆయన ఎదుర్కొన్న కష్టనష్టాలు ఏమిటి అన్న ప్రశ్న కలగడం సహజం. ఆరోజుల్లో కంపెనీవారు తయారు చేసిన మజిలీపట్టీలు కూడా ఉపయోగపడలేదుట. ఆ పట్టికలలో కొన్ని గ్రామాలపేర్లు లేవు, ఉన్నాయన్న గ్రామాలు లేవు, గ్రామాలమధ్య దూరం కూడా సరిగా లేదు అని రాసేరు. వీరాస్వామయ్యగారు

కాలినడకన రోజుకి ఎన్నిగంటలలో ఎన్ని క్రోసులు నడిచేరు, బాట ఎలా ఉంది, నదులు దాటవలసివస్తే పడవలయితే ఎంత కూలి ఇచ్చేరు, పడవలు లేని చోట మొలబంటినీటిలో నడిచి వెళ్ళినప్పుడు కలిగిన అసౌకర్యాలేమిటి – ఇవి చదువుతుంటే అయ్యబాబోయ్ నిజంగానే? అనిపించింది. ఒకటి రెండు సార్లు దూరం మూడు ఘడియలు, ఆరు ఘడియలు అంటూ కాలమానంలో వివరించేరు. తాము ఆగిన ప్రతి ఊరులోనూ ఎన్ని బ్రాహ్మణగడపలున్నాయి, మొత్తం ఊరి జనాభా ఎంత, అక్కడ దొరికే వంట దినుసులు ఏమిటి వంటివి వివరంగా రాసేరు. వంటదినుసులమాటకొస్తే, పదే పదే కనిపించినవి బియ్యం, చింతపండు, మిరియాలు, తమలపాకులు. బెంగాలులో బ్రాహ్మణులు చేపలు తినడంగురించి ఆయన ప్రశ్నిస్తే "మీరు తాంబూలంలో గుల్లసున్నం వాడడం లేదా" అని ఎదురు ప్రశ్న వేసేరుట వారు. వారు అడిగేవరకూ తమకు తోచనేలేదని వీరాస్వామయ్యగారు రాసేరు. ఇక్కడ చదివేవరకూ నాక్కూడా తెలీదు గుల్లసున్నం చేపలఎముకలనించి తయారు చేస్తారని. ఆంధ్రబారతిలో గుల్లసున్నం పదానికి అర్థం నత్తగుల్లలు కాల్చి చేసినది అని ఉంది. అలాగే డబ్బువిషయంలో తేడాలు కూడా రాసేరు - చెన్నపట్టణం రూపాయి వేరు, హైదరాబాదు రూపాయి వేరు. చెన్నపట్టణంలో వాడుకలో ఉన్న దుడ్డు, గవ్వలు లాటి ద్రవ్యం హైదరాబాదులో లేదు. చెన్నపట్టణంరూపాయలు హైదరాబాదురూపాయలకి మార్చుకున్నప్పుడు లేదు కానీ నాగపూర్ రూపాయలలోకి మార్చుకున్నప్పుడు కొంత తరుగు పోయిందిట.

ఆసక్తి రేకెత్తించే విషయాలు ఈ పుస్తకంలో చాలానే కనిపించేయి నాకు. వీరాస్వామయ్యగారు అనేకవిషయాల్లో తమకి తాము ఆలోచించుకుని ఏర్పరుచుకున్న అభిప్రాయాలు ఉన్నాయి. పర్వతాలఉపయోగం ఏమిటి అంటే భూగోళము ఉదకబుద్బుదము కనక భూమిని స్థిరంగా ఉంచడానికి అవుసరం అంటారు (పు.89). భోజనసమయంలో బ్రాహ్మణులు చేసే పరిషేచనమువెనక వివేచన ఏమటి, ఆ ఆచారం

ఎలా వచ్చింది అని చర్చించి నానావిధములైన ఆచారములను ఆయా దేశములకు అనుగుణముగా స్మృతులు ఏర్పరచినాయని తీర్మానించేరు(పు. 126). కొందరు నదిలో స్నానాలకి కొందరు మడిబట్ట చేత్తో పట్టుకుని వెళ్తే, మరికొందరు కర్రకి తగిలించి తీసుకు వెళ్తారు. దక్షిణదేశంలో సంచీలో పెట్టుకుని  వెళ్తారు. ఇవన్నీ చూస్తే, "ఆచారములన్నీ మనోబంధకములే కానీ వేరే కావని తోచుచూ వచ్చుచున్నది" (పు. 180) అన్నారు ఆఖరికి.

ఉష్ణదేశాల్లో తేలికగా జఠరాగ్ని మందగతిని పొందుటచేత, తేలికగా జీర్ణమయే పదార్థాలు తింటారు. ఆ పదార్థాలు హృత్కమలమునకు పుష్టినివ్వదు కనక వారికి మనోదారుఢ్యము సమకూడదు. శీతలదేశాల్లో భోజనరీతులు, తత్ఫలితాలు పూర్తిగా వ్యతిరేకం (పు. 161).

స్త్రీలు మోక్షార్హలు కారు సరికదా నిత్యజీవితంలో సత్కర్మలు ఆచరించడానికి కూడా అర్హులు కారనే నిర్ణయానికి వచ్చేరు ఆయన ప్రయాగలో ఇతర పండితులతో చర్చించి. హృత్కమలంలో ఊర్ధ్వ, అధోగ్రంథులు రెండు ఉంటాయనీ, పురుషులకు ఊర్ధ్వగ్రంథులు వికసించుటచేత మేధ వికసిస్తుందనీ, స్త్రీలకు గర్భధారణాది క్రియలకు అనుగుణంగా అధోగ్రంథులు వికసిస్తాయనీ, అంచేత వారు పతిశుశ్రూష, కుటుంబ సంరక్షణ మొదలయిన ఐహికపనులయెడలనే ప్రవష్టలుగా నుండుట యుక్తమనీ తోచుచున్నది అంటారు. (పు. 210-212).

సూక్ష్మంగా ఒక్క మాటలో నాకు అర్థమయింది – స్త్రీలకి సంతానానికి ఉపయోగపడే అంగాలు మాత్రమే వికసిస్తాయి, పురుషులకి మేధ వికసిస్తుంది. (జీవశాస్త్రంగురించిన అవగాహన నాకు లేదు. తెలిసినవారెవరైనా చెప్పాలి ఈ వాదంలో సూక్ష్మవిషయాలు). నాకు కలుగుతున్న మరొక ఆలోచన ఏమిటంటే, వీరాస్వామయ్యగారి తరవాతితరంలో వచ్చిన వీరేశలింగంగారి విశ్వాసం కూడా అదే ధోరణిలో సాగింది. నిజానికి

వీరేశలింగంగారు మరో మెట్టు పైకి సాగి, స్త్రీలకి స్వతస్సిద్ధంగా ఆ సేవ చేయడం కూడా రాదు అని నిర్ణయించి, స్త్రీవిద్య ఉద్యమానికి నాంది పలికేరు. ఇది శాఖాచంక్రమణమే కానీ సమాజంలో స్త్రీలస్థానం ఎవరు ఎలా నిర్ణయిస్తున్నారు అన్న విషయం పరిశీలనకి వస్తే ఈ ఆలోచనావిధానాలు గమనించాలి అని చెప్పడానికి ఇక్కడ ప్రస్తావిస్తున్నాను.

వీరాస్వామయ్యగారు విస్తృతంగా చర్చించిన అంశం తాత్వికం. ఆత్మ, పరమాత్మ, అంతరాత్మ – వీటిమధ్య పరస్పరసంబంధం. ఇంకా , అద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతాలు, పంచద్రావిడులు, పంచగౌడులు, ఇలా అనేకానేక విషయాలు నాకు సంపూర్ణంగా అవగాహన కానివి ఉన్నాయి. అలాగే స్త్రీలలో కామేచ్ఛమీద వాతావరణప్రభావం, దాన్ననుసరించి పురుషుల మనోప్రవృత్తులవంటి విషయాలలో వీరాస్వామయ్యగారు ప్రతిపాదించిన అంశాలు గమనార్హం. సృష్టి, స్త్రీ పురుష అంగనిర్మాణం, ఆత్మ, పరమాత్మ, అంతరాత్మ చర్చలు, మానవశరీరం, జంతు శరీరం నిర్మాణం- అంతరార్థాలు (పు. 301-312) అర్థం చేసుకోడానికి కొంత కాలం వెచ్చించాలి పాఠకులు.

ఈనాడు ఆత్మహత్య మహాపాపంగా పరిగణించినా, శాస్త్రాలలోనూ, పురాణ గాథలలోనూ మహాత్ములు అనేకులు తమ తపశ్శక్తిద్వారానూ దృఢచిత్తంద్వారానూ ఇచ్ఛాపూర్వకంగా తమకి తాము నిర్ణయించుకున్నసమయంలో పరలోకగతులు కావడంగురించి చదువుకున్నాం. ప్రయాగలో స్వేచ్ఛామరణము అన్న ఆచారము ఉందిట. ఈ కథనంప్రకారం మరుజన్మలో తాము కోరినజీవనం కలగగలదనే విశ్వాసం గలవారెవరైనా ఈవిధంగా జీవితం అంతం చేసుకోవచ్చేమో అన్న అభిప్రాయం కలిగిందిట వారికి (పు. 196). “ఆత్మహత్య చేసుకుంటే చేసుకున్నావు; ఈశ్వరార్పితమని శ్రద్ధతో ఫలాని తావుకు పోయి విధిపూర్వకముగా చేయుము అనేట్టుగా యిక్కడ నియమించినారని నాకు తోచుచున్నది” అన్నారు వీరాస్వామయ్యగారు (పు. 200).

ఆర్యావర్తభూములలో పుణ్యభూమి అయిన మనదేశంలో మహమ్మదీయుల పాలన, ఆంగ్లేయులపాలనవంటి పాలనలు ఎందుకు వచ్చేయంటే వీరాస్వామయ్యగారు హిందువులలో మతము పునః ప్రతిష్ఠ చేయడానికే అంటారు. (339-340).

ఈ పుస్తకంలో భాష గ్రాంథికమే అయినా, ఈనాడు వాడుకలో లేని పదాలు చాలానే ఉన్నా, చదవడం కష్టమనిపించలేదు నాకు. నేను కేవలం నా సరదాకొద్దీ కొన్ని పదాలకి ఆంధ్రభారతి చూసేను కానీ చాలావరకూ సందర్భాన్ని బట్టి అర్థం చేసుకోడానికి వీలుగానే ఉన్నాయి. పుస్తకం చివరలో కొన్ని పదాలకి అర్థాలు ఇచ్చేరు. ఆ పట్టిక చూస్తే ఆ పదాలు 1940వ దశకంనాటికే అంటే ఒక దశాబ్దంలోనే వాడుకలోనుండి తప్పిపోవడం ఆశ్చర్యం అనిపించింది. నాకు నచ్చిన పదాలు కొన్ని – ఉపపన్నులు (ధనవంతులు), ఒక పొట్లముగా (సమూహముగా?) మిత్రభావము కలిగి, శేఖరం చేసేకొరకు (సిద్ధం చేయడానికి), శృంగారకట్ట (చీపురుకట్ట), ఆసోదా (విశ్రాంతి, మజిలీ), సోబతు (తోడు, సహవాసము). కొన్ని పదాలకి అర్థాలు ఆంధ్రభారతిలో కూడా దొరకలేదు.

కొన్ని పదాలకి ఆనాటి గుణింతాలు కూడా వింతగానే అనిపిస్తాయి ఇప్పుడు మనకి, బ్రాంహ్మణులు లాటివి (అధికంగా సున్నతో). చాలా సరదాగా అనిపించిన నుడికట్టు “తెలుగు మీఱు” తెలివి మీఱు అన్న అర్థంలో! “తోచబడుచున్నది” తమకి తోచుచున్నది అన్న అర్థంలో (301). తెలుగులో బడు ప్రత్యయమే తక్కువ. తోచబడు అన్న పదానికి అర్థం ఉందా? ఆంధ్రభారతిలో నాకు దొరకలేదు. అలాటిదే మరొక నుడికట్టు - భంగము కాకూడకుండా (310). గయలో లిపులు కూడా చాలా రకాలున్నాయిట - ఫార్షీ, సాహుకార్ల లిపి, బ్రాహ్మణి, గ్రంథాలు వ్రాసే లిపి, మార్వాడీలు వాడే మోడి, మారువాడిలిపి ఇలా (పు. 295).

ఈ పుస్తకంలో గుణింతాలగురించి ఒకమాట చెప్పాలి. ఇవి అచ్చుతప్పులు కావు కానీ మనకి అలవాటయిన అక్షరాలు కావని మాత్రమే చెప్తున్నాను. ముఖ్యంగా అంకెలు ఆరు, న పొల్లు, ర కింద మరొక హల్లు – ఇవి తికమకగా అనిపిస్తాయి. ఈ అక్షరాలు కీబోర్డులో లేవు కనక బొమ్మలుగా చూపుతున్నాను.

కృష్ణమూర్తిని :

ఇందులో తి తరవాత అక్షరం తొమ్మిది అంకెలా కనిపించినా, అది ‘ర’ కింద ‘త’వత్తు.

జమీన్దార్లు

ఈపదంలో ‘మీ’ తరవాత ‘న’ పొల్లు.

అలాగే, ఈకింది ఉదాహరణలో 2 తరవాత ఉన్నది 4 అంకె కాదు. “రెండవ”లో “వ” లాంటిది 24 గంటలకు

సామెతలు అట్టే లేవు కానీ ఉన్నవి రమ్యముగా ఉన్నాయి - కలిమెడు చల్లితే తూమెడు పండే పాటి చవుడు కలిగిన భూమి(పు. 174). ఎనిమిదిమంది చేరితే తొమ్మిది పొయిలు (204) వంటివి నాకు నచ్చేయి.

ఇవి కేవలం నా అభిప్రాయాలు. నా అవగాహనలో లోపాలు ఉండవచ్చు, ముఖ్యంగా వేదంతచర్చలు, మతసంబంధమైన వివరాలలో అని గమనించగలరు.

వీరాస్వామిగారి జీవితచరిత్ర, తదితర వివరాలు తెలుగు వికీపీడియాలో ఉన్నాయి. లింకు -

http://te.wikipedia.org/wiki/%E0%B0%8F%E0%B0%A8%E0%B1%81%E

0%B0%97%E0%B1%81%E0%B0%B2_%E0%B0%B5%E0%B1%80%E0%B0%B0%E0%B0%BE%E0%B0%B8%E0%B1%8D%E0%B0%B5%E0%B0%BE%E0%B0%AE%E0%B0%AF%E0%B1%8D%E0%B0%AF

ఆ వ్యాసం చివరలో కాశీయాత్ర పూర్తి పాఠం పిడియఫ్ ఫైలు లభ్యం.

(జనవరి 28, 2014)

# 2. గిడుగు రామ్మూర్తిగారి భాషాభేషజం

## ఆంధ్రపండిత భిషగ్వరుల భాషాభేషజం



వ్యావహారిక భాషోద్యమనాయకులు శ్రీ గిడుగు వెంకట రామమూర్తిగారు (1863-1940) రాసిన పుస్తకం మొదటి నూరు పుటలు చదివిన తరవాత నాకు కలిగిన ఆలోచనలే ఈ వ్యాసం. పుస్తకం మొత్తం డౌన్లోడ్ కానందున పూర్తిగా చదవడం కుదరలేదు. 80 ఏళ్ళ క్రితం రాసిన ఈ గ్రంథంలో మనం ఇప్పుడు కూడా ఆలోచించుకోవలసిన భావాలు చాలానే కనిపిస్తున్నాయి.

ఈ పుస్తకంలో వ్యాకరణచర్చలు, ప్రాచీన కావ్యాలలోనుండి రచయిత ఇచ్చిన అనేక ఉదాహరణలు నాకు అగమ్యగోచరమే అయినా నేను గుర్తించగలిగినవి నాకు అర్థమయినంతవరకూ ఈనాటి భావజాలానికి అనుసంధిస్తూ పరామర్శించడానికి ప్రయత్నిస్తున్నాను.

ఈ గ్రంథానికి నేపథ్యం - శ్రీ కొక్కొండ వెంకటరత్నము పంతులుగారు **ఆంధ్ర ప్రసన్న రాఘవము**, సంస్కృతకావ్యానికి తెనుగుసేత, 1897లో ప్రచురించేరు. ఆ గ్రంథాన్ని తీవ్రంగ విమర్శిస్తూ శ్రీ వేదము వెంకటరాయ శాస్త్రిగారు 2568 దోషాలు ఎత్తి చూపుతూ

324 పేజీల గ్రంథం **ఆంధ్ర ప్రసన్న రాఘవవిమర్శము అన్న పేరుతో** 1898లో ప్రచురించేరు. వేదమువారి గ్రంథాన్ని విమర్శిస్తూ శ్రీ గిడుగు వెంకట రామమూర్తి గారు 1933లో ప్రచురించిన గ్రంథం ఈ **ఆంధ్రపండిత భిషగ్వరుల భాషాభేషజం.**

మనం గుర్తుంచుకోవలసిన రెండో విషయం – కొక్కొండ వెంకటరత్నము పంతులుగారు సుప్రసిద్ధ సంప్రదాయవాదులు. వారిని గురించి రామమూర్తి గారు ఇలా అంటున్నారు, "వెంకటరత్నముగారు అంతటి పండితులు వేరొకరు లేరనిపించుకున్నవారు. "సలక్షమైన తెలుగు భాష" సుళువుగా రాయడమే కాక నిరాఘాటముగా మాటాడడము నేర్చినవారట. ఇంటివద్ద కూడా "సలక్షణమైన తెలుగే" వాడుట వారికి అలవాటుట. లౌకిక భాష గ్రామ్యమని పరిత్యజించినారట. నాటకములోనైనా అత్యధమపాత్ర వాక్యములందైనా గ్రామ్యభాష వాడకూడదనినారట. వేదము వెంకటరాయశాస్త్రిగారి నాటకములలో అట్టి గ్రామ్యము ప్రయోగించడము వెంకటరత్నము పంతులుగారిబుద్ధికి దోషముగా తోచినది. ఆ కాలములో గ్రామ్యద్వేషులందరూ శాస్త్రులవారిమీదికి దండెత్తి వచ్చినప్పుడు, పంతులుగారు వారికి కన్నాకుగానుండి శాస్త్రులవారితోనూ, వారిపక్షమువారితోనూ ఘోరయుద్ధము జరిపినారు."

అటువంటి మహామహోపాధ్యాయపండితుల గ్రంథములో వెంకటరాయశాస్త్రిగారు తప్పులు ఎత్తి చూపేరు అంటున్నారు రామమూర్తిగారు. వెంకటరత్నం పంతులుగారి గ్రంథంలో అనేకపదాలను గ్రామ్యభాషగా గుర్తించి, పండితులైనవారు గ్రామ్యబాష మాట్లాడడము నింద్యమని, తమవలె సదా సలక్షణముగా అందరూ మాట్లాడడము నేర్చుకోవలెనని వెంకటరాయ శాస్త్రులుగారు ఉపదేశించినారుట.

రామమూర్తిగారు ప్రధానంగా నిర్ధారించబూనినది – వెంకటరత్నము పంతులుగారి **ఆంధ్రప్రసన్నరాఘవము**లో వేదము వెంకటరాయశాస్త్రిగారు వేటిని తప్పులుగా గుర్తించి

హేళన చేసేరో అవే తప్పులు శాస్త్రిగారు తమ గ్రంథం (**ఆంధ్ర ప్రసన్నరాఘవ విమర్శనము**)లో చేసేరని. ఆ పైన వ్యావహారిక భాషని గ్రామ్యము అనీ పామరులు మాత్రమే వాడుతారు కానీ పండితులు వాడరనీ శాస్త్రిగారు దుయ్యబట్టడం రామమూర్తిగారు పూర్వపక్షం చేయదల్చుకున్న రెండవ అంశము.

ఆ సందర్భంలో గిడుగు వెంకటరామమూర్తిగారు వేదమువారి గ్రంథంలోనించి ఉదహరించిన వాక్యాలు కొన్ని - "... పూర్వులు చెప్పిన పాకములిందు లేవు. గ్రచ్చకాయపాకము, మేడిపండుపాకము, ముసిఁడిపండుపాకము, దృష్టిపిడతపాకము ... ఇత్యాదులు కలవు. ... ... వీరి మతముచే భాష చెడుచున్నదనియు గ్రహింతురు. ... సామాన్యముగా జనులు పరప్రత్యయనేయబుద్ధులు. తెలిసినవారును పత్రికలయందు రాగల దూషణలకు భయపడియు, నిజస్తుతి యెనగొనియు, "అపైతే మాభాగా యేదన్నమమ" మర్యాదగా ఆత్మాభిప్రాయములం ప్రకటింపరు. ఇఁదువలన భాష చెడిపోదా ... కావున ... ఆంధ్రభారతి కటాక్షము వడయువాఁడనై, జయదేవకవికి ఈ తెలుంగు వలనం గలిగిన చెట్టందొలంచుటకై ఈ విమర్శారంభముం చేసినాడ," అని వేదమువారు తమ విమర్శనాగ్రంథంలో చెప్పుకున్నారుట.

అయితే తెలుగుభాషని ఇంతటి మహోత్సాహంతో పరిరక్షించదలుచుకున్న వేదం వెంకటరాయ శాస్త్రులుగారి గ్రంథంలో అంతకుమించిన లోపాలున్నాయంటూ రామమూర్తిగారు ఇచ్చిన ఉదాహరణలు – గోకంబర్దు తెలుగు, గార్డెన్ టుకమ్ తర్జిమా, హటెంటాడ్ భాష ...టెంకాయ పిచ్చికొండ. వీటిలో కొన్ని పదాలకి నాకు అర్థం తెలీదు. కొన్ని చదువుతుంటే నవ్వాగలేదు.

ఇంకా కొన్ని–రోత, చెత్త, దగ్ధపటలము, అసహ్యము... లాటి పదాలు శాస్త్రిగారు ఎలా వాడేరని రామమూర్తిగారు ప్రశ్నిస్తున్నారు.

ఇంక అమిత పరుషమైన వేదమువారి విమర్శనావాక్యాలు – మున్ను తిక్కన శ్రీనాథులు ఆంధ్రీకరించిరి. ఇప్పుడు ఇట్టియ నేడమూకులు తొడగినారు. అందును వీరివలె పాడు చేసినవారు మఱి లేరు. వీరు పండితులట! తెలివిగలదట! విస్తరపాదపే దేశే హేరండోపి ద్రుమాయతే!! -- ఇలా సాగింది వెంకటరాయశాస్త్రిగారి విమర్శ.

ఇందులో తికమక ఎక్కడంటే – కొక్కొండ వెంకటరత్నము పంతులుగారు గ్రామ్యభాషని ద్వేషించేరు. ఆయన గ్రంథంలో గ్రామ్య భాష ఉపయోగించేరని వేదము వెంకటరాయశాస్త్రిగారు వెంకటరత్నము పంతులుగారిని దుయ్యబట్టేరు తమ విమర్శనాగ్రంథంలో. ఆ విమర్శనాగ్రంథంలో గ్రామ్యభాష ఉందని గిడుగు వెంకట రామమూర్తిగారు ఎత్తి చూపుతున్నారు. ఇక్కడ గ్రామ్యభాష, వ్యవహారిక భాష ఒకటి కాదని అనిపిస్తోంది. ఇది అర్థం చేసుకోడానికి నాకు గంటన్నరసేపు పట్టింది. అంచేత ఇలా సూక్ష్మంగా మళ్ళీ చెప్తున్నాను.

ఇంతకీ, పైన సూచనప్రాయంగా కొన్ని ఉదాహరణలు ఇచ్చేను కానీ రామమూర్తిగారు అంతకి పదింతలు ఉదాహరణలు చూపి, “ఈలాగున ఒకరినొకరు దూషించుకొనుట పండితులకు చెల్లినది కాబోలు” అన్నారు ఆఖరికి.

ఏతా వాతా రామమూర్తిగారు సూచించిన మందు - “మా ఉపదేశము ఏమిటంటే ఇద్దరు భాషా దేవులున్నారు. వారిలో నొకతె లౌకిక భాషాదేవి. ఆ యమ్మకు రోగమేమీ లేదు. పెద్దలయిళ్లే ఆయతనముగా చేసుకొని, వారి నోటిమాట మీరకుండా ప్రవర్తిస్తూ అందరితో కలిసి మెలసి, హాయిగా ఆడుతూ పాడుతూ ఆయురారో-గ్యైశ్వర్యాభివృద్ధి కలిగి, కులుకుతూ ఉన్నది. ప్రత్యేకముగా తమకోసమే పండితులు ఉంచుకొన్న భాషాదేవమ్మగారు, ప్రబంధబద్ధయై, ముసుగు వేసుకొని శుద్ధవాయువు, వెలుగు లేని చీకటిగదిలోనే పడుండి వ్యాయామము లేక, వింతవింత రోగాలెన్నో తగిలించుకొని ఎప్పుడు చూచినా మూలుగుతూ ఏ క్షణమో ఏ గడియో అన్నట్టు ఉంటారు. ఆ

యమ్మగారి రోగాలు పండిత భిషక్కుల భేషజాలవల్ల కుదిరేవి కావు. ఈ భేషజాలవల్లనే కొన్ని రోగాలు పుట్టినవి. వాటివల్లనే అవి ముదిరినవి. అవి కుదరకపోవడమే కాక కొత్త రోగాలు కూడా పుట్టుతున్నవి. పెండిత భిషక్కుల నిదానము తప్పినది. ఆ రోగాలకు ఒకటే చికిత్స. ముందుగా విరేచనాలకు మందిచ్చి అజీర్ణపదార్థాలు తొలగించి, లౌకికభాషాదేవి సంరక్షణలో పండిత భాషాదేవిని ఉంచితే, ఆమె పెట్టే పథ్యపానాలచేతను, చేసే ఉపచారములచేతను, రోగాలు కుదిరి ఈ దేవిగారు ఆరోగ్యవంతురాలు కాగలరు. లౌకికభాషాదేవితో కలిసి యున్నంతకాలము పండితుల భాషాదేవిగారు ఆరోగ్యము గలిగి బ్రదుకుతారు. వారి పరస్పర సంబంధము తెలియక, పండితభిషక్కులు  చేసే భైషజ్యము వ్యర్థమవుతున్నది. గనుక భాషాతత్త్వము తెలుసుకొని భాషారోగములకు భాషాభిషక్కులు భైషజ్యము చేస్తే కృతకృత్యులవుతారు. నాన్యఃపంథావిద్యతే2యనాయ. ఓం. శాంతిః శాంతిః శాంతిః." ఈ వాక్యాలు చదువుతుంటే నాకు అక్కిరాజు ఉమాకాంతంగారు 1914లో రాసిన ఎదుగని బిడ్డ కథ మనసులో మెదిలింది.

"పరిశీలించి చూడగా "లాక్షణికులు", "పండితులు" అనే అభిధానము గల వారందరూ నిర్దుష్టమని ఐకమత్యముగా అంగీకరించదగిన గ్రంథము ఒకటీ నేటివారు వ్రాసిన వాటిలో మాకు కనబడలేదు,"  అన్నారు రామమూర్తిగారు.

ఇప్పుడు మనకి ఏ పదం ఆమోదం ఏది ఆమోదం కాదు అన్న చర్చ అవుసరం లేదు. ప్రస్తుతం అందరూ వ్యవహారభాషని అంగీకరించేరు. మధ్యలో కొంతకాలం శిష్టజన వ్యావహారికం అంటూ పత్రికలు సృష్టించినభాష ప్రాచుర్యంలో ఉన్నా, అది కూడా బాగా మారిపోయింది మాండలీకాల్లో రాయడం మొదలయేక. తెలుగు రాత పూర్తిగా శబ్దాశ్రయం అయింది. మనకి పదం ఎలా వినిపిస్తుందో అలా రాస్తాం. మాండలీకాలూ, ప్రాంతీయాలూ, జాతీయాలూ ఎవరికి ఎలా వినిపిస్తాయో అలాగే అక్షరాల్లో కూడా

కనిపిస్తున్నాయి. ఈ అంశం రామమూర్తిగారు శనగలు, సెనగలు, శెనిగలు, శెనిగెలు – ఇలా అనేక రూపాలు చూపి విపులంగా చర్చించేరు. కదాచితుగా ఒకరూ ఇద్దరూ కళ్లు అని రాస్తే, మరి కొందరు వారిని కళ్ళు అని రాయాలని హెచ్చరించినా మొత్తంమీద తక్కువే. అన్నట్టు అప్రస్తుతమే అయినా చెప్పక తప్పదు రామమూర్తిగారు కళ్లు అనే రాసేరు. ళ కింద ల వత్తు సమ్మతమే అనిపించింది రామమూర్తిగారి పుస్తకంలో ఈ వాడుక చూసేక.

రామమూర్తిగారు “లోకములో ఉన్న శబ్దము కోశములోగాని వ్యాకరణములో గాని చేర్చకోకపోతే కోశమున్ను వ్యాకరణమున్ను తప్పులవుతవి గాని శబ్దము తప్పు కాదు. పరమప్రమాణముగా గ్రహించదగిన కోశముగాని, వ్యాకరణము గాని తెలుగభాషకు ఇప్పటికింకా ఒక్కటీ ఇంకా పుట్టలేదని అందరు ఎరుగుదురు. ఉన్నమట్టుకైనా అవి పెద్ద పెద్ద పండితులకే ఉపచరించడము లేదు. సామాన్యులు కోశములు, వ్యాకరణములు ఎన్ని ఉన్నవో అన్నిన్ని దగ్గర పెట్టుకొని ఒక శబ్దము సాధువో కాదో అన్నిటిలోనున్ను వెదికి చూచి తెలుసుకుని మరీ వ్రాస్తారా?” అన్నారు.

తెలుగు నిఘంటువులవిషయంలో పరిస్థితి ఈనాటికీ అలాగే ఉంది. పైగా రామమూర్తిగారే చెప్పినట్టు వ్యావహారికభాష రాసేవారు నిఘంటువులు చూసుకుని రాయరన్నమాట కూడా అంతే.

ఈ మధ్యకాలంలో మనకి నిఘంటువులు చాలానే వచ్చేయి కానీ సమగ్రంగా తెలుగుపదాలన్నీ – వాడుకలో ఉన్నవీ లేనివీ సేకరించి సమకూర్చిన నిఘంటువు లేదు. నిజానికి ఇప్పుడు ప్రాంతీయభాషల్లో రాయడం వచ్చేక అది అసాధ్యమేమో అని కూడా నాకనిపిస్తోంది.

కొంతవరకూ ఈనాటి సమాజానికి అనుగుణంగా అంతర్జాలంలో లభిస్తున్న ఆంధ్రబారతి, బ్రౌణ్యనిఘంటువు  చెప్పుకోవచ్చు. అయితే, ఇవేవీ కూడా సమగ్రం కాదు. ఈపుస్తకం చదువుతున్నప్పుడు కొన్ని పదాలకి నాకు అర్థాలు దొరకలేదు ఈ నిఘంటువులలో. American Heritage dictionary of English language లో ఒకొక పదం ఎన్నిరకాలుగా వాడుకలో ఉన్నాయో అవన్నీ కూడా చేర్చారు. అందుచేత నేను ఈవిషయం ఇక్కడ ప్రస్తావిస్తున్నాను. రెండోది, పైన చెప్పినట్టు వివిధ ప్రాంతాల్లో పలికే వివిధ రూపాలు, వాటికి వేరు వేరు అర్థాలు ఉండడం – ఇవన్నీ సేకరించి సంపూర్ణమైన నిఘంటువు తయారు చేయడం విశేష శ్రమతో కూడిన పని.

రామమూర్తిగారు ప్రత్యేకించి ఎత్తి చూపిన మరొక అంశం పండితులు ఒకరినొకరు తప్పులు పట్టడం, దూషణ, భూషణ తిరస్కారాలు. అవి ఇప్పటికీ కొనసాగుతూనే ఉన్నాయి. ఇప్పుడు పండితులే కానక్ఖర్లేదు. అది అధికసౌకర్యం. అప్పటిలాగే ఇప్పుడు కూడా ఎవరి అనుయాయులు వారికి  ఉన్నారు. ఇలా చిన్న చిన్న ద్వీపాల్లా స్థిరపడిపోయి ఎవరిభావాలు వారు సమరోత్సాహంతో కాపాడుకుంటే సరస్వతీదేవికి లాభమా నష్టమా ఆ యా ద్వీపాలే చెప్పాలి. ఇప్పుడు భాష మీద చర్చలు తక్కువయేయి. భావాలు, అభిప్రాయాలగురించిన చర్చలు ముమ్మరంగా కోలాహలంగా సాగిపోతున్నాయి. ఇవి ఎక్కడికి దారి తీస్తాయో కాలమే చెప్పాలి.

వ్యావహారికమా, శుద్ధ ఆంధ్రమా, గ్రామ్యమా అన్న ప్రశ్న ఇప్పుడు లేదు కానీ భాషకి సంబంధించిన విమర్శలో ఇంగ్లీషుపదాలు ఇనుమిక్కిలిగా చోటు చేసుకోడం. నాకూ నాలాటివారికీ అది అభ్యంతరం. ఒక తెలుగువాడు మరొక తెలుగువాడితో Telugu is sweeter than honey అని ఇంగ్లీషులో చెప్పవలసిన అవుసరం ఏమిటి? అలా చెప్పేరంటే తెలుగుభాషకి పైన రామమూర్తిగారు చెప్పినజాడ్యంలాటిదేదో ఇంకా ఉందనీ,

ఇంతకాలమైనా ఇంకా వదలలేదనే అనుకోవాలి. రోగలక్షణాలు మారేయేమో కానీ రోగం పోలేదు.

అలాగే దూషించుకోడం – పూర్వం అచ్చతెలుగులో సాగితే, ఇప్పుడు తెల్గిష్ లేక తెంగ్లిషుగా చెల్లుతున్న సంకరభాషలో సాగుతోంది. భాషలో అదొక చెప్పుకోడానికి సిగ్గు పడవలసిన మార్పు.

చివరిమాటగా, నేను ఇలా వెనకటిరోజుల సాహిత్యం చదివినప్పుడు నాకు తెలీనిపదాలు జాగ్రత్తగా పరిశీలించి చూసుకుంటున్నాను. కొత్తవి నేర్చుకుంటున్నాను.
మరిచిపోయినవి మళ్లీ మననం చేసుకుంటున్నాను. ఆ వరసలో నేను రాసుకున్నవి -

**- కన్నాకు** - తాంబూలంలో తొలి తమలపాకు, శ్రేష్ఠుడు, తలమానికమయిన(ది, వాడు),

- పరప్రత్యయనేయబుద్ధులు - ఇతరులమాట నమ్మేవారు.

**- ప్రాణసంశయదశ -** ప్రాణంమీదికి రావడం.

**- చెట్టం దొలగించి -** చెట్ట అంటే చెడు అంటే తప్పులు తొలగించి.

**- ఇట్టియ నేడమూకులు తొడగినారు** – ఈవాక్యానికి అర్థం ఫేస్బుక్కులో అడిగితే, సురేశ్ కొలిచాల గారు ఇచ్చిన వివరణ, "ఏడ(ము) అంటే చెముడు, మూకుడు అంటే మూగవాడు," అని.

నాకు అర్థం కాని మరో వాక్యం – అపైతే మాభాగా యేదన్నమమ. సంస్కృతంలా ఉంది.

మరొక చిన్న విశేషం – సంభాషణల్లో "నేను", "మీరు" ప్రయోగం. నా కాలేజీరోజుల్లో నాకొక ముస్లిమ్ స్నేహితురాలుండేది. ఆ అమ్మాయి ఎదటివారిని నువ్వు అనేది,

తనని మేము అని చెప్పుకునేది. అప్పట్లో అది ముస్లిమ్ వాడుక అని నేను అనుకున్నాను. ఇప్పుడు ఈ గ్రంథంలో రామమూర్తిగారు "మేము" అని వాడడం చూసినతరవాత ఈ అలవాటు రాజులలోనూ, పండితులలోనూ కూడా ఉందని జ్ఞాపకం వచ్చింది. బహుశా ఇతర గ్రంథాల్లో కూడా చూసే ఉంటాను కానీ నాకు ఇప్పుడు ఇలాటి ప్రయోగాలమీద యావ ఎక్కువయింది కనక ఇది ప్రత్యేకంగా తోచింది.

మేము ప్రయోగంగురించి ఏల్చూరి మురళీధర రావుగారి వివరణ – శ్రీ గిడుగు సీతాపతిగారూ, శ్రీ గిడుగు రామమూర్తిగారూ కలిసి గ్రంథాలు రాసారు. అందుచేత పై గ్రంథంలో మేము అన్న పదం తామిద్దరు అన్న అర్థంలో వాడడం జరిగింది అని.

శ్రీ ఏల్చూరి మురళీధరరావుగారు సహృదయతతో ఇచ్చిన లింకులు కింద చూడగలరు.

వేదము వెంకటరాయ శాస్త్రిగారి విమర్శనము, గ్రామ్యభాషమీద వారి వ్యాసములకు లింకులు -

https://archive.org/.../AndhraPrasananaraghavaVimarshanamu

https://archive.org/details/srisharadakaanch023652mbp

శ్రీ జె.కె. మోహన రావుగారు వ్యావహారిక భాషోద్యమముకోసం ఈమాట.కామ్ జూన్ 2008 సంచికను ప్రత్యేకముగా కేటాయించినదని చెప్పారు. వివరాలకు http://eemaata.com చూడగలరు.

(జనవరి 18, 2014)

# 3 కె.యన్. కేసరిగారి చిన్ననాటి ముచ్చట్లు



కె.యన్. కేసరిగా సుప్రసిద్ధులయిన కోట నరసింహంగారి (1875-1953) పేరు వినగానే చాలామందికి గుర్తుకొచ్చేది కేసరికుటీరం, గృహలక్ష్మి స్వర్ణకంకణం. 1952కి పూర్వం **గృహలక్ష్మి**, **ఆంధ్రజ్యోతి** మాస పత్రికలలో ధారావాహికంగా ప్రచురించిన వ్యాసాలు ఈ పుస్తకంగా 1953లో ప్రచురించేరు. మళ్లీ 1989 నవంబరునుంచి 1991 జులైదాకా **జగతి**లో ప్రచురించేరు. కేసరికుటీరం శతజయంతి సందర్భంగా 1999లో ప్రచరించిన రెండవ ముద్రణ ఈ **చిన్ననాటి ముచ్చట్లు.**

రచయిత ఈ పుస్తకాన్ని **చిన్ననాటి ముచ్చట్లు** అన్నారు కానీ ఇది వారి చిన్ననాటి ముచ్చట్లకే పరిమితం కాలేదు. తమ 73 ఏళ్ళ జీవితశేషాలూ ఉన్నాయి ఇందులో. స్వగ్రామం ఒంగోలు తాలూకాలోని ఇనమనమెళ్ళూరు. కేసరిగారి 5వ ఏట తండ్రి మరణించారు. కేసరిగారూ, వారి తల్లీ ఉదరపోషణార్థం చాలా కష్టపడవలసివచ్చింది. తాను విస్తరాకులు కుట్టడం, తల్లి రవికెలు కుట్టడంవంటి పనులు చేసేవారుట పూట గడవడానికి. ఆయన ఆనాటి జీవితం వర్ణిస్తుంటే, వాటితోపాటు ఇప్పుడు మనకి తెలీని కొత్తవిషయాలు ఎన్నో తెలుస్తాయి. ఉదాహరణకి - పొలాల్లో రైతులు కందిమొక్కలు నరికేసినతరవాత మొండికొసళ్ళతో దుంపలు భూమిలో వదిలేస్తారు. అవి మళ్లీ విత్తు

నాటడానికి ఆటంకమే అయినా తాపై తవ్వకానికి పూనుకునేవారు కారు. ఊళ్లో ఆడవాళ్ళు వెళ్ళి అవి తవ్వుకుంటాం అంటే రైతులు తవ్వుకోనిచ్చేవారు. కేసరిగారి తల్లి కూడా వెళ్ళి ఆ దుంపలు తవ్వి తెచ్చి ఎండబెట్టి పొయ్యిలో వంటచెరుకుగా వాడుకునేవారుట. ఇలా ఏవో దుంపలు వంట చెరుకుగా ఉపయోగపడతాయని నాకు ఇది చదివేకే తెలిసింది.

తల్లి అవస్థలు చూడలేక, కేసరిగారు 11వ ఏట బయల్దేరి కాలినడకన మద్రాసు చేరుకున్నారు. అక్కడ అనేక కష్టనష్టాలకోర్చి, స్థానికుల ఔదార్యంతో చదువుకుని, ఆయుర్వేద వైద్యులుగా జీవితం కొనసాగించారు. స్కూల్లో చదువుకుంటున్నరోజులలోనే కష్టాల్లో ఉన్నవారికి సహాయం చేయడం ఆయనకి అలవడింది. అనేక సంఘసేవా కార్యక్రమాలు చేపట్టారు. పదవీ విరమణ తరవాత వారు దేశయాత్ర చేసేరు. అంచేత ఈ పుస్తకం వారి పూర్తి జీవిత చరిత్ర అనే అనాలి.

కేసరిగారు వైద్యంలోనూ, సాంఘికసంక్షేమ కార్యక్రమాలు చేపట్టడంలోనూ మాత్రమే కాక, కథ చెప్పడంలో కూడా సిద్ధహస్తులే అనిపిస్తుంది ఈ ముచ్చట్లు చదువుతుంటే. నొప్పి కలిగించే సంగతులు చెప్తున్నప్పుడు కూడా హాస్యరసం గుప్పించడానికి అవకాశం ఉంటే వదిలుకోరు ఆయన. ధర్మరాజువంటి మేనమామ ఎదురింట్లో ఉన్నారు కానీ వారిభార్య గయ్యాళిగంప అవడంమూలాన ఆయన ఏమీ సహాయం చేయలేకుండిరిట. ఆ అత్తగారు "ఎవరినైనా తిట్టదలుచుకుంటే తిట్టిన తిట్టు తిట్టకుండా రెండు మూడు గంటలకాలము తిట్టగల శక్తి ఆమెకు గలదు" అంటారు!

కేసరిగారి హాస్యచతురత మరో మెట్టు పైన ఉంది వారు మద్రాసులో ఉండగా "అరవ గృహలక్ష్మి" "తెలుగు గృహలక్ష్మి" (ఈరెండు పేర్లు, అరవతల్లి, తెలుగుతల్లి ఆయన వాడిన పదాలే) ఆచరణలో పెట్టే ఆచారవ్యవహారాలు వరసగా వర్ణించినప్పుడు. ఈ భాగం చదువుతుంటే, నేను నవ్వి నవ్వి, కళ్ళనీళ్ళొచ్చి, అరనిముషం ఆగి, ఆ తడి

ఆరేక మిగతాది చదివాల్సివచ్చింది. అరవ గృహలక్ష్మి(పు. 37-42) యిల్లు శుభ్రంగా ఉంచుకుంటుంది. వస్తువులు పొదుపుగా వాడుకుంటుంది. ఆమె చేసే వంటకాలు ఆరోగ్యకరమైనవి. అరవవారి అలవాట్లూ, ఆచారాలూ ఎన్నో తెలుస్తాయిక్కడ. తరవాత తెలుగు గృహలక్ష్మి (పు. 43-50) విషయం ఆయన సీదాగా చెప్పుకుపోతున్నట్టే కనిపిస్తుంది కానీ ఆ విషయాలు పట్టలేనంత నవ్వు తెప్పిస్తాయి. తెలుగు వంటకాలు వర్ణిస్తుంటే ముందు కొంచెం నవ్వుకుని తరవాత కొంచెంసేపు బాధ పడ్డాను. ఎందుకంటే నా వంటా, తిండీ కూడా అలాగే ఉంటాయి మరి! తలస్నానాలు, గిన్నెలు తోమడానికి ఉపయోగించే వస్తుసంచయం, భోజనాలయినతరవాత ఎవరేం చేస్తున్నారు – ఇలా సాధారణంగా మగవాళ్ళు పట్టించుకోరు అనుకున్నవన్నీ కేసరిగారు విపులంగా వర్ణించేరు. కావేరీతీరవాసులు చన్నీళ్ళతో స్నానం చేస్తారు. అంచేత జుత్తు మృదువుగా నిగనిగలాడుతూ ఉంటుంది. తెలుగు తల్లులు అత్యుష్ణము అయిన కుంకుడుకాయ నురుగు వాడడంచేత తల వెంట్రుకలు వరిగడ్డివలె గరగరనుండును అంటారు. ఆయన ఆడవాళ్ళనీ, వంటింట్లో వారిచేతలనీ అంత సూక్ష్మంగా పరిశీలించడం నాకు ఆశ్చర్యమనిపించింది. మాయింట్లో మగవారికి గరిటేదో గిన్నేదో తెలీదు మరి.

అలాగే అరవవారు తెలుగు నేర్చుకోడం కూడా. అరవలాయర్లు తెలుగు లాయర్లకంటే త్వరగా వృద్ధిలోకి రావడానికి కారణం ఆ లాయర్లూ, వారి భార్యలూ కూడా తెలుగు నేర్చుకుని తెలుగువాళ్ళ వ్యాజ్యాలు తేలిగ్గా సంపాదించుకోడం. మొత్తమ్మీద కేసరిగారు అనేక విషయాల్లో అరవవారిపద్ధతులు మెచ్చుకుంటారు. తమపనులు సాధించుకోడంలో వారికి వారే సాటి అంటారు. నిజమేనేమో కూడా. తమిళులయి పుట్టి తెలుగుభాషకి అపారమైన సేవ చేసినవారు అప్పుడే కాదు ఇప్పటికీ ఉన్నారు కదా.

మద్రాసులో వివిధ కట్టడాలు, వీధులపేర్లు, నీటి ఎద్దడి, నీటికరువుమూలంగా 1779లో కలరా వ్యాపించడం, జననష్టంలాటి చారిత్రకవిషయాలు, అద్దెఇళ్ళలో మృతి చెందితే,

వారి కుటుంబం కర్మ చేయడానికి పడే అగచాట్లువంటి విషయాలు ఎన్నో ఉన్నాయి ఈ పుస్తకంలో. వ్యక్తిగతస్థాయిలో బీదవిద్యార్థులు భుక్తికోసం, వాసంకోసం పడే అవస్థలు, వారిని ఆదుకునే ఉదారులు, తిండి పెట్టే తల్లులు – ఇవన్నీ మనసున నాటుకునేలా చెప్పేరు కేసరిగారు. అలా తనకి భోజనం పెట్టిన తల్లులు, భుక్తికోసం తనతల్లి పడిన బాధలే కారణం ఆయన స్త్రీ సంక్షేమ కార్యక్రమాలు చేపట్టడానికి అన్నారు. అలాగే అనారోగ్యంతో బాధ పడే స్త్రీలు, నాటువైద్యం పేరుతో వారిని  కుటుంబసభ్యులు, ఊళ్లో జనం పెట్టే హింసలూ చూసి కేసరి కుటీరం ప్రారంభించి మందులు తయారు చేసి వైద్యం చెయ్యడం ప్రారంభించేరుట. ఆయన మొదట్లో ఇచ్చిన మందులు కూడా ఏవో మూలికలు నూరి తయారు చేసినవే అంటే మరి అవి శాస్త్రీయమేనా అన్నది నాకు స్పష్టంగా అర్థం కాలేదు.

కేసరిగారి వైద్యవిద్య సాంప్రదాయకపద్ధతిలో సాగనూ లేదు, తేలిగ్గా పూర్తి కానూ లేదు. ఆరోజుల్లో మద్రాసులో ఆయుర్వేదం నేర్పే కళాశాలలు లేవుట. అంచేత వైద్యం చేస్తున్నవారిదగ్గర చేరి, వారికి సేవలు చేస్తూ వైద్యం నేర్చుకున్నారు. మొదట ఒకరిదగ్గర చేరి, అక్కడ వెట్టి చాకిరీయే తప్ప నేర్చుకునేదేమీ లేదని తెలుసుకుని వారిని వదిలేసి, మరొకరిదగ్గర చేరేవారుట. ఆ అనుభవాలు చదువుతుంటే వారికి ఆ వైద్యవిద్య నేర్చుకోవాలన్న పట్టుదల ఎంత బలమైనదో తెలుస్తుంది మనకి. తరవాత కేసరి కుటీరం ప్రారంభించడం, అందులో ఒడిదుడుకులు, స్నేహంగా దగ్గర చేరి, కేసరిపేరు వాడుకుని దొంగమందులు అమ్ముకునేవారూ, వారిని ఎదుర్కొని, కోర్టుకి కూడా ఎక్కి, తమ పేరు నిలుపుకుని జీవితాన్ని సార్థకం చేసుకోడం విపులంగా రాసేరు. కేసరి కుటీరం వివరాలు బాగానే ఉన్నాయి కానీ 1928లో  గృహలక్ష్మి పత్రిక ప్రారంభించడం, స్వర్ణ కంకణం స్థాపనకి సంబంధించిన వివరాలు అట్టే లేవు. గృహలక్ష్మి 1928లో ప్రారంభించడం, కనుపర్తి వరలక్ష్మమ్మగారు సంపాదకవర్గంలో ఉండడం,

1934లో స్వర్ణ కంకణం అందుకున్న తొలిమహిళ ఆమెయే కావడం వంటి విషయాలు కేసరిగారు చర్చించకపోవడం ఆశ్చర్యం.

మద్రాసునించి ఇనమనమెళ్ళూరు పడవలో వెళ్తున్నప్పుడు వంటలూ, పాటలు సరదాగా ఉన్నాయి. తరవాతికాలంలో ఆయన దేశాటనం వివరాలు ఎక్కువగానే ఉన్నాయి. కొన్ని చోట్ల ఆయన ఊరు తరవాత ఊరు చెప్పుకుపోతుంటే, నాకు చిన్ననాడు రైలుప్రయాణంలో స్టేషను తరవాత స్టేషను చూస్తూ కూర్చున్న దృశ్యం పొడగట్టింది, ఒక స్టేషనుకీ మరో స్టేషనుకీ అట్టే తేడా ఉండదు, ఏ ఒక్కటీ ప్రత్యేకంగా మనసున గట్టిగా నాటదు. కానీ కొన్ని స్టేషనులు మాత్రం చాలా ఆసక్తికరంగా ఉన్నాయి.

కేసరిగారు వర్ణించిన కోటప్ప కొండ, అక్కడ సంబరాలు, ఎద్దులపొంకం, ముచ్చటగానూ, విజ్ఞానదాయకంగానూ ఉన్నాయి. ఆ ఎద్దులకి రైతులు చేసే అలంకరణలు, పెట్టే ఆహారం చదివి తీరాలి. ఆ ఎద్దులు అలంకారాలతో వయ్యారాలు పోతూ పెళ్ళి కొడుకులా నడుస్తుంటే కన్నులపండువగా ఉండునుట. అవి వేయు రంకెలు శంఖారావమువలె శ్రావ్యముగా ఉండునుట. “సంగీతశాస్త్రమునందు ఈ రంకెనే రెండవదియగు ‘రి’ అని నిర్ణయించిరి. ఈ స్వరముచే వీరరసము, అద్భుతరసము, రౌద్రరసము వెల్లడి యగునని చెప్పబడినది,” అంటారు. ఈ ప్రాంతాలలో స్త్రీలు మంచి అంగసౌష్ఠవంతో, స్వతంత్రప్రవృత్తులై, ధైర్యసాహసాలతో ఉంటారుట. స్థానికంగా చెప్పుకునే ఒక కథ - సంబరాలసమయంలో పోలీసులు వచ్చి ఎద్దుమీద తుపాకి పేలిస్తే, ఒక “రెడ్డి సోదరి కోక విరిచికట్టి, గండ్రగొడ్డలి చేతబట్టి ముందుకురికింది”ట. అలాగే కేరళ. కేరళ స్థలపురాణం – ఎలా ఏర్పడిందో చెప్పి, ఆ ప్రాంతం ఇతర ప్రాంతాలకంటే ఎంత భిన్నమో చాలా విపులంగా వర్ణించేరు. అక్కడ కూడా స్త్రీలు స్వతంత్రప్రతిపత్తి కలిగి ఎన్నో విషయాల్లో ఎంతో ముందు ఉన్నారని సోపపత్తికంగా ఋజువు, సాక్ష్యాలతో చెప్పేరు.

ఆనాటి సంగీత నాటకరంగాలు, లలితకళలు – వీటిల్లో తమకి గల ఆసక్తిని వెల్లడిస్తూ, ఆయా రంగాల్లో ప్రముఖులగురించి చదువుతుంటే ఈనాటికీ మనందరికీ తెలిసిన పేర్లు కొన్ని, ఏనాడూ వినని పేర్లు కొన్ని తెలిశాయి. నాటకాలగురించి రాస్తూ, ఒక ఆచారంగురించి చెప్పేరు. సత్యభామ వేషధారి తెరవెనకనుండి జడ ముందుకు వేసి, సభలో ఎవరైన భాగవతవిషయమై ప్రశ్న అడిగితే జవాబు చెప్పగలనని సవాలు చేస్తుందిట. భాగవతమే కాదు సకలశాస్త్రములను తెలిసినదై యుండును అన్నారు. ఆయుర్వేదరీత్యా పిండోత్పత్తి మొదలు శిశుపోషణ వంటి విషయాలు, నాయికానాయకుల లక్షణాలు, ఇలా ఒకటి రెండు రాత్రిళ్ళు ఉపన్యసిస్తారుట. బోగంవారు విదుషీమణులని మనం వింటూనే ఉన్నాం.  వెనకటి రోజుల్లో రంగాజమ్మ, ఆధునికయుగంలో వీణ ధనమ్మ, బెంగుళూరు నాగరత్నమ్మవంటివారి పేర్లు అప్పుడప్పుడు వింటాం. ఇంకా వినని పేర్లు ఎన్నో ఉండవచ్చు. ఈ విషయంలో చాంద్రాయణమే అయినా నాఅభిప్రాయం మరొకసారి ఇక్కడ చెప్పాలనిపిస్తోంది. మనసంఘంలో ఒక తరగతి స్త్రీలని ఎంతగా చర్చకి పెట్టేరో, ఎందుకు పెట్టవలసివచ్చిందో అని ఆలోచించినప్పుడు తోచిన ఆలోచన - వీరేశలింగంగారు వేశ్యలని కులకాంతలుగా చేయడానికి ప్రయత్నిస్తే, చలం కులకాంతలని వేశ్యలుగా మార్చేరు. లత మాత్రమే వేశ్యలని మామూలు మనుషులుగా చిత్రించేరు. ఇప్పుడు మళ్ళీ కేసరిగారు వేశ్యలని విదుషీమణులుగా, కళాస్రష్టలుగా ఎత్తి చూపించేరు. చారిత్రకంగా వరస – వీరేశలింగం, కేసరి, చలం, లత!

ఇతర వివరాలు – కేసరిగారి మొదటిభార్యకి పిల్లలు లేరు. చాలాకాలం అనారోగ్యంతో బాధ పడుతూ ఉండేది. ఆయన 43వ యేట ద్వితీయవివాహం చేసుకున్నారు కేరళయువతి అయిన మాధవిగారిని. ఆమె వైద్యవృత్తికి సంబంధించిన విషయాల్లో నిపుణురాలు. కేసరి కుటీరం నడపడంలో చాలా సాయపడ్డారు. వారికి ఒక కూతురు, పేరు శారదాదేవి. ఆ తరవాత మైసూరులో ఉండగా “చాముండేశ్వరి మాకు మరొక

కుమార్తెను ప్రసాదించినది, ఆమె పేరు వసంతకుమారి," అని రాసేరు. ఈ రెండవ అమ్మాయి పెంపకం అని బ్లాగరు ramv అన్నారు కానీ పైవాక్యంలో అది స్పష్టం కావడంలేదు. ప్రత్యేకించి నాకు ఈ సందేహం కలగడానికి కారణం, ఇంకా కొందరు బాలబాలికలను చేరదీసి, చదువు చెప్పించి, వాళ్ళకో దారి చూపించేరు. వారెవరినీ ఇలా కూతురు, కొడుకు అనలేదు.

కేసరిగారు మరణించిన తరవాత, రెండవ అమ్మాయి వసంతా మీనన్ అన్నపేరుతో ఈ **చిన్ననాటి ముచ్చట్లు** పుస్తకాన్ని ఇంగ్లీషులోకి అనువదించిందని శ్రీరాంవి. తమ బ్లాగులో రాసేరు. లింకు [http://sriramv.wordpress.com/2008/03/29/dr-kn-kesari-a-profile/#comment-9555](http://sriramv.wordpress.com/2008/03/29/dr-kn-kesari-a-profile/#comment-9555).

ఆ టపాలోనే మరొక విషయం – ఈ అనువాదం వసంతా మీనన్ అనువదించగా, వారి మనుమడు కె. బాలకేసరి (శారదాదేవి మూడవ కుమారుడు) ఎడిట్ చేసేరుట. ఈ ఎడిటింగులోనూ, తరవాత ప్రచురణ వివరాల్లోనూ నాకు కొంత అయోమయం కనిపిస్తోంది. ఈ ఎడిటింగ్ విషయంలో వి.ఎ.కె. రంగారావు శ్రీరాంవి. గారికి చెప్పిన మాట ఏమిటంటే - కేసరిగారు తమ పుస్తకంలో వెలిబుచ్చిన అభిప్రాయములు ఆయనరోజులలో అంగీకారమే అయినా ప్రస్తుతకాలంలో తగనివి అని కొన్ని భాగాలు బాలకేసరి ఎడిట్ చేసేరని. ఈ ఎడిటింగ్ 1970లో రెండవ ముద్రణలో చేసేరు అని కూడా అన్నారు.

నేను ఈవ్యాసానికి ఉపయోగించుకున్న కాపీ రెండవ ముద్రణ 1999లో ప్రచురించినట్టు లోపలి టైటిలుపేజీ వెనకవేపు ఉంది. ఇందులో 1970 నాటి ముద్రణ ప్రస్తావన లేదు. మరొక ముఖ్యమైన విషయం - నాఅభిప్రాయంలో ఇలా ఎడిట్ చేయడం ఉచితమూ కాదు, న్యాయమూ కాదు. మనం పూర్వకాలపు రచనలు చదవడానికి ముఖ్యమైన ఒక కారణం ఆనాటి భావజాలం తెలుసుకోడంకోసం. ఎడిటర్లు తమ అభిప్రాయాలని

వెలిబుచ్చుతూ విస్తృతమైన సంపాదకీయమో పీఠికో రాయవచ్చు. కానీ పుస్తకంలో అభిప్రాయాలు ఈనాటిపాఠకులకి రుచించవని చెప్పి మార్చడం తగదు. అలా చేస్తే ఆ మూలగ్రంథానికున్న విలువ తరిగిపోతుంది. మూలగ్రంథకర్తకి అన్యాయం చేసినట్టు అవుతుంది. ఇది అనువాదాలవిషయంలో మరీ ఘోరం. ఎందుకంటే, మూలభాష తెలియనివారు చదువుతారు కనక, వారు అదే వేదం అనుకుంటారు. అసలువిషయం అడుగున పడిపోతుంది.

కేసరిగారి జీవితమూ, సాంఘికసేవావిశేషాలు ఇంగ్లీషు వికిపిడియాలో ఉన్నాయి. ఇంగ్లీషు విభాగానికి లింకు http://**en.wikipedia.org**/wiki/**K._N._Kesari**.

తెలుగు పుస్తకం digital library of India సైటులో ఉంది. లింకు chinnanaat'imuchchat'lu., 2990100067429. ke yan keisari. 1999.

కేసరి గారి మరో పుస్తకం **తులసి**, http://archive.org లో లభ్యం. ఆరోగ్యరీత్యా తులసి ప్రాశస్త్యంగురించి కేసరిగారు విపులంగా చర్చించిన పుస్తకం.

లింకు https://archive.org/details/tulasi00kesasher.

(ఫిబ్రవరి 27, 2014)

# 4. నేలటూరి వెంకటరమణయ్యగారి చారిత్రకరచన వ్యాసాలు

నేలటూరి వెంకటరమణయ్యగారు (1883-1977) సుప్రసిద్ధ సాహిత్య, చారిత్రక పరిశోధకులు. దాదాపు 70 సంవత్సరాలపాటు అవిరళంగా అనేక తాళపత్రాలనూ, శాసనాలనూ, వాఙ్మయాన్ని నిశితంగా పరిశీలించి, అనేక వ్యాసాలు ప్రచురించేరు.

మామూలుగా చరిత్ర అంటే రాజుల యుద్ధాలూ, జయాపజయాలూ, ఆ మీదట చెరువులు, బావులు త్రవ్వించెను, సత్రములు కట్టించెను, చెట్లు నాటించెను అని - నా స్కూలుచదువు దశలో నాకు గుర్తున్నదంతే.

వెంకటరమణయ్యగారి **చారిత్రకరచనలు లేక చారిత్రకవ్యాసములు** అన్న పుస్తకం digital library of India లో కనిపించినప్పుడు చరిత్రరచన అన్నపదం ఆ శీర్షికలో లేకపోతే తీసుకునేదాన్ని కాదు. నోరి నరసింహశాస్త్రిగారు రాసిన చారిత్రకనవలలు రాయడంగురించి గ్రంథస్థం చేసిన విషయాలు ఇంకా మనసులో మెదుల్తున్నందున ఈ శీర్షిక కూడా నన్ను ఆకట్టుకుంది. ప్రధానంగా నేను ఈపుస్తకంలో చూడదలుచుకున్నది వీరు చారిత్రకరచనలగురించి ఏం చెప్తారనే. నాఆశలు వమ్ము కాలేదు. పై పుస్తకంలో మొదటివ్యాసం (35 పుటలు)లో ఇచ్చినవివరాలకి చాలా ప్రాముఖ్యత ఉంది.

ఆ వ్యాసం రెండు రకాలుగా మనం ఆలోచించుకోడానికి ఉపయోగపడుతుంది. 1. ప్రచురణకర్తలు చెప్పినట్టు, మొదటివ్యాసము చరిత్రరచనకి కావలసిన సామగ్రిని, చరిత్రరచనావిధానమును విశదీకరిస్తుంది. ఆ తరవాతి వ్యాసాలు ఆ సాధనసామగ్రితో చరిత్రను పునర్నిర్మించుకొను విధానం చెప్తాయి. మొదటివ్యాసంలో వెంకట రమణయ్యగారు మనం ఆంధ్రులం మన చరిత్రని పరిరక్షించుకునేవిధానం, నిర్లక్ష్యం

చేస్తున్న విధానంగురించి ఆయన ఎత్తి చూపిన అంశాలు వివరించేరు. వీటిగురించి మనం తీవ్రంగా ఆలోచించికోవాల్సిన అగత్యం ఉంది. “ఆంధ్రపండితులు చరిత్రకారులుగాను చరిత్రకారులు భాషాపండితులుగాను ఏర్పడుచు, చరిత్రజ్ఞానము లేని భాషాపాండిత్యమును, భాషాపాండిత్యము లేని చరిత్రనిర్మాణమును పనికిరావని తెల్లమగు నీకాలమున ‘నాటిని నేటికినిం గలుపు నాణెపువంతెన’గా ఉభయసామాన్యముగా” ఈ గ్రంథమును ప్రకటించుచున్నామని ప్రచురణకర్తలు (వేదం వెంకటరాయశాస్త్రి) చెప్పేరు. అది 1948లో. ఆ సందర్భాన్ని దృష్టిలో పెట్టుకుని చదివితే ఈ మొదటివ్యాసంలో ఇప్పటికీ చరిత్రపట్ల మనధోరణులకి అన్వయించుకోగల విషయాలు కనిపిస్తాయి.

మనకి చరిత్ర గ్రంథస్థం చేయడం అన్న అభ్యాసం మహమ్మదీయులతో వచ్చిందిట. మహమ్మదీయులు మనదేశం ఆక్రమించుకున్న తరవాత చరిత్రరచన పార్సీలోనూ ఉర్దూలోనూ ప్రారంభించేరు. మహమ్మదీయప్రభువుల ప్రోత్సాహంతో మనవాళ్ళు కూడా చరిత్ర రాయడానికి పూనుకున్నారు కానీ పార్సీ, ఉర్దూ భాషల్లోనే రాస్తూ వచ్చేరు! హిందూ సంస్థానచరిత్రలు కానరావు అన్నారాయన. అలాగే ఆంగ్లేయులపాలన వచ్చేక, ఇంగ్లీషులో రాయడం సాగించేరు. చూస్తుంటే మన రాజభక్తి అలాటిది అనుకోవాలి అనిపించింది నాకు!

దీనికి మరోకోణం ఆ చరిత్రలో ఏమిటి రాస్తున్నారు అన్నది. మనవాళ్లు రాసిన చరిత్రలు కూడా మహమ్మదీయుల, ఆంగ్లేయులకోణంనుండే ప్రస్తావించడం జరిగింది. ఇదే అభిప్రాయం నోరి నరసింహశాస్త్రిగారి వ్యాసాల్లో కూడా కనిపిస్తుంది. అంటే, మనచరిత్ర నిష్పాక్షికంగా కానీ మనదృష్టికోణంతో గానీ రాయడం జరగలేదు.

చరిత్ర పునః పరిశీలించుకోడానికి అందుబాటులో ఉన్న సామగ్రిని ప్రధానంగా రెండు తరగతులుగా విభజించవచ్చు. మొదటిది అనేక రూపాలలో మనకి లభ్యమవుతున్న

పురావస్తువులు, రెండోది శాసనాలు. ఈ పురావస్తువులు – రాక్షసగుళ్లు, శిలాగండారాలు, దేవాలయాలు, కోటలు మొదలయినవి.

ఆదిమయుగములో జనులు మృతశరీరనిక్షేపణకోసము నిర్మించిన సమాధులని రాక్షసగుళ్ళు అంటారుట. వాటిలో శవములతో పాతిపెట్టిన వస్తుసంచయం అమూల్యం. అవి చరిత్ర తెలియజేయడానికి ఎంతగానో ఉపయోగపడతాయి. వాటివల్ల మత, సాంఘిక, వార్తికపరిస్థితులు కనుక్కోవచ్చు. అటువంటివి ఆంధ్రదేశంలో ఎన్నో ఉన్నాయనీ, వాటిపరిశోధన ఇంకా ప్రారంభించలేదనీ అన్నారు వెంకట రమణయ్యగారు. ప్రభుత్వము నామమాత్రంగా అధికారులనయితే నియమించేరు కానీ నిజంగా కావలిసింది ఆ వస్తువుసంచయంగురించిన విషయాలను వివరించడానికి తగిన శాస్త్రపరిజ్ఞానం కలవారయి ఉండడం.  కళాకారులు అయిఉండాలి. దానికి డబ్బు కావాలి. ఇరుసున కందెన పెట్టక సాగదు కదా అన్నారు రచయిత. కొంధరు సంస్థానాధిపతులు, మహారాష్ట్రులు ఈవిషయంలో మేలు. ఇది ఒక ఉదాహరణ మాత్రమే. వెంకటరమణయ్యగారు అనేక ఉదాహరణలు ఇచ్చేరు మన తెలుగువాళ్ళు మాత్రమే ఈ శిథిలాలని ఎంత నిర్లక్ష్యం చేస్తున్నారో ఎత్తిచూపడానికి.

శిలలని శిల్పాలుగా చెక్కడం కాక, మరొకరకమైన విద్య ఉంది. అది శిలలను ఛేదించి రూపు కల్పించడం – దీన్ని గండారములు అంటారుట. దానికి వేరే రకమైన నేర్పు కావాలి. "ఆ పనివారిని జుచి శిల తన స్వభావసిద్ధమైన కర్కశత్వమును మాని మార్దవము నందినది. వారిచేయి సోకగనే బంకమట్టివలె, మైనమువలె, వెన్నవలె మెత్తనై యేరూపము గమ్మనిన వారి యాజ్ఞను మీరసేరక యారూపమును బొందినది," అని వ్యాఖ్యానించడంలో వెంకట రమణయ్యగారికి ఈ గండారాలయందు, ఆ కళాకారుల యందు గల గౌరవం ద్యోతకమవుతోంది. బాదామీలో మహా బలిపురములో చూస్తే "అవి అనిర్వాచ్యమైన సమ్మోహనపూరమున మిమ్ము ముంచి బహిఃప్రపంచమును

మరపించి యొక సౌందర్యలోకమునకు గొనిపోయి యానందబ్రహ్మ యందు లీనులజేసి తన్మయత్వము జెందించును." అంటారు వెంకట రమణయ్యగారు. విజయవాడ సమీపమున ఉన్న అలాటి గండారపుబొమ్మలను విజయవాడ పౌరశ్రేష్ఠులు బాగుచేయదలచినతరవాత వారు చేసిన పని "చెప్పుటకు నోరాడదు" అంటూ వ్యథ పడి, "ఆ శిల్పాచార్యులవిద్యావైభవము, ప్రతిమలసౌందర్యము, పనితనంపు సొంపు మంట-కాదు, కాదు, సిమెంట-గలసిపోయినవి. ప్రస్తుతమచట గల ప్రతిమల వికారరూపములను, అంగవైకల్యమును, లింగాంతరీకరణములును గాంచిన నే పురాతన వస్తుపరిశోధకుని హృదయము రగులుకొనిపోదు?" అన్నారు. అంతే కాదు. విజయవాడ పురప్రముఖులకు ఆయనవిన్నపము, "అయ్యా, మీపురమందు గల పూర్వనాగరిక చిహ్నములు బాగుసేయ దలపెట్టకుడు," అని. అలాగే అమరావతి దగ్గర స్తూపాలని ఉద్ధరించేవిషయంలో కూడా "తిరపతి మంగలవాని పద్ధతియైనది" అంటారు. అక్కడ పని చేయడానికి డబ్బులేదంటూ వేలకొలది మాసవేతనములనిచ్చి తెల్లదొరలను, సీమదొరలను రప్పించుట యేలనో అని ప్రశ్నిస్తున్నారు. వారి సలహా, "ఆంధ్రలోకమంతయూ ఏకగ్రీవముగా సర్కారువారిని మందలింపవలయును." ఇది 1948నాటి మాట. ఇప్పటికైనా మన పురాతనవస్తుశాఖవారు ఏమైనా మారేరా?

అలాగే దేవాలయాలూ, కోటలూ విఱుగగొడిచి, ఆ రాళ్ళను గృహనిర్మాణానికి తీసుకుపోడం సహజమైపోయినది అంటారు. విజయనగరము, పెనుగొండ, గండికోట, కొండవీడు, యోరుగల్లు, గోలకొండ మొదలగు దుర్గములను గాంచినవారికి వీని ప్రాముఖ్యత స్పష్టము కాగలదు. ఇవన్నీ శిథిలావస్థయందున్నవి. సర్కారు పి.డబ్ల్యు.డి శాఖవారు వీనిరూపును చెడగొట్టియున్నారు. కొన్నిటిని కచేరీలుగా మార్చి చరిత్రకి ఎంతో నష్టం కలుగజేసేరు. వీటిని పదిలంగా ఉంచుకుని ఉంటే "విజయనగరరాయలు, దక్షిణాది ఆంధ్రనాయకులు, ఆర్కాటునేలిన మహమ్మదీయ

ప్రభువులు యంతఃపురములయందెట్లు ప్రవర్తించుచుండిరో తెలియుటకు అవకాశముండెడిది."

ఈ తప్పులు దిద్దుకోవాలంటే, మనసామగ్రి—శాసనాలు, వాఙ్మయం-ఆంధ్రుల కోణంలోనుండి తరిచి చూసుకుని తిరగ రాయవలసిన అవుసరం ఉంది.

ఆ సామగ్రి ఏమిటి, దాన్ని ఎలా మనచరిత్రకి అన్వయించుకోడం అన్నది చాలా విపులంగా చర్చించేరు వెంకటరమణయ్యగారు. స్థూలంగా శాసనాలు, వాఙ్మయం అని విభజించేరు. అందులో శాసనాలు రెండు రకాలు - లౌహికములు, శైలికములు అని. లౌహకం—రాగి మాత్రమే కాక వెండి, బంగారాలతో చేసిన శాసనాలు కూడా ఉన్నాయి. యావత్ ప్రపంచంలో దక్షిణదేశంలో ఉన్నంత శాసనవాఙ్మయం మరెక్కడా లేదు. అంత అపురూపమయిన సామగ్రిని మనవారు ఏం చేసేరంటే హాయిగా స్వంతానికి వాడుకున్నారు. "ఈ లౌహికశాసనాలు కంసాలివాని కుంపటియందు అగ్నిప్రవేశము చేసి రూపాంతరము నంది చెంబులు, తపెలలు, తట్టలు మొదలైన పాత్రలుగ మారిపోయినవి." అలా కరిగించి నగలు గట్రా చేయించుకునో, అమ్ముకుని సొమ్ము చేసుకునో చరిత్రకి అవుసరమైన, అపురూపమయిన వస్తువులు రూపు లేకుండా పోయేయి చాలామటుకు అంటున్నారు వెంకట రమణయ్యగారు.

ఆయన ప్రస్తావించిన మరోవిషయం-మొదట్లో సర్కారువారు వీటిని మద్రాసు పురావస్తుప్రదర్శనశాలలో భద్రపరిచేవారుట కానీ తరవాతికాలంలో  ఈ "పురాతనవస్తు పరిశోధనశాఖ వారికేలనో కలకత్తాలోని భారతీయవస్తుప్రదర్శనశాలపై గాఢానురాగ ముదయించినది."  అంచేత అక్కడికి తరలించేయడం మొదలు పెట్టేరు. అంతే కాదు. మైసూరు, కర్ణాట ప్రతినిధులు అఖిలభారతశాసనసభలలో ఆయా సభ్యులు వాళ్లమండలాలో శాసనములకు ప్రతిబింబములు తీయించి జాగ్రత్త చేసుకుంటుంటే, మన ప్రతినిధులు మాత్రం చేసిందేమీ లేదు. "ఖొజ్జామగడు ఇంటిలో నున్నను

దండులోననున్నను నొక్కటే" యను లోకోక్తి వీరిప్రాతినిధ్యముతో సార్థకమయినది అంటారు.

చరిత్రని తిరగరాసుకోడానికి ఎంతో సహాయం చేయగల మరొక సాధనం వాఙ్మయం అని అందరూ అంగీకరిస్తారు. ఆంధ్రలో పరంపరగా వస్తున్న వంశచరిత్రలు, పద్య కావ్యములు, అవతారికలు, ఆశ్వాసాంతములు, సీసమాలికలు, రాజులచరిత్రలు– వీటిలో ఆనాటి కావ్యకర్తలు అనుభవసిద్ధములైన సాంఘికార్థిక విషయములు చేర్చేరు. "ఇగురు కైజీతంపుటెక్కీలు", "పూదేనెగాసపునల్ల ప్రజ", "కాలంపువేరి సుంకరి యంబరమున బొడిచిన ముద్ర" – వంటి వాక్యాలు వెంకట రమణయ్యగారు ఉదహరించేరు కానీ వీటికి అర్థాలు నాకు తెలీవు. ఇవి పండితులు పరిష్కరించాలి. "క్రీ.శ. 17 శతాబ్దములో విరచింపబడిన గ్రంథములప్పటి రాజకీయ, మత, సాంఘిక, ఆర్థిక పరిస్థితులనెరుగని వారికి దుర్గ్రాహ్యములు" అన్నారు ఆయనే. ఈ సందర్భంలో, నాకు తోచిన మరొక కోణం, మనం ఈనాటి పరిస్థితులకి అన్వయించుకోవలసినది – వెంకట రమణయ్యగారు చెప్పిన కారణంగానే ఈనాడు రచయితలు, పాత్రికేయులు బాధ్యతతో నిజాయితీగా రచనలు చేయవలసిన అవుసరం ఉంది. తమకి తోచినట్టు రాసిపారేయడం కాక, భవిష్యత్తులో మనచరిత్ర ఎలా చదవబడుతుంది అన్నదృష్టితో రచనలు చేయాలనుకుంటున్నాను.

ఈ శాసనాలలో లిపి కూడా కాలనిర్ణయానికి ఉపయోగపడుతుంది. లిపి కాలక్రమాన మారుతూ వస్తోందన్నసంగతి భాషాశాస్త్రజ్ఞులకి విదితమే. ఈ పుస్తకంలో ఆ మార్పులు సూక్ష్మంగా సామాన్యులకి అర్థమయేలా వివరించేరు, "తలపెట్టె" వంటి పదజాలం పరిచయం చేస్తూ.

మిగతా వ్యాసాల్లో ఈసామగ్రిని వినియోగించుకుని, తాము చేసిన పరిశోధనలద్వారా గ్రహించిన చరత్ర వివరించేరు. వాటిలో చాలా ఉపకథలు చేర్చేరు. ఉదాహరణకి త్రిలోచన

పల్లవుడికి త్రినేత్రుడు అన్న పేరు ఎలా వచ్చింది, అతనిని జయించిన చోళరాజు కరికాలుడు సామంతరాజులచేత మట్టితట్టలు మోయించడం, "బాధ" అన్న పేరుతో 18 రకాలు పన్నులు విధించడంవంటి అనేకవిషయాలు విపులంగా చర్చించేరు.

ఒక్కమాటలో, నేలటూరి వెంకట రమణయ్యగారు తెలుగుదేశానికి, సాహిత్యానికి చేసిన సేవ అపారం.

వెంకట రమణయ్యగారి జననం 1893లో. జన్మస్థలం ప్రకాశంజిల్లాలో నేలటూరు. తల్లిదండ్రులు పాపమ్మ, సుబ్బయ్య. యం.ఏ., పి.హెచ్.డి. చేసారు. 1977 దివంగతులయేరు.

**వీరి రచనలు** -

* చరిత్ర రచన లేక చారిత్రకవ్యాసములు. ప్రథమ భాగము. మద్రాసు. వేదము వెంకటరాయ శాస్త్రి, 1948.

* పల్లవులు, చాళుక్యులు. మద్రాసు. వేదము వెంకటరాయ శాస్త్రి, 1969

* విజయనగర చరిత్ర, 2. సం. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, 1977

* కృష్ణదేవరాయలు, హైదరాబాదు, 1972

* త్రిలోచన పల్లవుడు

* కరికాలచోళుడు

* విజయనగర పట్టణ సామ్రాజ్య ఉత్పత్తి

* దక్షిణ హిందూదేశప్రారంభం

* విజయనగర మూడవ రాజవంశములోని పతనములు

* భారతదేశములో మహమ్మదీయుల తొలి విస్తరణ

* విజయనగర చరిత్రకు మరి కొన్ని మూలములు

* పాల్కురికి సోమనాథుడు ఎప్పటివాడు?

* ఆంధ్రప్రదేశమున చరిత్ర పరిశోధన

* ఆంధ్ర వాఙ్మయచరిత్ర

**పరిష్కరణలు**

* కొమర్రాజు వెంకట లక్ష్మణరావు: మహమ్మదీయ మహాయుగము. 2 సం. పరిష్కర్త. నేలటూరి వెంకటరమణయ్య. 1964.

* నన్నెచోడుని కుమారసంభవము. పరిష్కర్త. నేలటూరి వెంకటరమణయ్య. హైదరాబాదు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ, 1978.

* విజయరాఘవుని రఘునాథాభ్యుదయము. పరిష్కర్త. నేలటూరి వెంకటరమణయ్య

* కంకంటి పాపరాజుయెక్క విష్ణుమాయావిలాస నాటకము. పరిష్కర్త. నేలటూరి వెంకటరమణయ్య.

ఫేస్బుక్కులో రమణమూర్తిగారు ఇచ్చిన సమాచారం

తిరుమల రామచంద్రగారి వ్యాసం మహామనీషి వెంకటరమణయ్యగారు
http://goo.gl/jOJdjC

నేలటూరి వేంకటరమణయ్యగారి కథలు –

మధుమావతి (పెద్ద కథ) [తెలుగు స్వతంత్ర - 27.08.48- 03.09.48]

ప్రతీకారము (పెద్ద కథ) [తెలుగు స్వతంత్ర - 12.11.48- 19.11.48]

ఛత్రగ్రాహి (పెద్ద కథ) [తెలుగు స్వతంత్ర - 10.12.48- 07.01.49 ]

పచ్చడము (కథ) [భారతి - 01.12.56]

Publications in English:

* Perur Inscriptions. Andhra Pradesh Textbook Press, 1973

Studies in the history of the third dynasty of Vijayanaga

University of Madras Press, 1935.

* Vijayanagara: Origin of the city and the empire. New Delhi: Asian Educational Services, 1990

* Rudradeva University of Madras, 1941

==Collaborations==

*Nelaturi Venkataramanayya and P.V. Parabrahma Sastry. Inscriptions of Andhra Pradesh, Nalgonda District. A.P. Department of Archaeology and Museum. . Pub by Government of Andhra Pradesh. 1994

References.

http://www.vepachedu.org/manasanskriti/Nelaturi.html

http://www.worldcat.org/search?q=au%3AVenkataramanayya%2C+Nelaturi.&qt=hot_author

http://www.dli.gov.in/

(మార్చి 20, 2014)

# 5. అచ్చమాంబగారి అబలా సచ్చరిత్రమాల



భండారు అచ్చమాంబగారి (1874-1905) **అబలా సచ్చరిత్రమాల** పేరు చాలామంది వినే ఉండవచ్చు కానీ చూసినవారూ చదివినవారూ తక్కువే అనుకుంటాను. డిజిటల్ లైబ్రరీ ఆఫ్ ఇండియా సైటులో చూసి తీసుకున్నాను. నేను చదవడం మొదలు పెట్టగానే గమనించింది గ్రంథంపేరులో అబల అని ఉన్నా, అచ్చమాంబగారు చిత్రించిన స్త్రీలు అందరూ అచంచలమైన ఆత్మవిశ్వాసం, దీక్ష, పట్టుదల, ధైర్యసాహసాలు గలవారుగానే దర్శనమిస్తారని. ఒక్క కథ మాత్రం భిన్నంగా ఉంది. అది కొమఱ్ఱాజు జోగమాంబగారి కథ. ఈకథలో ఆమె అనుభవించిన బాధలే చూస్తాం. జోగమాంబగారు అచ్చమాంబగారి పినతండ్రిభార్య. ఆ ఆత్మీయతకారణంగా ఈ సంపుటంలో చేర్చి ఉండవచ్చు ఆమెగాథ.

ఇందులో నలభై ముగ్గురు స్త్రీలకథలు పొందు పరిచేరు అచ్చమాంబగారు. ఈ గ్రంథంలో విశేషించి చెప్పుకోవలసిన అంశాలు-అచ్చమాంబగారు కేవలం ఆనోటా ఆనోటా విన్న కథలు గ్రంథస్థం చెయ్యడం కాక శ్రమ తీసుకుని పరిశోధన చేసి, ఋజువు లేని విషయాలని ఆధారాలు దొరకలేదని స్పష్టం చేయడం, వందిమాగధుల్లా వీరవనితల ధైర్యసాహసాలు వర్ణించుకుంటూ పోవడం కాక, సమకాలీన సమాజంలోని సాంఘికసమస్యలని పరామర్శిస్తూ వ్యాఖానించడం. వీటిమూలంగా ఈకథల్లో ఆనాటి

సాంఘికపరిస్థితులూ, భావజాలం, అచ్చమాంబగారి పాండిత్యప్రకర్ష కూడా అభివ్యక్తమవుతున్నాయి.

**ఖడ్గతిక్కన భార్య** అన్న వ్యాసంలో తిక్కనభార్య పేరు ఎంత  వెదికినా తనకు లభించలేదన్నారు. అయితే ఆవ్యాసంలో ఉదహరించిన "ముగురాడువారమయితిమి ..." అన్న పాదం గల పద్యంతో ఆకథ మాంచాలకథే అన్నది సువిదితం. అంటే ఆమెకాలంనాటికి మాంచాలపేరు ప్రాచుర్యంలో లేదనే అనుకోవాలి.

గణితశాస్త్రజ్ఞురాలు లీలావతిగురించి "అరగంటలో ఆమె ఒకచెట్టుకి ఎన్ని ఆకులో చెప్పగలద"ను మాట నమ్మదగినది కాకపోయినను, లీలావతికి గణితంలో గల అసమానప్రతిభమూలంగానే అలాటి కథలు పుట్టి ఉండవచ్చు అంటారు.

**తరిగొండ వెంగమాంబ**ని శిరోజాలు తీయించుకోమని ఆమెతండ్రీ, ఊరిపెద్దలూ ఒత్తిడి చేయడం కథ బహుళ ప్రాచుర్యంలో ఉన్న కథ. అయితే అచ్చమాంబగారు ఈవిషయాన్ని సమకాలీన సాంఘికసమస్యగా గ్రహించి, దానిమీద సుదీర్ఘంగా వ్యాఖ్యానించడం విశేషం. ఆ దురాచారంవల్ల గలిగే అవమానాన్ని భరించలేక స్త్రీలు సహగమనానికి పాల్పడిఉండవచ్చు కూడా అంటారు అచ్చమాంబగారు. అలాగే, మొల్లగురించి రాస్తూ, కులంకంటే గుణం ప్రధానం, అంటూ ఆనాటి కులతత్వాలు చర్చించేరు.

విమలకథ  - ఔరంగజేబు కాలంలో కొన్ని కుటుంబాలు ప్రాణరక్షణకోసం ఆడపిల్లలని తురకప్రభులకిచ్చి పెళ్ళిళ్ళు చేసేవారుట. విమలఅక్కని ఔరంగజేబుకిచ్చి వివాహం చేసేరు. కానీ విమల మాత్రం అలాటి వివాహానికి అంగీకరించక, తనకి మనసైన మరొక రసపుత్రవీరునికి ఉత్తరం రాసి పంపుతుంది. ఆజాబులో ఆ కన్నియ "ఆడయంచ కాకికి నాతి యగుట తగునా? దోసమెఋగని దొరకొలంబున బుట్టిన కన్నియ

కోతిమూతివాడును, బోడితలవాడునునైన తురక గూడుట యింపగునా? వెన్నుడు రుక్మిణిం దీసికొనిపోయినటుల నన్నుఁ గొనిపొండు," అని రాసిందిట. ఈ వాక్యాలలో రచయిత్రికి గల భాషాపాటవమే కాక సాంఘికదురాచారాలపై ఎంత ప్రగాఢమైన భావాలు ఉన్నాయో కూడా మనకి అర్థమవుతుంది. ఈ విమల దరిమిలా ఔరంగజేబుభార్య అయిన అక్కగారిని ఆపత్సమయంలో ఆదుకుంటుంది కూడా.

**ఆనందీబాయి జోషీ** కథలో ఆనందీబాయి కేవలం చదువుకోడమే కాక, వైద్యవిద్యకోసం అమెరికా వెళ్ళడం, భర్తతో కాక ఒక్కర్తే వెళ్ళడం, అమెరికా వెళ్ళినా తన సంప్రదాయాలు వదులుకోకపోవడం, వీటిగురించి ధారాళంగా ఇంగ్లీషులో ప్రసంగించడం, ఆమె చదువుకి తండ్రి ఆటంకం పెడితే భర్త మద్దుతు ఇవ్వడం – ఇలాటివిషయాలెన్నో ఆసక్తికరంగా వర్ణించేరు.

పోతే, ఇలాటి పూర్వగ్రంథాలు చదువుతున్నప్పుడు మనకి తెలీని పదాలు అంటే ఇప్పుడు వాడుకలో లేనివి కూడా కనిపిస్తాయి. ఉదాహరణకి, అచ్చమాంబగారు **దంతకథలు** అంటారు. సందర్భాన్నిబట్టి అవి కేవలం మౌఖికంగా మాత్రమే ప్రచారంలో ఉన్న కథలు అనుకుంటున్నాను. అమెరికాని పాతాళలోకం అనడం మాత్రం నాకు అబ్బురంగా అనిపించింది. ఆవిడ మాత్రమే వాడేరో, ఆనాటి వ్యావహారికమో తెలీదు.

అచ్చమాంబగారి మూడో సంకలనం కూడా ప్రచురిస్తానని గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు రెండో సంపుటానికి పరిచయంలో రాసేరు కానీ అది వచ్చినట్టు లేదు. నిజానికి మొదటి సంపుటం కూడా ఎక్కడా దొరుకుతున్నట్టు లేదు. విశ్వవిద్యాలయాలు ఇలాటివి తిరిగి ప్రచురించడానికి పూనుకుంటే బాగుండు. ఈ సంపుటాలు digital libraries of India వారి సైటులో ఉన్నాయి.

(మార్చి 20, 2012)

# 6. కాంచనపల్లి కనకాంబగారి అమృతసారము

కాంచనపల్లి కనకాంబ(1883-1988) **గారి** పేరు చాలాకాలంగా నాకు సుపరిచితమే అయినా, ప్రత్యేకించి **వారి** రచనలకోసం ఎప్పుడూ వెతకలేదు యాదృచ్ఛికంగానే ఆమె రచించిన కావ్యం **అమృతసారము** దొరికేవరకూ. సాధారణంగా వేదాంతగ్రంథాలజోలికి నేను పోను కానీ ఇది కేవలం 544 పద్యాలు మాత్రమే గల చిన్ని పుస్తకం కనుకనూ, కనకాంబగారిపేరు సుపరిచితం కనకనూ చూదాం అనిపించింది. కనకాంబగారు ప్రస్తావించిన వేదాంతంపై వ్యాఖ్యానాలు చేయడం నా శక్తికి మించిన పని. కానీ ఆ విషయాలు తెలిసినవారు మాత్రం ఈ కావ్యాన్ని చదివి ఆనందించగలరని గట్టిగానే చెప్పగలను.

నాఅలవాటు ప్రకారం **ఆశయము** అన్న శీర్షికతో శ్రీ కాశీ కృష్ణాచార్యగారి వాక్యాలు, శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి వాక్యాలు చూసేను. అవి చదివినతరవాత నాకు ఆసక్తి ఇనుమడించింది. “ప్రస్థానత్రయ శాంకర భాష్యాదులఁ జదివిన వారికన్న నీ గ్రంథము చదివినవారు త్వరలో వేదాంతులు కాగలరని చెప్పవచ్చును” అన్నారు శ్రీ కాశీ కృష్ణాచార్య గారు **ఆశయము**లో.

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు ఆమె రచనావైదగ్ధ్యాన్ని ప్రశంసిస్తూ, “గురుముఖమువలన నప్పుడప్పుడు వినిన సంగతులను నొకచో లిఖించుకొని యా సంగతులకుఁ తన యనుభవమును సహాయపఱచి వీలైనంత సులభముగా జిజ్ఞాసువులకుఁ తెలియవలెనని పూర్తిగా ప్రయత్నించినది” అని రాసేరు. అయితే విషయం అంత సులభసాధ్యమయినది కాదు కనక వివరణలు కూడా ఇచ్చి ఉంటే బాగుండేదని కూడా జోడించేరు. అందుకు ఉదాహరణగా

“దాసిసుతునిఁదెచ్చి తగరూపుమాయించి

ఆది బ్రహ్మసుతుని నందు చేర్చి”

అన్న పద్యము వైద్యశాస్త్రములోనిదిట. అటువంటి విషయాలు ఈనాటి పాఠకులకి తెలియకపోవచ్చని ఆయన అభిప్రాయపడ్డారు. అది రాసినది 1936లో. ఇప్పుడు ఆ అభిప్రాయానికి మరింత బలమని నేను అనుకుంటున్నాను. నిజానికి వీరిద్దరే కాక ప్రచురణకర్తలు కూడా ఈ అమృతసారము కావ్యములో విశిష్టతలు అనేక విధాల వివరించడంతో నా కుతూహలం రెండింతలయింది. అందుకు శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు తమ ఆంధ్రరచయిత్రులు గ్రంథంలో శ్రీమతి కనకాంబగురించి రాసిన వ్యాసం కూడా దోహదం చేసింది.

లక్ష్మీకాన్తమ్మగారి పుస్తకంలోని వివరాలు ఇక్కడ ఇస్తున్నాను.

కనకాంబగారు కాంచనపల్లి రంగారావు, రంగమ్మ దంపతులకు పల్నాడులోని దివి గ్రామంలో 1893లో జన్మించేరు. బాల్యంలోనే వైధవ్యం సంభవించగా, పుట్టింటిలోనే పెరిగారు. చిన్నతనంలోనే తండ్రి కూడా మరణించగా, 1906లో పెదతండ్రి మంగు రామానుజము పంతులుగారు, పంగనామాల వెంకటరంగారావుగారు నెల్లూరికి తీసుకుని వెళ్ళేరు కనకాంబగారిని తల్లితో సహా. రామానుజముగారు పసితనములోనే కనకాంబగారు ప్రదర్శించిన ప్రజ్ఞావిశేషములు గమనించి, చదువు చెప్పించేరు. ఆ తరవాత ఆమె మద్రాసు వెళ్ళి విద్వాన్ పరీక్షలో ఉత్తీర్ణురాలయి, బి.ఎ. (ఇంగ్లీషు) పట్టభద్రురాలయి, క్వీన్ మెరీస్ కాలేజీలో తెలుగు ఉపన్యాసకురాలుగా పదవి చేపట్టేరు. ఆమె తన 11వ ఏట ప్రారంభించి కవితావ్యాసంగం కొనసాగించేరు. మద్రాసు యూనివర్సిటీ పరీక్షాధికారి పదవి, తెలుగు పాఠ్యగ్రంథ నిర్ణాయక సంఘు సభ్యత్వము పొందేరు. శ్రీ కేసరి గారిచేతులమీదుగా స్వర్ణకంకణము అందుకున్నారు. విజయవాడకు

చెందిన శ్రీ చుండూరి వెంకటరెడ్డిగారి పిలుపున, తమ గురుదేవులయిన శ్రీ అమృతానందస్వామి ఆదేశానుసారము త్రిలిఙ్గవిద్యామహాపీఠము నెలకొల్పేరు. "ఆమె పట్టి విడువని సారస్వతశాఖ లేదు. చేసి విడువని కావ్యభేదము లేదు. అనుభవింపక వదలిన గౌరవపదవి లేదు. ఆహరింపక వదలిన ఆధికపదము లేదు" అంటారు లక్ష్మీకాన్తమ్మగారు ఆంధ్రకవయిత్రులు గ్రంథంలో. (పు. 151).

ఆమె తెలుగు, ఇంగ్లీషు, సంస్కృతమే కాక, కన్నడ, మళయాళం వంటి ఇతర దక్షిణాది భాషలలో కూడా ప్రావీణ్యం సంపాదించేరు. మాక్సిమిలన్ కంపెనీకి అనేక పుస్తకాలు తయారు చేసి ఇచ్చేరు. 11వ ఏటనే కవితలల్లిన కనకాంబగారు అనేక ప్రక్రియలలో కృషి చేసి నిష్ణాతులనిపించుకున్నారు. కనకాంబగారు ప్రచురించిన పుస్తకాల జాబితా ఈవ్యాసం చివర చేర్చేను.

వీరేశలింగంగారికాలం చివరిదశలో జన్మించిన కనకాంబగారు అప్పటికి ఆయన ప్రాచుర్యంలోకి తెచ్చిన స్త్రీవిద్య, సంఘసంస్కరణాభిలాష వంటివి ఆకళించుకుని, తన రచనలలో సమయానుకూలంగా, చమత్కారయుక్తంగా చొప్పించిన విదుషి.

స్త్రీలమేధ గురించి ఆమె రాసిన ఈ పద్యం చూడండి **అమృతసారం** లో.

చదివిన పండితులగుదురు,

విదితము గాకున్న యపుడు వెఱ్ఱులె పురుషుల్;

చదివిన జదువక యున్నన్,

ముదితలు విద్వాంసురాండ్రు పుట్టువుచేతన్.

స్త్రీమేధస్సుని ఆమె గౌరవించినా, “మహిళల నేటి విస్పృంఖలవృత్తిని” గూర్చి లక్ష్మీకాన్తమ్మగారు కనకాంబగారి పుస్తకంలోనుండి ఉదహరించిన పద్యం -

చదువ జదువ సంసారమా లేదు,

వంట లేదు, కడుపుపంట లేదు,

మంట మగని జూడ, మహిళాసభల నుంట

చదువునకు ఫలమగు శాంతి లేదు.

అయితే ఇది ఏ గ్రంథంలోనించి తీసుకున్నారో, సందర్భం ఏమిటో తెలియడంలేదు నాకు. అదే పుస్తకంలో “మంత్రి మగవారిని గురించి” ఇలా అన్నాడుట -

చదివినాడు గాని, సంశయమా వోదు,

చదువ చదువ తెలివి సన్నగిల్లె

పిదప జూడ వీడు మొదటనే వోలుగా

గుణము కుదుర దేమి కొట్టుకొందు?

“ఈమె పుణ్యాన వీని నింతలో వదిలినది. చదువుకన్న మేలు చాకితనము అని పంచపాదింజేసి యీ యాటవెలదిచే నీ చతుష్పాత్తును నాడించి విడిచినది కాదు అని యొకరు చేసిన సమీక్ష బాగున్నది” అని పునః వ్యాఖ్యానించేరు లక్ష్మీకాన్తమ్మగారు.

కనకాంబగారు ఉపయోగించిన ఉపమాద్యలంకారాలు కూడా అనిదంపూర్వములు (ఇంతకు పూర్వం చెప్పనివి), అన్యస్పృష్టములు (ఇతరులు స్పృశించనివి) అని, ఆమె ఉదహరించిన పద్యాల్లో ఇవి చూడండి.

గురుజనముల సేవింపక

పరమార్థముకొఱకు గ్రంథభాండాగారం

బరయుట వీణె, మృదంగము

గరమర్థించెడు గతి గద గానంబునకై.

ఆమె రచనల్లో కేవలం పాండిత్యమే కాక లోకరీతిని గమనించి, పఠితలదృష్టిని ఆకట్టుకోగల చాతుర్యం కనిపిస్తుంది. అలాగే కుహనాపండితులగురించి చెప్పినప్పుడు కూడా సమకాలీనసమాజంలో ప్రబలమవుతున్న కుహనాపాండిత్యరీతులమీద వ్యాఖ్య కనిపిస్తుంది.

హితపథమునఁ తా నడువక

హిత మితరుల కూఁది చెప్పనిల దుర్మతి, తా

మితిమీఱి, వారు తనయెడ

హితవృత్తిన్ మెలఁగ రంచు నెగిరి పడుఁగదా.

మరొక పద్యం -

నిజము చాటుచేసి నీచుఁడబద్ధముల్

పల్కుచుంట గొప్ప ప్రజ్ఞయంట

ఘనతకెక్కు వెనుకఁ దనదోషముల నెన్ను

కొనుట తలఁపఁ గీర్తికొఱకుఁ గాదొ

ఇలాటి పద్యాలు సర్వకాలీనం, సార్వజనీనం కదా.

సకలవేదాంతగ్రంథాల సారము ఈ చిన్న పుస్తకంలో సంగ్రహంగా సామాన్యులకి అర్థమయేలా ఆమె రచించినది అని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు ఆశయము (ముందుమాట)లో చెప్పేరు. ఇందులో అన్ని పద్యాలూ నాకు అర్థమయేయి అని చెప్పలేను కానీ నన్ను ఆకర్షించిన ఒక పద్యం లెక్కల్లో సున్నా విలువ.

గణితసూత్రం లో సున్న విలువ

ఎన్ని సున్నలైన నేలెక్కకునురావు

కొన్ని యంకెలున్నఁ గొదువసుమ్ము

అంకె లాశ్రయించి యాదియందుంచిన

నొకటి కొకటి పూర్తినూతనిచ్చు

ఈత నేర్చుకోవాలంటే నీటిలోకి దిగాలి కానీ గట్టున కూర్చుని పాఠాలు చదివితే రాదు. అలాటి ఉపమానమే ఈ కిందిపద్యంలో కనకాంబగారు హృద్యంగమంగా చెప్పేరు.

తాటిచెట్టు కాల్వదాఁటుటకై వేయ

దానిమీద నడచు తరుణమందు

స్వాస్థ్యము నిలబెట్టు సహజంబుగాఁగాక

దానినెట్లు చెప్పఁ బూనునొరుఁడు

మరి కొన్ని ఉదాహరణ, ఎటు పడితే అటు మాటాడేవారిగురించి –

అనుబంధ చతుష్టయమున

కనుకూలము లేనియట్టి యాచారంబున్

గనుగొని లౌల్యం బనియెద

రనుకూలంబైన, ధర్మమనియెద రార్యుల్.

మరొక పద్యం -

ఇంటిమీద రాళ్ళవెన్నైనఁ బడనిమ్ము

సుప్తుఁడైన నరుఁడు సుఖమునుండు

మేలుకొన్న యప్పుడాలించు నల్లాడు

బొరుగువారిఁ బిలుచు బొబ్బలిడుచు.

కొండ ఎంత ఎత్తుగా ఉంటే లోయ అంత లోతుగా కనిపిస్తుందిట -

దండితనము పైరిదర్పంబు తెలుపును

గొండయెత్తులోయ కొలఁది తెలుపు

శాంతి కలిమిఁదెలుపు సంగరాహిత్యంబు

మంత్రమహిమఁ దెలుపు మౌనముద్ర

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు చెప్పినట్టు, ఇందులో వేదాంతం తెలుసుకోడం అంత సులువు కాకపోవచ్చు కానీ చదవడానికి, అర్థమయినంతవరకూ ఆనందించడానికీ తగిన కావ్యమే అని చెప్పగలను.

చిన్న పుస్తకమే కనక ఎవరైనా పూనుకుని సూక్ష్మంగా కొంత వివరణలో మళ్ళీ ఈ పుస్తకం ప్రచురిస్తే బాగుంటుంది.

శ్రీమతి కనకాంబగారు 1988 వరకూ జీవించి ఉన్నారంటే ఆమె కథలు కూడా ఎక్కడో అక్కడ దొరకడానికి అవకాశం ఉందనే అనుకుంటున్నాను.

శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారి రచనలు –

1. 1905లో సింహపురీనాధుడు రంగభర్తపై చెప్పిన రంగశతకము. కనకాంబగారి తొలి రచన.

2. 1907- అమృతవల్లి నవల. పండిత నటేశన్ శాస్త్రిగారి తమిళ నవల దిక్కొట్రయరు కొళంద్రైగళ్ కి అనువాదము.

3. గౌతమబుద్ధచరిత్రము (గద్యకావ్యము)

4. పాండవోదంతము (గద్యకావ్యము)

5. 1915 – కాశీయాత్రాచరిత్రము

6. 1919 – జీవయాత్ర (ఆధ్యాత్మిక కావ్యము)

7. మహావిద్యానాటకమను నామాన్తరము గల హంసవిజయము (వైదాంతిక నాటకము)

1. 1927 – పద్యముక్తావళి
2. 1928 – కాళిదాస కృతికి అనువాదముగ శాకున్తల నాటకము
3. 1931 – రామాయణసథాసంగ్రహము (సంస్కృతగద్యము)
4. 1935 – అంబాస్తవము
5. శైలి (5000 పద్యములు గల కావ్యము)
6. అమృతానందబోధసారము
7. ఆనందసారము
8. చక్కని కథలు
9. తోమాలియ (ప్రాస్తావిక పద్యసంపుటి)

గమనిక: ఈవ్యాసంలో ప్రధానాంశాలు అన్నీ శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి ఆంధ్ర కవయిత్రులు గ్రంథంనుంచీ, అమృతసారము కావ్యములోంచి తీసుకున్నవే కనక ఇందులో నా ప్రజ్ఞ ఏమీ లేదు. ఇక్కడ సూత్రప్రాయంగా కనకాంబగారి ప్రతిభావిశేషాలు మరొకసారి ఈనాటి పాఠకులకు పరిచయం చేయడమే నా ఉద్దేశం. ఆసక్తి గలవారు దయ చేసి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి పుస్తకం, కనకాంబగారి పుస్తకాలు చదవవలసినదిగా మనవి. Digital library of India వారి సైటునుండి సంగ్రహించి, నా బ్లాగు, తెలుగు తూలిక లో పెట్టేను. లింకు - Amrutha_Saramu - లింకు. ఈ లింకు పని చేయకపోతే, digital library of India site చూడండి.

(డిసెంబరు 13, 2013)

# 6. స్థానాపతి రుక్మిణమ్మగారి దయ్యాలకథలు



రాక్షసులు, దయ్యాలు, మాయలమరాఠీకథలు, ఏడు మల్లెపూలఎత్తు రాజకుమారి కథలు మనమందరం మాటలు రాకముందునించి విన్నవాళ్ళమే. పెరిగి పెద్దయేక మనంతట మనం చదువుకోడం వచ్చేక కూడా ఈ అభూతకల్పనలతో కూడిన కథలు చదివి ఆనందించేవాళ్లు చాలామందే ఉన్నారు. సైన్స్ ఫిక్షన్ కథలు అలాటివే. వాటిలో అవాస్తవం ఉన్నా చదువుతారు. బహుశా సైన్సు అనగానే, ఇవాళ కాకపోతే ఇలా జరగడానికి అవకాశం ఉంటుందన్న నమ్మకం ఉంటుందేమో. దయ్యాలకథలలో అపనమ్మకం వాటిని తక్కువగా చూసేలా చేస్తుందేమో నాకు తెలీదు. కానీ ఈ దయ్యాలకథలు చదువుతుంటే వి*సుగనిపించకుండా, ఇం*కా చదవాలనిపించే గుణం ఉంది కనక నాకు నచ్చేయి. కథకి ప్రధానంగా మొట్టమొదట కావలిసింది అదే - అప్పుడేమయింది, ఆ తరవాతేమయిందంటూ మనని ఆరాటపడేలా చెయ్యడం.

రెండు రోజులక్రితం అనుకోకుండా నాకు దయ్యాల కథలపుస్తకం దొరికింది. పుస్తకం పేరు **దయ్యాలు.** రచయిత్రిపేరు స్థానాపతి రుక్మిణమ్మగారు. ఆమె జననం 1915లో. ఈ కథలపుస్తకం 1937లో ప్రచురించారు. ఈ పుస్తకం ప్రచురించేనాటికి ఆమె వయసు 22.

పుస్తకంగా రాకముందే ఈ కథలన్నీ విశాఖపత్రిక, సత్యవాణి, ఆంధ్రవిద్యార్థి వంటి పత్రికలలో ప్రచురించబడ్డాయి.

రుక్మిణమ్మగారు ఈకథలన్నీ తాను తన పతినుండీ వారిమిత్రులనుండీ విన్నవిట. **ఘనాపాఠి కథ**తో వినోదార్థం రాయడం మొదలుపెట్టి క్రమంగా ఒకొకటే రాస్తూ వచ్చి, అన్నిటిని ఒక్కదగ్గర చేర్చడమే ఈ పుస్తకం ఉద్దేశం అని సవినయంగా చెప్పుకున్నారు తమ "విన్నపం"లో. కథలన్నీ విద్యాధికులనుండి గ్రహించినే అని కూడా స్పష్టం చేసేరు. **ప్రతిబింబాలు** కథ సుప్రసిద్ధాధునిక జాతీయకవులు బ్రహ్మశ్రీ మంగిపూడి వెంకటశర్మగారు చెప్పినది." **కవి** అన్న కథ శ్లోకరూపంలో ప్రచారం ఉన్నదే తీసుకుని కథగా మలిచేరుట. కథల్లో పాత్రలపేర్లు, స్థలాలపేర్లు కొన్ని కల్పితాలు, కొన్ని యథార్థాలూ అన్నారు.

రుక్మిణమ్మగారికథల్లో ఈనాడు మనం చెప్పుకునే శైలి, శిల్పం కూడా చెప్పుకోదగ్గ స్థాయిలో ఉన్నాయి. కథ ఆద్యంతం చకచక సాగిపోతుంది. ముఖ్యంగా కొన్ని కథల్లో ఆమె ఎత్తుగడ ఈనాడు చేయి తిరిగినరచయితలస్థాయిలో ఉన్నాయి. ఉదాహరణకి ఆమె శైలి చూడండి

> కాశీ మహాపట్నం. కృష్ణపక్షము. అర్థరాత్రి. వీథులు కళావిహీనములు. నక్షత్రకాంతి తప్ప మరి ఏకాంతీలేదు. ఎక్కడో మినుకు మినుకుమంటూ లెఖదీపాలు అవసాన కాలాన్ని తెలుపుతున్నాయి. అంచేత దీపాలు లేనట్టే లెఖ.
>
> ఆవీథ చాలాకాలంనుంచీ తుడిచినట్టుకూడా లేదు. గబ్బిలాలు కీచుకీచు మంటున్నాయి. గోడలనంటి తిరుగుతూవున్న అదృశ్యవ్యక్తులసడి. వీథిలో మధ్యమధ్య మహావృక్షాలు. ఉండి ఉండి నక్కలఊళలు. గాలి. గంగాభవాని కెరటాలహోరు వినిపిస్తూందప్పుడప్పుడు. ఇరువేపులా మహోన్నత సౌధాలు. మనుష్యులులేరు. కాని, ఏదోసడీ, నిట్టూర్పులూ వినిపిస్తున్నాయి. శవాల్ని కాలుస్తూన్న ధూమం ముక్కంటుతూంది. అల్లాంటి వీథిలోపడి తిరుగుతున్నాడో వ్యక్తి. ఆకలితో తిరుగుతున్నాడు. ఆహ్వానించేవాళ్లెక్కడెక్కడా? అన్నంపెట్టే అన్న

ఇలా సరళమైన జానుతెలుగులో చిన్న చిన్న వాక్యాలలో, కదాచితుగా చమత్కారం చొప్పించి , మనని అలరించే ఈకథలు 1920-30 దశకాలలో రాసేరంటే ఆశ్చర్యం కలగకమానదు. ఆవిడే చెప్పుకున్నట్టు వినోదాత్మకంగానే అనిపిస్తాయి కానీ దయ్యాలున్నాయా లేదా, ఇది వాస్తవమవునా కాదా, ఈమె దయ్యాలున్నాయని నిరూపించబోతోందా అన్న ప్రశ్నలు తోచవు.

ఘనాపాఠి, కవి కథల్లో ప్రధానంశం పండితులు విద్యాదానం చేయనందున కలిగే దుష్ఫలితాలు. నాకు ఈ కథలు ప్రత్యేకంగా నచ్చేయి. మనకి అనాదిగా విద్యాదానం ఒక ప్రాథమికవిలువ. తమకి గల విజ్ఞానాన్ని ఇతరులకి పంచిపెట్టమని మన శాస్త్రాలు చెప్తున్నాయి. నిజానికి ఏ కథ అయినా చేసేది, చెయ్యవలసినది అదే కదా. వాస్తవంలో ఇది జరగగలదా అని కాక, ఈకథద్వారా రచయిత ఇస్తున్న లేదా ఇవ్వదలుచుకున్న

సందేశం ఏమిటి అని. ఇలా ప్రశ్నించుకుంటే మనకి ఈకథలు అర్థవంతంగా స్ఫురిస్తాయి.

శైలిపరంగా చెప్పుకోవలసిన మరొక అంశం సంభాషణలద్వారా కథ నడిపించడం. **రాజమ్మ** కథ సంభాషణలరూపంలో మొదలుపెట్టి మూడొంతులు కథ నడిచినతరవాత కానీ కథకుడు ప్రవేశించడు. అంచేత అక్కడికి వచ్చేవరకూ పాఠకుడు పాత్రలని సంభాషణలద్వారా తానే మనోఫలకంమీద చిత్రించుకోవాలి. తరవాతి దశకంలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి విమానం ఎక్కబోతూనూ కథలో కూడా చూస్తాం ఇలా పాత్రలమాటలద్వారానే పాత్రచిత్రణ సాగడం.

రెండు రోజులక్రితం కుటుంబరావుగారి దయ్యాలకథగురించి చర్చ పేస్బుక్కులో చూసేను. కుటుంబరావుగారు దయ్యాలకథలు రాసేనాటికి ఆయనవయసు కూడా సుమారుగా రుక్మిణమ్మగారు ఈకథలు రాసేనాటివయసుకి దీటుగానే ఉంది. ఆయన దయ్యాలకథలు రెండు చదివేను కానీ ఆ రెండుకథలు కూడా శిల్పం దృష్ట్యా పేలవంగానే అనిపించేయి. నిజానికి ఆ కథలు కుటుంబరావుగారు కాక మరొకరు రాసి ఉంటే అవి ఈనాడు చర్చలదాకా అక్ఖర్లేదు ప్రచురణకే నోచుకునేవి కావు. అదే సాహిత్యాభిమానులబలం అనుకోవాలి. :p.

ఈనాడు చాలామంది రుక్మిణమ్మగారిపేరు విని ఉండరు. అమె సుబ్రహ్మణ్యశాస్త్రిగారికంటే, కొడవటిగంటి కుటుంబరావుగారికంటే ముందుతరంవారు. రుక్మిణమ్మగారికి పైరచయితలవంటి గుర్తింపు రాకపోవడానికి కారణం ఏమయి ఉంటుందో? స్థానాపతి రుక్మిణమ్మగార కథలే కాక కవనంలో ఉత్తమశ్రేణికి చెందినవారు అంటారు ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు. స్థానాపతి రుక్మిణమ్మగారిగురించిన వివరాలు-జన్మస్థలం నిడదవోలు. తల్లిదండ్రులు శ్రీకాకుళపు పురుషోత్తముగారూ, గరుడమ్మగారు. జన్మ సంవత్సరము 1915. ప్రస్తుతము వీరి నివాసము విశాఖపురీ

కన్యకాపరమేశ్వరీ ప్రాంగణము. ఆమె వివాహం విశాఖపురీ నివాసులు స్థానాపతి సత్యనారాయణగారితో. ఆమె 17వ ఏట ప్రారంభించి ప్రచురించిన కావ్యపరంపర – పూలమాల, దేవుడు, వత్సరాజు, దూతఘటోత్కచము, దయ్యాలు, ప్రార్థన, ఊర్మిళ, ప్రతిజ్ఞ (నాటకము), చాయ, (నవల), పూర్వగానము (ఖండకావ్యము), లీల (కావ్యము), దేవీభాగవతము (ఆంధ్రానువాదము), కాదంబిని (ఖండకృతుల సంపుటి), చారుదత్త (నాటకము) – ఇవి ముద్రితగ్రంథములు. సప్తశతి, నీలాటిరేవు, యుక్తిమాల – ఇంకను అముద్రితములు అన్నారు లక్ష్మీకాన్తమ్మగారు 1980లో. మరి తరవాత ప్రచురించేరేమో తెలీదు. (ఆంధ్రరచయిత్రులు (ప్రచురణ 1980 పు. 268-275).

రుక్మిణమ్మగారి కవితాపటిమనిగురించి వ్యాఖ్యానించగల పాండిత్యం నాకు లేదు. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి మాటల్లో - "అనన్య సామాన్య ప్రతిభతో నద్వితీయ కవితాప్రకర్షతో కవిత్వమొక యుపాసనగ, రచనమొక పవిత్రదీక్షగ, కావ్యోద్యోగమొక నియత జీవనవిధిగ భావించి, "క్షురస్యధారా నిశితా దురత్యయా దుర్గం పథస్తత్కవయో వదంతి" యను నానుడికి సార్థకత భజించి సరస్వతీ ప్రియసేవికయే తనరారిన మానెచ్చెలి లేఖని యమృతనిష్యంది లేఖినియే." (పు. 272).

స్థానాపతి రుక్మిణమ్మగారిని మార్చి 5, 1953లో కె.యన్. కేసరిగారు స్వర్ణకంకణముతో గౌరవించేరు.

(ఫిబ్రవరి 6, 2014)

# 7. కథాలహరి (కథాసంకలనం)

## సంపాదకులు: తల్లావఝ్ఝుల శివశంకరస్వామిగారు

తల్లావఝ్ఝుల శివశంకరస్వామి (శివశంకరశాస్త్రిగారు)గారి (1892-1972) "సంకలిత సంపాదితము" అన్నపేరుతో, ఆంధ్రప్రచారిణి వారు 1943లో వెలువరించిన ఈ సంకలనంలో 16 లబ్ధప్రతిష్ఠులయిన రచయితల కథలున్నాయి. అందరిపేర్లూ ఈనాటి పాఠకులందరికీ సుపరిచితం కాకపోవచ్చు. ఈ విషయం చివర్లో ప్రస్తావిస్తాను.

ఈ సంకలనంలో ఘనంగా చెప్పుకోవలసినది శివశంకరస్వామిగారి **పీఠిక.** భారతీయ సాహిత్యంలో చిన్నకథ చరిత్ర, స్వరూపస్వభావాలు ఆయన పన్నెండు పేజీల్లో ప్రస్ఫుటంగా వివరించేరు. "రచనలో వైవిధ్యము భరతఖండము ప్రపంచానికి ప్రసాదించింది" అని ప్రారంభించి "సారస్వతచరిత్ర సక్రమముగా గ్రహించనివారు కథావిధానాన్ని పరదేశాలనుంచి మనము ఎరువు తెచ్చుకొన్నామని భ్రమ పడతారు" అంటారు. అది వారికి సమ్మతము కాదు. ఆయన వేదసంహితలు మొదలుకొని అనేక ప్రాచీనగ్రంథాలలో కథలు ఉన్నాయని చెప్పి, ఆ కథల్లో భాష, వాక్యరచన, వర్ణన, సంభాషణ, ఉపసంహారములు ఉజ్వలంగా ఉన్నాయనీ కథాగమనము వివిధ రీతుల విప్పారిల్లిందనీ నోదాహరణంగా నొక్కి వక్కాణించేరు. జాతకకథల్లో ధర్మాలు, నీతులు, లోకవ్యవహారాలు కమనీయంగా చెప్పేరంటారు. కథాక్రమము సహజమూ, సరళమూ. ప్రతికథా గాధతో ముగుస్తుంది. గాధ ఒకవిధమైన పద్యముట. "కథారచనలో ఆంధ్రులది అందె వేసినచెయ్యి" అంటూ ఆయన బృహత్కథలు మొదలుకొని అనేక గ్రంథాల్లోనుండి అనేక ఉదాహరణలు ఎత్తి చూపిస్తుంటే, ఇవి మనం ఎప్పుడో ఒకప్పుడు విని ఉంటాం కానీ మనసులో నాటుకోలేదు అనిపించింది. తమకి భారతీయకథలే స్ఫూర్తినిచ్చేయని ప్రకటించిన పాశ్చాత్యులని కూడా ఉదహరించేరు స్వామిగారు.

50వ దశకంలో కొడవటి కుటుంబరావు, వల్లంపాటి వెంకటసుబ్బయ్యవంటి రచయితలు ప్రస్తావించిన కథ ఉపాంగాలు మనకి పరిచితమే. వారికంటె ఒక దశాబ్దంముందే ఆ ఉపాంగాలగురించి ఈ పీఠికలో శివశంకరశాస్త్రిగారు ప్రస్తావించినా, అవి మనకి పూర్వకాలంనించీ మనసాహిత్యంలోనే ఉన్నాయంటారు. వారి మాటల్లోనే "కథాత్మలో వస్తువు, తద్విశేషాలు, భావాలు, భావపర్యవసన్నత, రసప్రతీతి – ఇవి లక్ష్యములో ఉండాలి. రచయితల రసికతనుబట్టి హృదయంగమత్వము గానీ, ధీప్రతీతి గానీ ఉద్దీప్తమై ఉంటుంది."

సూక్ష్మంగా ఒక్కమాటలో కథలు ఎలా రాస్తారన్న సంశయం గల ప్రతి రచయితకి ఈ పన్నెండు పుటలు చాలు కథా కమామీషు తెలుసుకోడానికి. నాకయితే మొత్తం పీఠిక అంతా విడిగా ఒక వ్యాసంగా ప్రచురించవచ్చు అనిపించింది.

ఈ సంకలనంలో నన్ను ప్రత్యేకంగా ఆకట్టుకున్న అంశాలు ఇతివృత్తాల్లో వైవిధ్యం, ప్రతి ఒక్క రచయితకీ గల ప్రత్యేకమైన శైలి. సంపాదకులు ఈ శైలిలో ప్రత్యేకతలను పట్టుకుని తదనుగుణంగా కథలు ఎంపిక చేసుకోడం కనిపిస్తుంది. దానితోపాటు అన్నికథలకీ ఉపాదేయంగా అంతస్సూత్రంగా సర్వసామాన్యమైన తెలుగుజాతి వెలుగులు ప్రతిఫలించేయి ఈ సంకలనంలో. రెండు కథలు మాత్రం నాకు వేరుగా తోచేయి. వాటిగురించి చివరలో ప్రస్తావిస్తాను.

**మొదటికథ గాదె** (తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి) లో పాఠాలబోధన పేరుతో నరకం చూపించే పంతులుగారి చెరనించి తప్పించుకోడానికి ప్రయత్నించే అబ్బాయి కథ. కుటుంబరావుగారి **చదువు** నవలలో సుందరం చిన్నప్పటి స్కూలు అనుభవంలాటిదే ఇది కూడా. ఈకథలో పిల్లవాడు పంతులుగారు కొట్టే దెబ్బలు భరించలేక, గాదెలో దాక్కోడం, తరవాత అమ్మమ్మ వచ్చి పంతులుగారిని చీవాట్లు పెట్టి, ఆ బాలుని ఆదుకోడం – మనసుకి హత్తుకునేలా చిత్రించేరు రచయిత పిల్లవాడికోణంనుండి.

**అరిసె ముక్కలు** (వర్ఘు బాబూరావు) శిల్పంద్రుష్ట్యా నన్ను ప్రత్యేకించి ఆకట్టుకున్న కథ. ఇది కూడా ఉత్తమపురుషలో పదేళ్ల అమ్మాయి సుందరి చెప్పిన తనపెళ్లి కథ. తనకి పదేళ్లొచ్చేవరకూ ఆ పిల్లపెళ్లిమాటే తలపెట్టలేదు తండ్రి అంటూ మొదలవుతుంది కథ. మరో రెండేళ్లకి పెళ్లి కుదిరింది. మేనబావ రాముడు ఉన్నాడు కానీ ఏణ్ణర్థం మాత్రమే తేడా, మరో రెండేళ్లు తేడా ఉంటే వాళ్లిద్దరికీ పెళ్లయి ఉండేదంటుంది అమ్మమ్మ. పెళ్లిమాట తలపెట్టిన మరో రెండేళ్ళకి పెళ్లి నిశ్చయమవుతుంది. "పెళ్ళికొడుకు కుదిరేదాకా నాకూ మనశ్శాంతి లేదు. వైశాఖమాసములోగా సంబంధము కుదిరితే సరే. లేకపోతే, దోవను పోయ్యేవాడిని పిలిచి నాలుగెకరాలు గట్టుపెట్టి ముడిపేస్తా! అని మానాన్న ఒకసారి అన్నప్పుడు నాప్రాణము చివుక్కుమన్నది" అంటూ మధనపడుతూ ఉంటుంది. మొత్తమ్మీద పెళ్ళి కుదిరింది. తీరా లగ్గంవేళకి మొగపెళ్లివారు రామన్నారు. కారణం పిల్ల మేనమామతమ్ముడు సీమకు వెళ్ళివచ్చినవారితో కలిసి భోజనం చేసేడని! అంచేత ఆయనకి వెలి, ఆయన్నిబట్టి వీరికీ వెలి, అంచేత మొగపెళ్ళివారు ఈ సంబంధం అక్కర్లేదన్నారు! విదేశాలకి వెళ్లినవారే కాదు వారితో సహపంక్తి భోజనాలు చేసినవారిని కూడా వెలి వేస్తారని నాకు ఈ కథ చదివేకే తెలిసింది. ఆ తరవాత ఆ మామ చెప్పిన మాటలు ఇంకా బావున్నాయి - "ఆ దొంగముండాకొడుకులు రామన్నారని కార్యం మానుకుంటామా ఏమిటి? వాళ్ళమొహంమీద కొట్టినట్టు ఈ లగ్గంవేళకే వివాహం చేయించకపోతే నియోగపువాణ్ణి కాను" అని ఆయన శపథం చేస్తాడు. పెళ్ళి జరుగుతుంది. ఎలా చేసేరో నేను చెప్పను కానీ మనవాళ్ళు అవసరసమయాల్లో సంప్రదాయాలకి ఎలా అర్థనిర్ణయాలు చేసుకుని, ఆచరణలో పెడతారో మరోమారు విశదమవుతుంది ఈ కథలో. ఈవిషయంలో మనం సాధించిన ప్రగతిగురించి సంతోషించకతప్పదు. సంప్రదాయాలని మూకవుమ్మడిగా విమర్శించేవారు నిత్యజీవితంలో వాస్తవంలో మన పూర్వులు కార్యం ఎలా సాధించుకున్నారో ఈకథ

చదివి తెలుసుకోవచ్చు. ఈకథలో మరో చిన్న వివరం – పెళ్ళి కాకముందు బావని నువ్వు అంటూ ఏకవచనంలో సంబోధించే సుందరి పెళ్ళయినతరవాత మావారు అంటూ కథనం సాగించడం. నిజజీవితంలో ఏంచేస్తారో అని నాకు ఇప్పుడు ఆలోచన వస్తోంది. కథ పొడుగునా ఆరోజుల్లో చాకలివాడిచేత లగ్నపత్రిక పంపడంలాటి చిన్న చిన్న వివరాలు అనేకం ఉన్నాయి. నాకు అంచేత కూడా ఈకథ నచ్చింది.

పల్లెల్లో సామాన్యుల జీవితాలను కళ్ళకి కట్టినట్టు వర్ణించిన కథలు **చిన్న (చింతా దీక్షితులు)**, **మట్టెలరవళి** (కవికొండల వెంకటరావు). ఇందులో మొదటికథ **చిన్న** మధ్యతరగతి జీవితాన్ని చిత్రిస్తే, రెండోకథ జాలరిజంట జీవితాన్ని చిత్రిస్తుంది.

**చిన్న** కథలో ప్రధానంశం చిన్నపెళ్ళి. పిల్ల మిరియపుగింజలా చురుగ్గా పనిపాటలు చేస్తూ ఉంటుంది. పులుగడిగిన ముత్యంలాగ ఉన్నది. ఎర్రగా మాతాబాలాగ ఉంటుందని పెళ్లియీడు కుమాళ్ళతల్లులు అనుకోడం కద్దు - అంటూ సాగుతుంది కథ. తల్లి చనిపోయేక, తండ్రి, అమ్మమ్మలు పెంచుతూ, ఆమెపెళ్ళి ప్రయత్నాలు చేయడం ప్రదానాంశం. కథ ఉత్తమపురుషలో ఆ అమ్మాయికోణంలోనుండి సాగుతుంది.

"బావను పెళ్లాడుతావుటే?" అని తండ్రి సుబ్బయ్య వాకిట్లో ముగ్గు పాములు, తీగలు, పద్మములు, పువ్వులు, లతలు గీస్తున్న పదేళ్ళ చిన్నని ప్రశ్నించడంతో మొదలవుతుంది. పెళ్లిమాటతో వికసించిన మొహం బావమాటతో ముడుచుకుంది. "జుట్టూ లేదు ఏమీలేదు, నాకక్కర్లేదు," అని ముగ్గుబుట్ట అక్కడ పారేసి పారిపోయింది. సుబ్బయ్య గట్టిగా నవ్వుకున్నాడు. పాశ్చాత్యనాగరికపుస్పర్శ తగలని ఒక పల్లెటూరి పిల్ల వృత్తాంతమిది. ఆ తండ్రికి ఒకే కూతురు కావడంవల్ల ఆయన కూతురుకి తెలుగు కావ్యాలు, లీలావతీగణితమూ, మల్లన్న గణితమూ చెప్పించేడు. భాషవిషయంలో ఆయన పూర్వాచారపరాయణుడు. కూతురు నామకరణకాలములో పురోహితుడు మహలక్ష్మి అని రాస్తే, కళ్ళెర్ర చేరి, హాకి దీర్ఘం పెట్టి తిరగరాయించేడు. కూతురికి కూడా

తనని పెళ్ళాడేవాడివిషయంలో అంతటి నిర్దుష్టమయిన అభిప్రాయాలూ ఉన్నాయి. బావ రామారావుకి కాలేజీ చదువుకి కాకినాడ వెళ్లినప్పుడు నవనాగరికపుదెబ్బ తగిలింది. క్రాపు చేయించినాడు. బొట్టు పెట్టుకోవడం మానేసినాడు. పంచె మాని షరాయి తొడుగుతున్నాడు, పాశ్చాత్య అనుకరణ పరాయణత్వమహిమ! చిన్నకి అది పనికిరాలేదు. ఇక్కడ గమనించవలసిన విషయం - తండ్రి "బావని చేసుకుంటావా" అంటే "జుట్టూ లేదు, ఏమీ లేదు, నాకక్కర్లేదు," అని స్వేచ్ఛగా చెప్పగల చనువు తండ్రిదగ్గర ఆ పిల్లకి ఉండడం. కాలేజీచదువుకి కాకినాడ వెళ్లిన రామారావు, అక్కడివాతావరణానికి అనుగుణంగా జుత్తు కత్తిరించుకున్నాడు. చిన్న తనని అక్కర్లేదందని విని, తనకి ఏది ముఖ్యమో వితర్కించుకుని, ఓ నిర్ణయానికి వచ్చి, జీవితాన్ని ఓ కొలిక్కి తెచ్చుకున్నవైనం చింతా దీక్షితులుగారి అభ్యుదయభావాలకి నిదర్శనం.

**మట్టెలరవళి** (కవికొండల వెంకటరావు) కథలో ఆర్ద్రత పరాకాష్ఠ అందుకుంటుంది. మహోధృతంగా ఊరూ నాడూ ఏకంచేస్తూ విజృంభించి విరుచుకుపడుతున్న వరదల్లో కొట్టుకుపోతున్న నాగడు, ఆడ్ని రక్షించాలనే పట్టుదలతో, ఆడికోసం పల్లారుస్తూ ఒడ్డున పరుగులు తీస్తున్న ఆడమనిషి – అంతే కథ. వరదల్లో కొట్టుకుపోతున్న మనిషిమనసులో ఆరాటం, ఆలోచనలు, గట్టెమ్మట పరుగెత్తుతూ ఆడికోసం ఆరాటపడిపోతున్న ఆమెతపన గొప్పగా చిత్రించేరు రచయిత. ఈ యిద్దరి వేదనతోపాటు కథకుడి పరిశీలనాదృష్టి కూడా అద్భుతంగా ఆవిష్కరించడం చూస్తాం ఈకథలో. నీటిలో కొట్టుకుపోతున్నవాడిగురించి కథకుడు అంటాడు, ''జంతువుకేదో స్వతస్సిద్ధమైన శక్తి సార్థ్యం అనంతమైయింది ఉండవచ్చును. కాని మనిషికి అలాంటిది వున్నట్టు కనిపించదు. మనిషి శరీరనిర్మాణంలో కొమ్ములు లేవు, తోక లేదు, నాలుగు కాళ్ళు లేవు. పోనీ, పడగ లేదు, ముడుచుకుపొయ్యేగోళ్ళు లేవు, ముందుకు వచ్చే

కోరలు లేవు. ముళ్ళు లేవు, పొలుసుల్లేవు, వేళ్ళ వేళ్ళమధ్యనూ చర్మం లేదు. ఏదీ లేదు. మనిషికేదీ లేదని చెప్పొచ్చు."

అలాటి దుర్భరక్షోభతో గిలగిల్లాడుతున్న మనిషిని రక్షించేది ఏమిటి అంటే తనబతుకుతో పడుగూపేకలా జమిలిగా కలిసిపోయి, అతడే తానయి, అతడికోసం అంతగానూ గిలగిల్లాడిపోతూ పరుగులు పెడుతున్న ఆడమనిషికాలి మట్టెలరవళి! పాఠకునిచేయి పుచ్చుకుని ఒక మహోన్నత శిఖరానికి తీసుకుపోయే సొగసు సంతరించుకున్న గొప్ప కథ ఇది. అతి మామూలు పదాలతో, విద్యాగంధంలేని ఆ ఇద్దరి మనోభావాలు చెప్పించడంలో రచయితప్రతిభ అద్వితీయం.

**శైలబాల** (అడివి బాపిరాజు) పాఠకులని మరొకస్థాయిలో అసాధారణమైన భావనాలోకంలోకి తీసుకుపోయి రసమయధునిలో ఓలలాడించే కథ. భార్యాభర్తలు ఒకరితో ఒకరు పెనవేసుకుపోయి, జీవితాన్ని రసమయం చేసుకున్న మరో జంట **కామకోటి** (మల్లాది రామకృష్ణశాస్త్రి) కథలో చూస్తాం. **నిరీక్షణ** (సురవరం ప్రతాపరెడ్డి) కథలో సముద్రంలో చేపలు పట్టడానికెళ్ళిన మళయాళీ శంకరన్, అతడు చేపలు పట్టుకు తిరిగివస్తాడని జీవితాంతం నిరీక్షిస్తూ గడిపిన కుమారికథ. కుమారిని కన్యాకుమారిగా, దేవతగా ఆవిష్కరించిన ఆర్ద్రతతో కూడిన కథ.

**గానభంగం** (నోరి నరసింహశాస్త్రి) కథలో రుక్మిణి భర్త ఇంట్లో లేనిసమయాల్లో పొరిగింట్లో ఉన్న విద్యార్థి రాజగోపాలం పాడుతున్న సంగీతానికి పరవశించి ఆ గానరసాస్వాదనలో ఔచిత్యం మరిచి అతడికి చేరువ కావడం ప్రధానాంశం. **భార్యా రూపవతీ శత్రుః** (శ్రీనివాస శిరోమణి) కథలో నీడలు భర్త అపోహలకి దారి తీయడం ఇతివృత్తం. ఒకకథలో అనర్థం, మరో కథలో అపార్థం చిత్రించడం జరిగింది. అలాగే దాంపత్యజీవితజీవితంలో అల్లకల్లోలం చిత్రించిన మరో కథ **చిత్తరువు** (మొక్కపాటి లక్ష్మీ నరసింహారావు). ప్రధానపాత్ర నారాయణరావుజీవితంలో రెండోభార్యా, చదువు చెప్పించడానికి చేరదీసిన

కృష్ణమూర్తి మూలంగా కలిగిన క్లిష్టసమస్యకి మొదటి భార్య చిత్తరువుద్వారా పరిష్కారం గ్రహించుకుని ముగ్గురి జీవితాలని సరిదిద్దుకోడం ప్రధానాంశం. ఈ కథలో కూడా **గానభంగం** కథలోలాగే స్త్రీపురుషుల నిషిద్ధ సమాగమం కీలకసమస్య.

విశ్వనాథ సత్యనారాయణగారి **మక్లీ దుర్గంలో కుక్క** కథలో కుక్కలద్వారా వర్ణాశ్రమవివక్షతలలో లోపాలు చిత్రించేరు. వారికథగురించి నేను వేరే చెప్పక్ఖర్లేదు కదా. ఈకథలో ఆయన శైలి, భావజాలం, తర్కం స్వతఃసిద్ధంగానే చాలామంది పాఠకులని ఆకట్టుకుంటుంది.

పీఠికలో శివశంకరశాస్త్రిగారు ఈసంకలనంలో కథలగురించి "ఈసంకలనంలో ప్రకృతివర్ణన, పల్లెటూరి జీవితము, పట్నవాసుల భావసాంకర్యము, బాలకుల పాఠశాలానుభావాలు, అరణ్యము, ఆఖేటము (వేట), హాస్యోద్దీపకసన్నివేశాలు, ఆకలిబాధ, అధమవర్ణులవ్యధలు, సంప్రదాయసంఘర్షణలు చిత్రముగా వర్ణించి ఉన్నవి. భావవిహారానికి, మానసికోద్దీపనానికీ ఉపకరించే ఉత్తమ కల్పనలు ఉన్నవి. రాగము, రసికత, అసూయ, హృదయనాదానికి పదునెక్కించే పరిస్థితులు ఉన్నవి," అన్నారు.

మొదట్లో చెప్పేను వీరందరు లబ్ధప్రతిష్ఠులయిన రచయిలతని. ఈనాటి పాఠకులకి సుపరిచమైన పేర్లు బహుశా తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, నోరి నరసింహశాస్త్రి, మొక్కపాటి నరసింహశాస్త్రి, అడివి బాపిరాజు, మల్లాది రామకృష్ణశాస్త్రి, మునిమాణిక్యం నరసింహారావు. వీరు కాక, చింతా దీక్షితులు, వేదుల సత్యనారాయణశాస్త్రి, కవికొండల వెంకటరావు పేర్లు కూడా కొంత పరిచయమయే ఉండవచ్చు. మిగతావారిలో కొడవటిగంటి వెంకటసుబ్బయ్య (కుటుంబరావుగారి అన్నగారు), శ్రీనివాస శిరోమణి ఎంతమందికి తెలుసో నాకు తెలీదు. సురవరం ప్రతాపరెడ్డి, వింజమూరి శివరామారావు గార్లని కథకులుగా ఎరిగినవారు తక్కువే

కావచ్చు. వర్ఘు బాబూరావు, పెంపటి నాగభూషణం పేర్లు విననివారే ఎక్కువనుకుంటాను.

ప్రచురణకర్తలు అరవైమంది కథలు మూడు సంకలనాల్లో వెలువరించాలని అనుకుంటున్నామని, మూడో సంకలనంలో అన్నీ స్త్రీలరచనలే ఉంటాయనీ రాశారు. మరి ఆ సంకలనాలు వచ్చేయో లేదో తెలీదు. ఈ కథలు ఎప్పుడు ప్రచురించేరో తెలీదు కానీ రచయితలపేర్లూ, ఇతివృత్తాలూ చూస్తే, సుమారుగా ఒకటి రెండు దశాబ్దాలలో వచ్చినట్టు కనిపించింది నాకు. ఆ దశాబ్దాలలో ఒక పరిమిత పరిధిలో అరవైమందిని ఎంచుకుంటున్నప్పుడు, అవన్నీ మెచ్చుకోదగ్గ స్థాయిలో ఉంటాయని ఆశిస్తాం. నామటుకు నాకు ఆ స్థాయిలో లేవు అనిపించిన కథలు రెండు – కొడవటిగంటి సుబ్బయ్యగారి **ఏప్రిల్ ఫూల్**, పెంకటి నాగభూషణంగారి **ఎండమావులు**. మొదటికథ కాలేజీ అబ్బాయిల చిలిపి చేష్టలు. మామూలుగా ఇలాటికథలు స్కూలు పత్రికలలో చూస్తాం. బహుశా శివశంకరశాస్త్రిగారు హాస్యోద్దీపకసన్నివేశం గల కథ అన్నది ఈ కథనేమో కానీ నాఅభిప్రాయంలో ఆ రోజుల్లో ఇంతకంటే ఎక్కవ హాస్యరసస్ఫోరకమైన కథలు వచ్చేయి. **ఎండమావులు కథ**లో చుక్కలే చుక్కలు! ఆ చుక్కలమధ్య పదాలు వెతుక్కుని వాక్యం కూర్చుకుని చదవాలి అనిపించింది. ఈ రెండు కథలూ కూడా మిగతా కథలతో పోలిస్తే పేలవంగానే ఉన్నాయి. మల్లాది రామకృష్ణ శాస్త్రిగారి **కామకోటి** కథలో కూడా చుక్కలు ఎక్కువే. నిజానికి ఆయన కథల్లో చమత్కారంతో కూడిన మెరుపులు ఎక్కువే గానీ ఇలా ఇన్ని చుక్కలు చూసినట్టు నాకు జ్ఞాపకం లేదు. ఈకథలు చదవకండి అని చెప్పడం లేదు నేను. ఈ కథలని మెచ్చుకునే పాఠకులు ఉండే ఉంటారు. శివశంకరస్వామిగారు ఎంచుకున్నారు కదా.

సంకలనం చివరలో రచయితలగురించి ఇచ్చినవివరాలు చేర్చడం బాగుంది. అలాగే ఈ కథలు ఎప్పుడు ఎక్కడ ప్రచురించేరో కూడ చెప్పి ఉంటే బాగుండేది.

ఇప్పటికే చాలా వ్యాసం పెద్దదయిపోయింది కనక చెప్పడం లేదు కానీ ఇతర కథలు కూడా ఆయా రచయితల ప్రత్యేక శైలిని ఎత్తి చూపుతూ, పాఠకులని అలరించేలా ఉన్నాయి. చిన్నకథలయందు ఆసక్తి గలవారు తప్పక ఈ సంకలనాన్ని ఆదరిస్తారనే అనుకుంటున్నాను.

(ఫిబ్రవరి 19, 2014)

# 8. మునిమాణిక్యంగారి హాస్యప్రసంగాలు

## హాస్యప్రసంగాలు, ఇతర కథలు



మునిమాణిక్యం (1898-1973) అనగానే, నోట్లో మాట నోట్లో ఉండగానే, కాంతంకథలు అనేస్తారు చాలామంది అదేదో అసంకల్పప్రతీకారచర్యలాగ. పదిరోజులకిందట నరసింహారావుగారి ఇతర రచనలు కొన్ని దొరికేయి. వాటిలో హాస్యంతోపాటు ఇతరరసాలు కూడా చిప్పిల్లి నన్ను ముప్పిరిగొనేలా చేసేయి. కొన్ని చోట్ల ఆశ్చర్యపోయేను ఆయనే ఈయనా అని. మరికొన్ని సందర్భాలలో ఆశ్చర్యం ఇతరకారణాలవల్ల.

గత పదిరోజుల్లోనూ ఇతర వ్యాపకాలు చూసుకుంటూ నేను చదివినవి తొమ్మిది పుస్తకాలు. అవి – యథార్థదృశ్యాలు (1945), తగూ నెంబరు త్రీ (1950, మంచివాళ్ళు- మాటతీరు (1955), కాంతం వృద్ధాప్యం (1955), హాస్యప్రసంగాలు (1956), జానకీ-శర్మ (1956), రుక్కుతల్లి (1955, పునర్ముద్రణ 1958), ఇల్లు– ఇల్లాలు (1980), దాంపత్యజీవితం (రమణీయ ఘట్టాలు) (తేదీ లేదు). అన్నీ చిన్న చిన్న పొత్తములు. నాకే పుస్తకానికి గంటా, గంటన్నర సరిపోయిందంటే మనోవేగపఠితలకి (స్పీడు రీడరులు) వోపులో కూరముక్కలు ఉడికేలోపున, కప్పు

కాఫీ తాగేలోపున అయిపోతాయన్న మాట. ఒక్కొక్క టుక్కుకి పావుగంట ఎక్కి తొక్కి అన్న మాట.

వీటిలో నాకు అమితానందాన్ని కలగించిన పుస్తకం **హాస్య ప్రసంగాలు**. అందుచేత దానితోనే మొదలు పెడుతున్నాను. ఈ పుస్తకంలో నరసింహారావుగారూ, ప్రచురణకర్తలూ కూడా ఊహించని ఏప్రిల్ ఫూల్ తరహా హాస్యం ఒకటి ఉంది. అది మొదట చెప్తాను.

పుస్తకంమొదట్లో విషయసూచిక ఇదీ – 1. కాంతం పుట్టుపూర్వోత్తరాలు, 2. హెడ్ మాష్టర్, 3. చుట్ట, 4. వృథాప్రయత్నము "రహస్యము బయట పెట్టకూడదు." 5. జ్యోతిషం, 6. చమత్కార సంభాషణ.

ఇది చూడగానే, మొట్టమొదట దేనికోసం చూస్తాం? కాంతం పుట్టుపూర్వోత్తరాలకోసమే కదా? చాలామంది అవునవునవునంటారనే అనుకుంటున్నాను. ప్చ్. ఈ పుస్తకం జీరాక్స్ చేసినవారు అలా అనుకోలేదు. అంచేత ఆ భాగం వదిలేసేరు! ఆపైన రెండో అధ్యాయంలో హెడ్ మాష్టర్ చరిత్రలో ఏమనుకున్నారో కానీ అక్కడ కూడా మొదటిపేజీ వదిలేసేరు.

సరే, హాస్యకథలు ఎక్కడయినా మొదలు పెట్టొచ్చు అని త్వరితగతిని ఒక నియమం నాకు నేనే చేసేసుకుని, చదవడం మొదలు పెట్టేను. గొప్ప హాస్యం విరజిమ్మేరు అంటూ నేను నరసింహారావుగారికి కితాబు ఇవ్వఖ్ఖర్లేదు. కేవలం నాకు అమందానందం కలిగించిన కొన్ని అంశాలు మాత్రం స్పృశించి వదిలేస్తాను. ఆపైన మీకు మీరే చదువుకుని ఆనందించవచ్చు.

ఈ రెండో పేజీలో అరిస్టాటిల్ syllogism ప్రాతిపదికగా హెడ్ మాష్టర్ తత్వవిచారణ ప్రారంభించి, హెడ్ మాష్టరుకి మరణం ఉందని నిరూపించి, హెడ్ మాష్టరు మళ్ళీ హెడ్

మాష్టరుగానే పుడతాడు అన్న జగదీశ భట్టాచార్యుని మతము ఉటంకించి, ఆ తరవాత మహా భారతకాలం, బౌద్ధులకాలం, బ్రిటిష్ వారికాలంలో "హెడ్ మాష్టరు" రూపులో క్రమక్రమంగా వచ్చిన భేదప్రభేదాలు సంపూర్ణంగా ఆవిష్కరించేరు. నేను పొడి పొడి ముక్కలు నాలుగు చెప్పి ముగించేస్తే మూలరచయితప్రతిభకి అన్యాయం చేసినదానిని కాగలను. అంచేత అది మీకే వదిలేస్తాను.

అలాగే **చుట్ట** కూడా ప్రాచీనకాలంనుండి ఉందని నరసింహారావుగారి మతము. భారతం, కళాపూర్ణోదయంవంటి కావ్యాలలో, ప్రబంధాలలో, ధర్మరాజు, భీముడు, కళాపూర్ణోదయంలో కళాపూర్ణోదయుడు (ఎవరో నాకు తెలీదు, ఇది రచయితపదం), కలికాలంలో కాటూరి వెంకటేశ్వరరావుగారూ, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారూ వీరందరూ చుట్ట తాగేవారే అని సహేతుకంగా ఋజువు చేసేరు. యత్ర యత్ర ధూమః తత్ర తత్ర అగ్నిః అన్న శాస్త్రాన్ని తిరగేసి, అగ్ని లేనిచోట పొగ ఉండదు అని కూడా నిర్ధారణ చేసేరు. కానీ ఈ పొగ తర్కం దగ్గరికొచ్చేసరికి కాంతంగారిదే చివరిమాటట. ఇలా కాంతంగారిని బరిలోకి లాగిన సందర్భాలు ఉన్నాయి కానీ అట్టే లేవు ఈ పుస్తకంలో.

ఇందులో మనని అట్టహాసంగా నవ్వించేసే మరో రచన **చమత్కార సంభాషణ.** ఛలోక్తి అన్నపదం విన్నాను కానీ ఛలోక్తి అంటే ఛలముతో కూడుకున్నది అనీ, ఛలము అని వేరే పదం ఒకటుందనీ నాకు తెలీదు. అలాగే ఛలోక్తి అంటే హాస్యరసపూరితవాక్యము అనే అనుకున్నాను కానీ ఛలము అనేకరూపములలో ఉంటుందని ఈకథ చదివేక తెలిసింది. వృత్తిరీత్యా మాష్టరు కనక నరసింహారావుగారు ఈ రచనలో కూడా అసమాన ప్రజ్ఞాపాటవాలు గల మాష్టరుగా కనిపిస్తారు. తర్కము, న్యాయదర్శనము వంటి ప్రాచీనగ్రంథాలూ, ప్రముఖ ఆంగ్లరచయితల రచనలూ చక్కగా పరిశీలించి, నావంటి సామాన్యులకి అర్థమయేరీతిలో మూడు రకముల ఛలములనూ సోపపత్తికంగా మనముందు ఉంచేరు. ఛలస్వరూపానికి జల్పవితండానికి భేదం కూడా గుర్తిస్తే

ఛలస్వరూపాన్ని గురించి పూర్తిగా తెలుసుకొనినవారమవుతాముట. వితండమంటే ఎదుటివారి వాక్యమును నిరాకరణ చేయటము, ఛలము అంటే అర్థాంతరకల్పనచే వాదివాక్యాన్ని ఆక్షేపించి హేళన చేయడముట. చదువుతున్నప్పుడు నవ్వకుండా ఉండలేం. ఆ తరవాత ఆలోచించకుండా ఉండలేం.

అన్ని పుస్తకాల్లో కాదు కానీ రెండు పుస్తకాలకి పీఠికలు ఉన్నాయి. రచయిత తన పుస్తకంలో "అశ్లీలాలు లేవు. శబ్దాలంకారాలు, అర్థాలంకారాలు ఉన్నవి. ధ్వని కావలిసినంత ఉన్నది. ఆనందవర్ధనుడికే హడలు పుట్టించేటంతటి ధ్వని పౌష్కల్యం ఉన్నది అంటారు. అంతే కాదు. వెనకటి కవులందరూ ప్రపంధ పరమేశ్వరుడని ఒకరూ, ఆంధ్రకవితాపితామహుడని ఒకరూ నేనంతవాణ్ణి ఇంతవాణ్ణి అని చెప్పుకున్నట్టుగానే తాను కూడా చెప్పేరుట. "నారచనలో ధ్వని ఉంది, ఔచిత్యముంది, ఉదాత్తత ఉంది, ఉపమానాలు, ఉత్ప్రేక్షలు లేకపోతేనేమి, ఊపులున్నవి. వక్రోక్తులు లేకపోయినా వంపులున్నవి. నేను హాస్యవిష్ణువును" అంటారు. ఎంచేతంటే, బ్రహ్మ వేరే ఉన్నారుట. ఆఖరికి ఏది లేకపోయినా "అది" ఉందిట. "అది" అనగానే మల్లాది రామకృష్ణశాస్త్రిగారు చెప్పిన "అది" గుర్తొచ్చింది కానీ మునిమాణిక్యంవారిదృష్టిలో "అది" అంటే పాఠకుణ్ణి పుస్తకం చివరిదాకా లాక్కుని వెళ్ళేగుణము అని మాత్రమే. కరుణకీ, శృంగారానికి ఇచ్చిన గౌరవమూ, ఆదరణా హాస్యానికి కూడా ఇయ్యవలసి ఉన్నదని వక్కాణించేరు. ఇది నాకు కూడా సమ్మతమే! హాస్యం తేలిక అయినదనీ, బరువు లేదనీ అంటారు. బరువు లేకపోతేనేమి, బంగారంలాటి సరుకు ఉన్నది అన్నారు. అది మనం ఒప్పుకోక తప్పదు.

తనకి బిరుదులూ, ప్రభువుల ఆదరణా, సన్మానాలూ లేకపోయినా, ప్రసిద్ధులైన కవులు, పండితులు, అయినవారి స్నేహమే తనకు గల మహా భాగ్యము అన్నారు. వారిస్నేహాలు మనకి మహాప్రసాదం. శివశంకరస్వామివారు, కాటూరివారు, విశ్వనాథ,

మొక్కపాటి, భమిడిపాటి మొదలైనవారంతా తమకి గురువులూ, మిత్రులూనుట. ఆ మిత్రులందరి చతురభాషణలు నరసింహారావుగారు ఏ మర్మమూ లేకుండా హాయిగా మనతో పంచుకున్నారు. మచ్చుకి రెండు చెప్తాను. ఒక సినిమాహాలుకి రెండు దోవలు ఉన్నాయి. ఒకదానిమీద పెద్దమనుషులు అనీ రెండోదానిమీద స్త్రీలు అనీ రాసేరు. శాస్త్రిగారు రెండూ చూసి, "మనని ఎవరూ పెద్దమనుషులుగా చూడడంలేదు. అంచేత పెద్దమనుషులం కాదు కాబట్టి తర్కరీత్యా స్త్రీలమే అయినాము," అని అటు నడిచేరుట (హాస్య ప్రసంగాలు). గిడుగువారు ఇంట్లో సవరభాష మాటాడడం మూలంగా భార్యతో పోట్లాటలు లేవు (ఇల్లు–ఇల్లాలు).

ఈ కవిపుంగవులు మొత్తం తొమ్మిది పుస్తకాల్లోనూ సందర్భానుసారం దర్శనమిచ్చి ఈరచనల ఉద్దీపనం ద్విగుణీకృతం చేసేరు. పుస్తకం చదువుతుంటే ఒక పరిహాసకుడు వరసగా చెప్పుకుపోతున్న చతురోక్తులలా కాక, పదిమంది పండితులమధ్య కూర్చున్నభావం కలుగుతుంది మనకి.

నరసింహారావుగారు దాంపత్యజీవితంలో మధురిమలు ఎంత సూక్ష్మంగా గ్రహించి ఆవిష్కరించేరో, అంత నిశితంగానూ  పిల్లలప్రవృత్తులు కూడా అవగాహన చేసుకుని ఈ కథల్లో పదిలంగా పొదిగేరు. **కాంతవృద్ధాప్యం**లో మనుమరాలు శేషు తాతకి గణితశాస్త్రంలోనూ, వ్యాకరణశాస్త్రంలోనూ కూడా పాఠాలు చెప్తుంది. ఆ పిల్లలెక్కప్రకారం మూడుతరవాత పదకొండు వస్తుంది. తాతారు, నాన్నారు అన్నపదాలు సాధువులు. నోరు లేదు కానీ "తాత, నాన్న" పదంబులకు గారు పరంబగునప్పుడు ప్రాయకంబుగ "గ" లోపించి తత్పూర్వాక్షరము దీర్ఘంబగు అని సిద్ధాంతీకరిస్తున్నదన్నమాట" అంటారు.

**తగూ నెంబరు "త్రీ", ఇతరకథలు సంకలనంలో అనంగ అనంగ** కథలో పంతులుగారు రాధాయికి గొల్లవాడు, పులి కథ (పులి, పులి అని అరవడం, తరవాత నిజంగా పులి

వచ్చినప్పుడు గ్రామస్థులు నమ్మకపోవడం) చెప్తారు. కాంతం తిరిగొచ్చేక, రాధాయి అమ్మకి చెప్పినకథ మనోజ్ఞంగా ఉంది. గొల్లవాడికి గొర్రెని తినాలనిపించింది. గొఱ్ఱెని చంపడానికి  పులిని పిలిచాడు  ... ఇలా సాగిపోతుంది కథ అమ్మకీ నాన్నకీ ఎనలేని ఉల్లాసాన్ని కలిగిస్తూ. ఇది చదివినతరవాత, నిత్యజీవితంలో  పెద్దవాళ్లే మనకథనాన్ని ఎంతగా మార్చేస్తారో తలపుకొచ్చి నాకు పట్టలేనంత నవ్వొచ్చింది.

దంపతుల ప్రణయకలహాలూ, హాస్యాలూ, అపహాస్యాలూ ఒక్క కాంతంకథల్లోనే కాదని కూడా ఈ పుస్తకాలు చూసేక తెలుసుకున్నాను. జానకీ – శర్మ, సుందరం బార్య – ఏ పేర్లు పెట్టినా రచయిత సందేశాన్ని ఆదరికే చేరుస్తారు. అది చాలక, ఈ కథల్లో కిటుకులన్నీ చేర్చి ఒక కుప్పగా పోసి కూర్చిన దాంపత్యోపనిషత్తు **ఇల్లూ – ఇల్లాలు.** పతంజలి యోగసూత్రాలంత సూక్ష్మంగా కాకపోయినా, అక్కడక్కడ రససిద్ధికోసం చిన్న చిన్న కథలు కలిపి చెప్పినా, మొత్తంమీద వివాహితులందరూ ఆనందమయ మరియు ఆదర్శమయజీవితం గడపాలంటే నరసింహారావుగారు ప్రవచించిన ఈ మహావాక్యాలు కంఠతా పట్టి, గోడమీద రాసుకుని రోజుకోమారు భక్తిపూర్వకంగా వల్లించుకుని, కళ్ళకద్దుకోవాలని రచయిత అభిమతం కావచ్చు. అన్నట్టు చెప్పడం మరిచేను. ఈ పుస్తకం ఆదిలో గ్రంథావరణప్రశంస ఉంది. రచయిత ఈపుస్తకం ఎప్పుడు ఎలా చదవాలో స్పష్టం చేసేరు. అలాగే కథనం మొదలు పెట్టేక, మహాకవులు, పండితులు, విద్వాంసులు తగువు వచ్చినప్పుడు ఒకొకరు ఏం చేసేరో చెప్పి తరవాత తన సూత్రాలు వివరిస్తారు.

ఇంతకీ ఇది 1980లో రాయడం నాకు కొంత ఆశ్చర్యం కలిగించింది. ఎందుకంటే ఈ సూత్రాలు 50వ దశకంలో పనికొచ్చేవేమో కానీ 80వ దశకం వచ్చేసరికి మన తెలుగు ఆడబడుచులు మగవారి ఈ కుట్రలు కనిపెట్టేసి, తదనుగుణంగా తమ ప్రవర్తనలు కూడా తీర్చి దిద్దేసుకున్నారని నా దృఢనమ్మకమ్ము!

**దాంపత్యజీవితం** లో కాంతంపాత్ర విలక్షణమైనది. నేను నరసింహారావుగారి 25 రచనలూ చదవలేదు కానీ చదివినంతమటుకు, కాంతం పరమసాధ్వి, ఉత్తమయిల్లాలు, ఊళ్ళో అందరికీ తలలో నాలుక. ప్రతి ఒక్కరికీ ఏదో ఒకరకం బంధువే- అమ్మ, పిన్ని, అత్తయ్య, వదిన. ఈ **దాంపత్యజీవితం** పుస్తకంలో కాంతం ఇతర అమ్మలక్కలతో చేరి, కూతురు జయతో ఇంటికి వచ్చిన ఆమె తోడికోడలిని చులకన చేసి మాటలాడగల నెఱజాణ. ఆ అమ్మాయి తనకూతురితో తమఇంటికి రావడమే ఆమెకి నచ్చలేదు. ఆపైన "మగవారితో సమానంగా కూర్చుని మాటాడుతుందిట. కాలిజోళ్ళు వేసుకుని ఊర్లోకి వెడుతుంది ..." ఆమె చేసిన ప్రతి పనీ తప్పుగానే కనిపిస్తుంది కాంతానికీ, ఇరుగూపొరుగూ అమ్మలక్కలకీ. ఈ పాత్రచిత్రణ నాకు కొంచెం ఎబ్బెట్టుగానే అనిపించింది.

ఈ పుస్తకాలలో నాకు కొంచెం నిరుత్సాహం కలిగించిన పుస్తకం మంచివాళ్లు – మాటతీరు. ఇది చదువుతున్నంతసేపూ how to make friends and influence people చదువుతున్నట్టనిపించింది. అచ్చంగా అదే అనడం లేదు. నిజానికి ఇంగ్లీషుపుస్తకం వ్యాపారదక్షతకి సంబంధించిన పుస్తకం. ఎదటివాడికి ఏమి వినాలని వుంటుందో అదే చెప్పు అన్నది అందులో నీతి. మునిమాణిక్యంగారు ఎదటివాడిని నొప్పించకుండా మాటాడేతీరు చెప్తున్నారు. కానీ నాకు అందులో మునిమాణిక్యంమార్కు హాస్యం అట్టే కనిపించలేదు. ఈ పుస్తకానికి ఆంధ్ర మహాభారతం నిఘంటువు (1662 పేజీలు) కూర్చిన అబ్బరాజు సూర్యనారాయణగారు పీఠిక రాసేరు. పీఠికలో "చదువుకోనివారికంటె చదువుకున్నవారికే ఈ పుస్తకం ఎక్కువ ఉపయోగపడుతుంది" అంటారు. ఎందుకంటే, పుస్తకంలోఉన్న విషయాలన్నీ మనకి తెలిసినవే అయినా, "మనముఖం మనకు తెలిసిందే అయినా అద్దంలో చూచుకొని బాగుందో లేదో సరి చేసికొంటాము. అట్లే ఈ పుస్తకాన్ని అప్పుడప్పుడూ

చదువుకుంటూ మనప్రవర్తన సరిగా ఉందో లేదో సరిచేసుకుంటాము," అని వ్యాఖ్యానించేరు. పీఠిక తప్పకుండా చదవాలి.

ఈ తొమ్మిది పుస్తకాలలోనూ చుక్కల్లో చంద్రునివలె, పూలతోటలో కొబ్బరిమానువలె విడిగా, ఉదాత్తంగా, మహోన్నతంగా హిమవత్ శిఖరమువలె నిలిచేది **రుక్కుతల్లి.** నరసింహారావుగారి కుమార్తె 14 ఏళ్ల వయసులో అకాలమరణం పొందినవెనుక, ఆమె జీవితాన్ని పరామర్శించుకోడమే ఈ కథ. ఆసాంతం రుక్కుతల్లి సౌశీల్యం, త్యాగనిరతి, దైవభక్తి, తల్లి తనకి ఒప్పచెప్పిన గురుతరబాధ్యత విజయవంతంగా నిర్వహించాలన్న దీక్ష మనని పట్టి కుదిపేస్తాయి. చివరలో రచయిత, "బుద్ధి తెలిసిన ఏ పిల్ల అయినా తమ్ముళ్ళను, చెల్లెళ్ళను ప్రేమతో చూడకపోతే రుక్కుతల్లి కథ చెప్పండి," అంటారు. ఈవాక్యం చదివి కంట తడిపెట్టనివారు ఉండరేమో.

ఈ రుక్కుతల్లి కథలో మరొక విశేషం కథనాన్ని ఒక కథకుడు కాక 7, 8 మంది నిర్వహించడం. ఒక పాత్ర కొంత కథ చెప్పేక, దుఃఖాతిశయంచేత గానీ మరొక కారణంగా కానీ, మరొకరు అందుకుని కొనసాగించడం జరుగుతుంది. ఈ పుస్తకానికి పీఠికలో ఇటువంటి ప్రయోగం ఇదే ప్రథమం అన్నారు. అవునో కాదో నాకు తెలీదు. కానీ ఇటువంటి ప్రయోగంమూలంగా కథనరీతిలో మరికొన్ని ప్రత్యేకతలు సాధించేరు మునిమాణిక్యం నరసింహారావుగారు.

చివరిమాటగా, కథలు రాయడం ఎలా అని అడిగేవారికి, ఇదుగో, ఈపుస్తకాలు వాయువేగమనేవేగాలతో కాక, శ్రద్ధగా ఒకొకవాక్యం, ఒకొక సన్నివేశం చదివి, మనసారా నవ్వుకుని, తరవాత ఈయనకి ఎలా వచ్చింది చెప్మా ఇలా రాయడం అని సుదీర్ఘంగా ఆలోచించుకుంటే, పూవులతో గూడిన నారకువలె ఆ పరిమళాలు కొంతైనా మీరు రాయబోయే కథకి అబ్బవచ్చు అనుకుంటాను.

మరొక చిన్న అంశం కూడా మనం గుర్తు పెట్టుకుంటే ఈ కథలు ఇంత ఆత్మీయంగా ఎందుకు అనిపించేయో తెలుస్తుంది. మామూలుగా రచయితలు తమ అనుభవాలు, తమయిళ్ళలో సంఘటనలే రాసినా, పాత్రలపేర్లు మారుస్తారు. మునిమాణిక్యం నరసింహారావుగారికి అలాటి దాపరికాలు లేవు. ఆ అరమరికలూ లేని అతి సాధారణ మహానుభావులు ఆయన. అందుకే పాత్రలు – పంతులు (తాను), కాంతం, రాధాయి, రుక్కుతల్లి, సుశీ, శాస్త్రి ...  తమకుటుంబంలో పేర్లు! పాత్రలని సజీవపాత్రలు చెయ్యడానికి ఇంతకంటే ఏం కావాలి?!

మునిమాణిక్యం నరసింహారావుగారి అమ్మాయి, సిహెచ్. మంగ ఇంటర్వ్యూకి లింకు ఇక్కడ

తెవికీలో మునిమాణిక్యం నరసింహారావుగారి జీవితం, సాహిత్యం వివరాలకి లింకు ఇక్కడ

000

(ఏప్రిల్ 15, 2014)

# 9. తెన్నేటి సూరిగారి కథలు, కవితలు

తెన్నేటి సూరిగారి (1911-1957) పేరు ఏమాత్రమైనా పరిచయం ఉన్నవారికి మొట్టమొదట స్ఫురించేవి వారి ప్రతిష్ఠాత్మక నవల **చెంఘిజ్ ఖాన్**, ఆనవలతో ప్రతిభావ్యుత్పత్తులలో సరి తూగగల అనువాదం **రెండు మహా నగరాలు** (మూలం Charles Dickens నవల A Tale of two cities). ఇది ఆంధ్రపత్రిక సారస్వతానుబంధంలో ధారావాహికగా ప్రచురించిన రోజుల్లో ఆవురావురంటూ వారం వారం పత్రికకోసం ఎదురు చూసిన వందలాది (వేలాది కూడానేమో) పాఠకులలో నేను సైతం ఉన్నాను :).

పదిరోజులక్రితం హఠాత్తుగా http://www.new.dli.ernet.in/ సైటులో తెన్నేటి సూరిగారి పేరు కనిపించగానే ప్రాణం అహో సుదినం అనిపించింది.

నేను ఈవ్యాసం మొదలు పెట్టడానికి కారణం ఆ సైటులో సూరిగారి పుస్తకాలు రెండు దొరకడం. మొదటి పుస్తకంలో **మహోదయం** పేరుతో ప్రచురించిన సంకలనం. 1959లో ప్రచుణ. ఇందులో రెండు కథలు, ఒక కాల్పనిక నాటిక, 8 కవితలు ఉన్నాయి.

మొదటికథ **వీణ** మహావిద్వాంసురాలయిన కల్యాణి తానే వీణయి, సంగీతసుధలహరిలో మమేకమయి వినేవారిని సైతం ఆ మాధురీఝురులలో ఓలలాడించగల ప్రతిభావంతురాలు. ఆమె సంగీతప్రావీణ్యానికి ముగ్ధుడయి ఆ సంగీతాన్ని ఆస్వాదిస్తూ అలౌకికానందాన్ని అనుభవించే తండ్రి, బి.కాం. పట్టా ఉండీ ఉద్యోగం దొరక్క టైపిస్టుగా చేరి, ఆ పట్టామూలంగా సాటి ఉద్యోగులఎత్తిపొడుపులు

తట్టుకోలేక మనోవేదనకి గురైన భర్త చంద్రశేఖరరావు – ఈ ముగ్గురితో, రచయిత తనదైన ప్రత్యేకశైలిలో గొప్పభావుకతతో, అద్భుతమైనభాషాపటిమతో ఆవిష్కరించేరు. సంగీతవిశేషాలు తెలిసినవారికి ఈకథ చదవడమే ఒక రసాస్వాదనానుభవం కావచ్చు.

రెండోకథ **బూరె ముక్కలు**లో కన్నతల్లి అనారోగ్యంకారణంగా దాదిపాలు తాగుతూ ఆమెతో పెంచుకున్న అవ్యాజానురాగం. దాదే ఆ పిల్లవాడి సర్వస్వం. తల్లి తనని సతాయిస్తే, ఆవిడకేం అధికారం ఉంది నామీద అనుకునేపసివాడిని చూస్తే పాఠకుడిమనసు కూడా పల్లవిస్తుంది. తల్లి సర్వవిధాలా ఇద్దరినీ ఆదరిస్తున్నా, ఆ పిల్లవాడికీ దాదికీ మధ్య గల అనుబంధం వారికి మాత్రమే వేద్యం. ఆ పిల్లవాడికోణంలోనుండి చెప్పిన ఈకథ ముగింపులో దాది కోణం మెరుపులా ఝుళిపించి కథకి కొత్త అందాన్ని చేకూర్చింది.

**సమవాకారం** అన్న కాల్పనిక నాటికలో సమకాలీనకవులని పాత్రలుగా తీసుకుని వారివే కొన్ని కవితలు తీసుకుని గొప్ప హాస్యం కురిపించరు సూరిగారు. సూత్రధారుడుగా గిరీశం ప్రవేశించిన తరవాత, కొల్లూరి ధర్మారాయకవిగారి చాకిరేవు కవితతో ప్రారంభించి ఒకొక కవిని రంగంమీదికి తెచ్చినవిధానం మన మనసులని ఆకట్టుకుంటుంది. తెన్నేటి సూరిగారి హాస్యం, వ్యంగ్యం నామాటల్లో చెప్పలేను. పార్కర్ పెన్ బాకులా పుచ్చుకుని విశ్వనాథ సత్యనారాయణగారూ, ఆకుపచ్చ టపేటా శిల్కు లాగూ, ఎర్ర టపేటా బుష్ కోటూ తొడుక్కుని ఎర్రజండా పుచ్చుకుని శ్రీ శ్రీ, తాటాకుగొడుగుకింద కవితాసామగ్రి తో దుకాణం పెట్టుకు కూర్చున్న కాటూరి వెంకటేశ్వరరావుగారూ, పింగళి లక్ష్మీ కాంతంగారూ, ముళ్ళకిరీటంతో కృష్ణశాస్త్రిగారు, ఎత్తైన తక్తుమీద స్వామి శివశంకరశాస్త్రిగారూ, ఇంకా ఆరుద్ర, రుక్మిణీనాథశాస్త్రి, కవికొండల వెంకటరావు, రాయప్రోలు సుబ్బారావుగారు – ఆనాడు ప్రసిద్ధులయిన

కవులందర్నీ ఒకచోట చేర్చేరు సూరిగారు ఈనాటికలో. ఇది చదువుతున్నప్పుడు మీకు నవ్వు రాకపోతే, ఇంక మిమ్మల్ని ఎవరూ నవ్వించలేరనే అనుకోవాలి.

**ఈపుస్తకంలో చేర్చిన కవితలు అరుణరేఖలు** పుస్తకంలో కూడా ఉన్నాయి కనకి ఆ పుస్తకమే ప్రస్తావిస్తాను. ఇందులో 16 కవితలున్నాయి. ఇది 1946లో ప్రచురించినట్టు digital library of india సైటులో ఉంది కానీ ఏ కవిత ఎప్పుడు రాసేరు, ఏ రచన ఎప్పుడు ఎక్కడ తొలిసారి ప్రచురించారు అన్న సమాచారం లేదు. ఈవిషయం ప్రత్యేకించి ఎందుకు చెప్తున్నానంటే, కొన్ని కవితలు చదువుతుంటే, ఇప్పుడు బహుళ ప్రచారంలో ఉన్న శ్రీ శ్రీ, ఆరుద్ర, దేవులపల్లి కృష్ణశాస్త్రివంటి వారి రచనలు మనకి స్ఫురణకి వస్తాయి. బహుశా స్థూలంగా ఆకాలంలో అటువంటి రచనలు చేసేరు అనుకోవాలేమో. లెండోయ్, పతితజీవనులార, బానిస ప్రజలార (మహోదయం), కూలిమాటడగండిరా, అన్నాలు చాలవని చెప్పండిరా (కీలు గుఱ్ఱం), కప్పతల్లీ లేచి, గబగబలు సేయ, కాకమ్మగూటిలో కళవళించిందీ (కన్నీటి కాలువ), తెల్లదొరా! మల్లుదొరా! ... అన్నదమ్ముల చీలదీశావా? తల్లిపిల్లల కెడము చేసావా? (క్విట్ ఇండియా), ఇలా చాలా చోట్ల మనకిప్పుడు బాగా అలవాటయిపోయిన పదజాలం కనిపిస్తుంది. ఆనాటి సమాజంలో భావజాలానికి అనుగుణంగానే, దేశభక్తి, స్వాతంత్రోద్యమధాయలు, దేశాన్ని ఉద్ధరించమంటూ మేలుకొలుపులు కనిపిస్తాయి ఈ కవితల్లో. ఉదాహరణకి రెండు కవితలు ప్రస్తావిస్తాను. **మహోదయం** కవితలో

ధర్మగోమాత తా తరలివచ్చింది,

బందెవెల్వడి మంచి పాలు చేపింది

సత్యవత్సము తల్లికుత్సవముగాగ

చెంగు చెంగున దూకి చేరుకున్నాది ... భ.

ఈ గేయం చదువుతుంటే నాకు చిలకమర్తివారు స్వతంత్రం రాకముందు రాసిన పద్యం గుర్తుకొచ్చింది.

భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై ఏడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి.

చిలకమర్తివారు స్వాతంత్ర్యం రాకముందు మన కర్తవ్యం బోధిస్తే, సూరి గారు స్వతంత్రం వచ్చేక మనధర్మం గుర్తు తెచ్చుకోమంటున్నారు. ధర్మ గోమాత బందె వెల్వడి మంచి పాలు చేపుతోంది, సత్యవత్సము చెంగు చెంగున దూకుతోంది తల్లికుత్సవము కాగ. ఇది ఎప్పుడు రాసేరో తెలీదు కానీ సుమారుగా 1947-1958 లో అయి ఉండాలి కదా. మరి 60 ఏళ్ళతరవాత  పరిస్థితులు ఏమైనా మారేయా, మాకిప్పుడు అలా చెప్పుఖర్లేదండీ అని అనగల స్థితిలో ఉన్నామా? ఈనాడు ఈ ధర్మగోమాత మోరలెత్తి ఏదిక్కులు చూస్తోంది? అంటే జవాబు లేదనే అనిపిస్తోంది. కనీసం గర్వపడదగ్గ సమాధానం లేదు.

ఈనాటికీ మారని మరో కఠోరసత్యం **నీ కవి** అన్న కవితలో కనిపిస్తుంది.

నీకవిని బ్రతికించుకోవాలిరా!
నీవు మనిషనిపించుకోవాలిరా!
బ్రతికియున్నన్నాళ్లు పట్టెడన్నము నిడవు
అతడు చచ్చినవెనుక అందలాలంటావు ... నీ.

పేర్లు చెప్పుకోడం మనకే సిగ్గుచేటు కనక పేర్లు చెప్పను కానీ బ్రతికిఉండగానే చివరిరోజుల్లో డబ్బుకి ఇబ్బంది పడిన మహారచయితలు ఉన్నారు మన

తెలుగుదేశంలో. ఈరోజుల్లో సాహిత్య సభలు, శాలువాలు, జ్ఞాపికలంటూ పలకలు, వీటికోసం అట్టహాసంగా పెట్టే ఖర్చులు చూస్తే, అందులో కనీసం సగం రచయితలు పరువుగా బతకగల ఏర్పాటు చేయకూడదా అనిపిస్తుంది నాకు. బహుశా ఇలాటి ప్రణాళిక ఏదైనా మొదలు పెడితే అందులో కూడా అయినవాళ్లకి ఆకుల్లోనూ కానివాళ్ళకి కంచాల్లోను అన్న ధోరణిలోనే సాగుతాయేమో. మన ఖర్మ అనుకుంటాను!

రెండు మహానగరాలు నవల వివరాలకోసం Facebookలో అడిగితే, సర్వశ్రీ జె.కె. మోహనరావు, సురేశ్ కొలిచాల, రమణమూర్తిగారలు ఇచ్చిన సమాచారం ఇది - రెండు మహానగరాలు 26.03.1952 సంచికలో ప్రారంభమై, 07.01.1953 సంచికలో సమాప్తమైంది. జూన్ 1953లో నవల పుస్తకరూపంలో వెలువడింది. ఇంత విలువైన సమాచారం అందించిన మిత్రులకు నాహృదయపూర్వక ధన్యవాదములు.

వికీపీడియా.ఆర్గ్ లో తెన్నేటి సూరిగారి వివరాలు ఇలా ఉన్నాయి -

తెన్నేటి సూరి (1911-1958)ఒక ప్రముఖ తెలుగు రచయిత. అభ్యుదయ కవి, కథారచయిత మరియు నాటకకర్త. ఛంఘిజ్ ఖాన్ నవలా రచయితగా సుప్రసిద్ధుడు. భారతి, ఆంధ్రపత్రికలలో 1945-1957లలో పత్రికా రచయితగా పనిచేశాడు. సూరి 1911లో కృష్ణా జిల్లా తెన్నేరులో జన్మించాడు.

చారిత్రక నవలైన 'చంఘీజ్‌ఖాన్' మొదట ఆంధ్రపత్రిక సారస్వతానుబంధంలో ప్రచురితమైంది. 13 శతాబ్దాల మధ్యగల ఆసియా ఖండ చరిత్రలో గర్వకారకుడైన మహాపురుషుడు చంఘీజ్‌ఖాన్ విదేశీ చరిత్రకారులు అతనిని ఒక సైతానుగా, అధికారదుర్మదాంధుడుగాను నియంతగాను నరరూపురాక్షసునిగాను చిత్రించారు. తెన్నేటి సూరి ఎన్నో శ్రమల కోర్చి యదార్థ చరిత్రను వెలికితీసి, ప్రాచ్య, పాశ్చాత్య గ్రంథాలను అపోశనపట్టి ఎంతో దక్షతతో ఈ నవలను తీర్చిదిద్దాడు. ఆయనకు గల

పరిపాలనా దక్షతను, శక్తి సామర్థ్యాలను, తనకింది అధికారుల పట్ల చూపిన ప్రేమాదరాలను చక్కగా వివరించారు. సూరి 1958, అక్టోబర్ 16న మరణించారు. తెవికి.ఆర్గ్ లో ఈ భాగానికి లింకు ఇక్కడ.

అప్రస్తుతమే అయినా ఆంగ్లేయులపాలనలో సృష్టించిన చరిత్ర పుస్తకాలు దోషభూయిష్ఠమని నోరి నరసింహశాస్త్రిగారూ, విశ్వనాథ సత్యనారాయణగారూ వంటి పండితులు ప్రకటించిన విషయాలు మరోసారి ఇక్కడ మననం చేసుకోక తప్పదు. చెంఘిజ్ ఖాన్ జీవితాన్ని ఆవిష్కరించడంలో తెన్నేటి సూరిగారు మరొకసారి ఆవిష్కరించేరు. మన చరిత్ర మనం పునరుద్ధరించుకోవలిసిన అగత్యం ఉంది. అదే దృష్టితో తెలుగువారే రాసిన తెలుగు నవలలు, కథలు చదవాల్సిన అవుసరం కూడా ఉంది.

(ఫిబ్రవరి 12, 2014)

# 10. జి.వి. కృష్ణరావుగారి కీలుబొమ్మలు

కీలుబొమ్మలుకి ప్రాణం పోసిన మానకలశుడుగా ప్రసిద్ధులయిన జి.వి. కృష్ణరావుగారు కృష్ణరావుగారి జననం 1914లో తెనాలి తాలూకా కూచిపూడి గ్రామంలో. మొదట వారిపేరుగురించి ఒక మాట-రెండవ స్థానంలో "ష్ణ" ప్రస్వాక్షరంతో రాసుకోడం వారి అభిమతంట.ఆర్య నాగార్జునుడు జ్ఞానానికి మానకలశం (కొలబద్ద ) అయినట్టే డా. జి. వి. కృష్ణరావు (1914-1979) ఆంధ్రసాహిత్యానికి మానకలశం అన్నారు కృష్ణరావుగారిని సన్మానించిన సందర్భంలో శ్రీఅరవింద సాహిత్యసేవాసమితివారు (మార్చి 3, 1979.).

కృష్ణరావుగారు తనవిద్యాభ్యాసంగురించి చెప్పినకథనం-చిన్నతనంలో ఆయనకి చదువుమీద శ్రద్ధ ఉండేది కాదు. తల్లీ, తండ్రీ చదువుకున్నవారు కాదు. ఇతనిని చదువుకోమని స్కూలికి పంపితే, పెళ్ళేవాడు కాదుట. ఆరోజుల్లోనే వారిమేనత్త వచ్చి, కుర్రవానిని తనతో తీసుకెళ్ళి స్కూల్లో పెట్టింది. ఆ రోజుల్లో తనరాతల్లో "చేపలన్నీ చాపలుగా, బాబులన్నీ బూచులుగా మారేవి"ట. అప్పుడే ఒక పేరడీ పద్యం కూడా రాసి స్నేహితుడికి చూపితే, ఆ స్నేహితుడు టీచరుకి చూపేడుట. ఆ టీచరు "పట్టుమని పది పద్యాలయినా నోటికి రావు, కవిత్వం మొదలు పెట్టేవా?" అంటూ మెత్తగానే చెప్పి ఆపైన అక్షరలక్షలు విలువగల సలహా ఇచ్చేరు, "కావ్యలక్షణగ్రంథాలు క్షుణ్ణంగా చచదువుకోకుండా పద్యం చెప్పటం తప్పు. అది నరకహేతువు ..." అని. అది మూడవఫారం (ఎనిమిదవ తరగతి)లో జరిగిన సంఘటన. నాటినుండి కావ్యపఠనం, వ్యాకరణాధ్యయనం స్వయంకృషితో సాధించేరు. దానివల్ల జరిగిన నష్టం, కొంతకాలంపాటు పద్యరచనయే కవిత్వం, సమాసజటిలతే ప్రౌఢిమ అన్న భ్రమకు

లోనయ్యేనంటారు కృష్ణరావుగారు. ఆ తరవాతికాలంలో పద్యం కంటే గద్యం ముఖ్యంగా వ్యవహారికభాషకి పెద్దపీట వేసేరు ఆయన.

స్కూల్ ఫైనల్ క్లాసులో ఉండగా కాంపోజిషను పుస్తకం సరిదిద్ది ఇస్తూ, వారి అధ్యాపకులు శాస్త్రిగారు, "దీర్ఘసమాసపదరచన మంచిది కాదు. అర్థకైవల్యం ముఖ్యం. ప్రయోజనమేదో ఉంటే తప్ప ఝటితిస్ఫూర్తి కలిగించని పదం వాడరాదు, రచన ఎప్పుడూ అరటి పండొలిచి అందించినట్లుగా ఉండాలి. అదే గొప్పరచన," అని చెప్పేరుట.

కృష్ణరావుగారికి చిన్నతనంలోనే వ్యాకరణాది గ్రంథాల్లో అభినివేశం ఉంది. హైస్కూల్లో ఉండగానే కవితలు, కథలు రాసేవారుట. 1931లో చిన్న నవల, 1934లో శతకం రాసేరు. పిల్లలకోసం కథలపుస్తకం రాసి అచ్చేయించేరు. అది స్కూళ్ళలో పాఠ్యగ్రంథంగా పెట్టించడానికి ప్రయత్నించేరు కానీ ఫలించినట్టు లేదు. స్కూల్లో ఉన్నరోజుల్లోనే ఒక టీచరుమీద కోపం వచ్చి పద్యం ఒకటి బోర్డుమీద రాసేరుట. తత్ఫలితంగా మరోస్కూలికి మారవలసివచ్చింది.

హైస్కూల్లో ఆయన స్నేహితులు తుమ్మల వెంకట్రామయ్యగారు ఇంటిపేరుకి సంబంధించిన ఒక ఉదంతం రాసేరు ఈ పుస్తకంలోనే. అప్పట్లో కృష్ణరావుగారిపేరు "గవిని వెంకటకృష్ణయ్య"గా నమోదు అయిందిట. కానీ కృష్ణరావుగారు తమకి గల శబ్దార్థ అన్వేషణ కారణంగా తమఇంటిపేరు గవను అని మార్చుకున్నారు. వివరాలు గుర్తు లేవు గానీ, పరీక్షించి చూస్తే, "గవఃక" అంటే దుర్గమపురద్వారమనీ, తరవాత గవను, గవని రూపాంతరాలనీ, కృష్ణరావుగారు గవను అన్నపదమే చాలాకాలం వాడేరనీ వెంకట్రామయ్యగారు రాసేరు. ప్రస్తుతం మాత్రం గవిని అనే వాడుకలో ఉన్నట్టుంది.

ఆ రోజుల్లోనే ఒకసారి, పరీక్షల్లో ప్రశ్నలకి సమాధానాలు రాయకుండా, చిన్నయసూరి వ్యాకరణసూత్రాలు ఆధారంగా ఆ ప్రశ్నల్లో వ్యాకరణదోషాలు ఎత్తి చూపుతూ నింపేరుట కాయితాలు. ఆ రోజుల్లోనే పెళ్ళిళ్ళలో వధూవరులని ఆశీర్వదిస్తూ పంచరత్నాలు చెప్పమని కోరేవారుట ఊళ్ళోవారు ఆయన్ని. (పు. 112).

కాలేజీరోజుల్లో అష్టావధానం, శతావధానం చేసేరుట.ఈ శతావధానానికి అడవిలో చెట్లు పృచ్ఛకులుగా ఊహించుకుంటూ ప్రశ్నలు తనే వేసుకుని, సమాధానాలు చెప్పుకుంటూ ప్రాక్టీసు చేసేరని తుమ్మల వెంకట్రామయ్యగారు రాసేరు. వరూధిని అన్న ఖండకావ్యం కూడా కాలేజీరోజుల్లో రాసిందే. “అయితే వీటివల్ల అలవడిన జల్లినేత వదిలించుకోడానికి చాలాకాలం పట్టింది,” అంటారు కృష్ణరావుగారు.

డిగ్రీకాలేజీలో ఉండగానే ప్రముఖ రచయిత గోపీచంద్‌తో పరిచయమేర్పడింది. పాశ్చాత్యసాహిత్యాభిలాష, ఆధునిక సాహిత్యరీతులు అతనివల్లనే అలవడ్డాయి. యం.యన్. రాయ్ రచనలూ, మార్క్సిజం అధ్యయనంతో ఆయన దృష్టి మారింది. వ్యావహారికభాషావాదం సముచితమని గ్రహించేరు. ప్రాచీనమార్గాన్ని అనుసరించే వారితోపాటు, ఆధునికులు చక్రపాణి, కొడవటిగంటివంటి రచయితలతో ఏ మందుల షాపులోనో కలుసుకుని విమర్శలు, కథాలక్షణాలు చర్చించేవారు.

డిగ్రీచదువు ముగిసినతరవాత ఉద్యోగంకోసం ప్రయత్నించేరు కానీ దొరకలేదు. కాశీఖండంలో వ్యాసుడిపాత్ర మనసులోకి వచ్చిందిట. ఆ సాక్షాత్కారఫలితమే **భిక్షాపాత్ర** నాటిక. “అనుభూతితప్తకటాహంలోనుంచి వెలువడిన నా మొదటి రచన” అన్నారు కృష్ణరావుగారు. పత్రికలకి పంపేరు కానీ అది ఏ సంపాదకుడికీ రుచించినట్లు లేదుట. కానీ, తరవాతికాలంలో ఆ నాటిక విశేషఆదరణ పొందింది.

ఆంధ్రాయూనివర్సిటీ రిజిష్ట్రారు కూర్మా వేణుగోపాలస్వామిగారు నాటకాభిమానిగా ప్రసిద్ధులు. ఆయన ఆధ్వర్యంలోనే ఆంధ్రా యూనివర్సిటీలో experimental theater వెలిసింది. లండన్‌నించి షేక్స్పియర్ నాటకసంఘంవంటి ప్రముఖ నాటకసంస్థలు వచ్చి ఆ థియేటర్లో ప్రదర్శనలిచ్చేవారు. కృష్ణరావుగారి **బిక్షాపాత్ర** నాటకం ఆ థియేటర్లో అనేకసార్లు ప్రదర్శించారనీ, తాను ఎన్నోసార్లు  చదివేననీ వేణుగోపాలస్వామిగారు రాసేరు. అనేకభాషల్లో ఈ నాటకానికి అనువాదాలు కూడా వచ్చేయిట.

కృష్ణరావుగారు ఉద్యోగం లేక, పైచదువులకి కాశీ వెళ్ళి ట్యూషన్లు చెప్పుకుంటూ యం.ఏ. ఆంగ్లసాహిత్యాధ్యయనం చేసేరు. అక్కడ ఇంగ్లీషు లిటరేచరు, లిటరరీ క్రిటిసిజం, పాలిటిక్స్ చదువుకున్నారు. ఆ అధ్యయనఫలితమే **కావ్యజగత్తు** అన్న పుస్తకం. "భరతునినుంచి పండితరాయలదాక, ప్లేటోనించి మార్క్స్ దాక ఉన్న మహామనీషుల సూక్తులను ప్రామాణికంగా ఉదహరించి కావ్యవస్తువు రూపం ఎలా పరిణామం పొందుతుందో, మార్క్సిస్టు దృక్పథంతో వివరించాను," అని చెప్పుకున్నారాయన ఆ గ్రంథంగురించి. "ఆధునిక సాహిత్య ఉద్యమాలను, వాటికి మూలమైన సామాజిక స్థితిగతులను, ఉద్యమకర్తల రచనలు, వీటి గుణగణాలను దానిలో పరామర్శించాను," అని వివరించేరు. (పు. 344).

రెండవప్రపంచయుద్ధం ముగిసేక, radical democratic party ఏర్పాటు చేసిన రాజకీయ మహాసభకి హాజరయేరు. అక్కడ యం.యన్. రాయ్ ఆనాడు అమలులో ఉన్న రాజకీయపక్షాలని నిశితంగా విమర్శిస్తూ, పక్షరహిత ప్రజాస్వామ్యంతో కూడిన నవ్యమానవతావాదాన్ని ప్రతిపాదించేరు. ఆ ఉపన్యాసం కృష్ణరావుగారిని దిగ్భ్రాంతులని చేసి, భవిష్యత్ జీవితానికీ, సాహిత్యకృషికి మార్గం నిర్దేశించింది. అదే ఆయన తత్వశాస్త్రాధ్యాయనానికి నాంది. ఆ తరవాత కళాపూర్ణోదయంమీద పరిశోధన చేసి పి.హచ్.డి పొందేరు.

కృష్ణరావుగారిజీవితం శబ్దార్థవిచారణనించీ జీవితార్థవిచారణవరకూ ఆసాంతం అనవరత జిజ్ఞాసగా కనిపిస్తుంది ఆయన రచనలు చూస్తే. **కీలుబొమ్మలు** నవలకి కూడా అదే ప్రాతిపదిక అంటారాయన. "స్వాతంత్ర్యమంటే ఏమిటి? మానవుడు దానిని ఎలా కోల్పోతున్నాడు! తిరిగి దానిని సాధించే మార్గమేమిటి? ఆర్థిక సామాజిక రాజకీయ హేతువులెంతవరకు మానవజీవితాన్ని మార్చివేస్తున్నవి? వ్యక్తుల కర్తవ్యమేమిటి? ఈ జిజ్ఞాసను రేకెత్తించటమే **కీలుబొమ్మలు** లక్ష్యం" అంటారు రచయిత (పు. 346). ఈ నవలను సుఖాంతం చేసి ఉంటే బాగుండేదని రాసిన పాఠకునికి ఆయన సమాధానం, "మీకోరిక చెల్లించివుంటే మీవద్దనుంచి ఈముక్కయినా నాకు లభించి ఉండేది కాదు" అనిట.

కాలేజీలో ఉండగానే నాగార్జునులగ్రంథాలను కాపీ చేసుకుని, **విగ్రహవ్యావర్తిని**, **రత్నావళి**, ఇంకా ఏడు రచనలను పద్యాలుగా అనువదించేరు. అవన్నీ దొంగలపాలు కాగా, **విగ్రహవ్యావర్తిని** మాత్రం తిరిగి అనువదించి విపులభూమికతో ప్రకటించేరు. కాలేజీలో పని చేస్తున్నప్పుడే **ప్లేటో రిపబ్లిక్** కూడా అనువదించేరు.

1962లో మళ్ళీ కాలేజీఉద్యోగం పోయింది. అప్పుడే **పాపికొండలు** నవల ప్రారంభించేరు కానీ రేడియోలో ఉద్యోగం దొరకడంతో నవలారచనకి విఘాతం కలిగింది. ఆ సమయంలోనే కొన్ని పద్యరచనలు, భాసుని ప్రతిమానాటకానికి అనువాదం, **ఉదబిందువులు** అన్న కథానికసంపుటి ప్రచురించేరు.

ఇది రచయత తమ సాహిత్యకృషిగురించి చెప్పుకున్న విశేషాలు (**నాసాహితీయాత్ర**, 340-46). ఉదబిందువులు కథానికసంపుటం అంటున్నారు కానీ ప్రస్తుతం నాకు దొరికిన కాపీలో కవితలూ, నాటికలూ, రెండు వ్యాసాలూ కూడా ఉన్నాయి. ఇది బహుశా పునర్ముద్రణ కావచ్చు. ఈవిషయం తరవాత చర్చిస్తాను.

**పాపికొండలు** నవల పూర్తి కాకుండానే కృష్ణరావుగారు దివంగతులు కావడం తెలుగువారి దురదృష్టం.

హైందవసంప్రదాయాలూ, ప్రాచీనసాహిత్యం, పాశ్చాత్యసిద్ధాంతాలూ క్షుణ్ణంగా చదివి ఆకళించుకుని, ఆలోచించుకుని తమదైన ఒక దృక్పథం ఏర్పరుచుకుని రచనలు చేసిన మేధావి కృష్ణరావుగారు. **జేగంటలు, కావ్యజగత్తు**వంటి గ్రంథాలు అందుకు నిదర్శనాలు. ఆదినించీ వారికి ధర్మచింతన, తాత్త్వికచింతన అధికంగానే ఉన్నట్టు బోధపడుతుంది ఈ పుస్తకాలు చదివితే.

మనమీద పాశ్చాత్యసంస్కృతి ప్రభావంగురించి కృష్ణరావుగారి అభిప్రాయం ఆలోచింపజేసేదిగా ఉంది. “ఆధునిక శాస్త్రీయ సాంకేతికపరిజ్ఞానాలు మనకి లభించాయి. హేతువాదం చోటు చేసుకొంది. పరిశ్రమలు నెలకొని సంపద పెరిగింది. అది ఏదో విధంగా చేజిక్కించుకోవాలనే తాపత్రయమూ పెరిగింది. వస్తుగతసంస్కృతి బాగా అబ్బి విలాసాలవెంట పరిగెత్తటం జరుగుతున్నది. వస్తుదాస్యంతో భావదాస్యమూ ప్రబలింది. నీతినియమాలు అడుగంటి ధర్మం, ఉదారవర్తన, రసజ్ఞత లుప్తమయిపోతున్నాయి. ఆర్థికవిలువల్ని నిర్లక్ష్యం చెయ్యరాదు. పాశ్చాత్యసంస్కృతినించి అది నేర్చుకున్నాం. కాని ఆర్థికవిలువలే అన్ని విలువలూనా? ... దురదృష్టవశాత్తు ఆ పరుగుపందాలే నేడు కనిపిస్తున్నాయి. ఏమవుతున్నదీ సమాజం? ధర్మానికి పట్టం కట్టి, సత్యం, శివం, సుందరాలని దర్శింపజేసే జీవితాన్నిచ్చిన సంస్కృతిని మనం క్రమంగా మర్చిపోతున్నామా అంటే మనల్ని మనం మర్చిపోతున్నామా?” అని ప్రశ్నిస్తున్నారు. నిజానికి కృష్ణరావుగారు ఉటంకించిన రెండు దాస్యాలకీ - వస్తుదాస్యం, భావదాస్యం - భాషదాస్యం కూడా చేర్చుకోవాలి. ఈనాడు ఇంగ్లీషో, హిందీవో లేకుండా గట్టిగా పది తెలుగువాక్యాలు మాటాడలేని తెలుగువారిసంఖ్య ఊహించలేనంతగా పెరిగిపోతోంది. మనసంస్కృతిగురించి మరోసారి మనం గట్టిగా ఆలోచించుకోవాలి.

చాలాకాలం నాకు కృష్ణరావు అంటే కీలుబొమ్మలు, కీలుబొమ్మలు అంటే జి.వి. కృష్ణరావు. అంతకుమించి తెలీదు. కానీ ఇప్పుడు మళ్ళీ ఇంటర్నెట్లో వెతికితే వారి ఇతర రచనలు కనిపించేయి. వీటి వివరాలు ఇవి -

**సాహితిచైత్రరథం.** ఇది జి.వి. కృష్ణరావు సాహితీ సమాలోచన సమితి, తెనాలి, వారు కృష్ణరావుగారి సాహిత్యకృషినీ, మూర్తిమత్వాన్నీ ఆవిష్కరించే ఉద్దేశంతో ప్రముఖ రచయితలు, విమర్శకులు, సాహిత్యాభిమానులూ రాసిన వ్యాసాలని సమకూర్చి ప్రచురించిన సంకలనం. ఇందులో కృష్ణరావుగారు రాసిన వ్యాసాలు కూడా మూడు ఉన్నాయి.

**రచయిత బాధ్యత** అన్న వ్యాసంలో ఈనాటి రచనలమీద కృష్ణరావుగారి వ్యాఖ్యానం, "ఈ పంచేంద్రియాలకు గోచరమవుతున్న లోకాన్ని దర్శించలేక, మనరచయితలు ఎప్పుడో ప్రర్తిల్లులోకాలను సంస్మరిస్తున్నారు. ఒకవేళ ఇప్పటి మన ఈ లోకాన్ని దర్శిస్తున్నా అవగతం చేసుకోలేకపోతున్నారు. అవగతం చేసుకొన్నా స్వార్థప్రాకారంలోపల నాలుగు కంబాలాట ఆడుతున్నారే కాని ఈ లోకంకోసం స్పందించలేకపోతున్నారు. ఇప్పటి మన ఈ లోకాన్ని అవలోకించి అవగతం చేసుకుని దీనికోసమే ఆవేదన పొంది నివేదించగలిగినప్పుడే రచయిత కవి ఔతున్నాడు. కానినాడు కవి యశఃప్రార్థి అవుతున్నాడు." (**సాహితీచైత్రరథం**, పు. 89.)

**జేగంటలు.** ప్లేటో దార్శనికసిద్ధాంతానికి తెలుగుసేత. ఇది అనువాదం అన్నారు కానీ ప్లేటో రచనలు కొన్ని తీసుకుని క్షుణ్ణంగా అధ్యయనం చేసి, నిశితంగా పరిశీలించి తమదైన అవగాహనతో తెలుగులో అభివ్యక్తం చేసినట్టుంది ఈ పుస్తకం. ఇటువంటివిషయాల్లో నాకు అవగాహన బొత్తిగా లేదు. చదవడానికి ప్రయత్నించేను కానీ అర్థమయిందని చెప్పలేను. అంచేత నేను ఇక్కడ చర్చించబోవడంలేదు. ఈవిషయాల్లో ఆసక్తీ, అభిరుచీ గలవారు తప్పక చదువుతారని ఆశిస్తాను.

**కావ్యజగత్తు** వ్యాసంలో అలంకారశాస్త్రానికి సంబంధించిన విపులచర్చ ఉంది.

**ఉదబిందువులు** – కవితలు, కథలు, నాటికలతోపాటు రెండు వ్యాసాలు కూడా ఉన్నాయి. ఈ సంకలనంలోనే ఆయన రాసిన తొలినాటిక, **భిక్షాపాత్ర** కూడా ఉంది. ఇది తాను కాశీలో యం.యే. అయినతరవాత ఉద్యోగం దొరక్క అవస్థలు పడుతున్న రోజుల్లో రాసిన నాటకం అని చెప్పుకున్నారు రచయిత. అయితే సహృదయుడయిన రచయిత ఎప్పుడూ కూడా తనబాధని కేవలం తనబాధగానే అక్షరగతం చెయ్యడు. దానికి విశ్వజనీనత కల్పించినప్పుడే అది రాణిస్తుంది. కృష్ణరావుగారు ఈనాటకంలో అది సాధించేరు.

నేను చాలాకాలంగా కృష్ణరావుగారి **కీలుబొమ్మలు** నవలకోసం వెతుకుతున్నానని చెప్పేను ముందొకసారి. కృష్ణరావుగారి కుమార్తె డా. ఉమాదేవిగారి ధర్మాన ఈ నవల ఇప్పటికి నాచేతికొచ్చింది.

నలభై, యాభై దశకాల్లో స్వాతంత్ర్యసమరం, స్వాతంత్ర్యేచ్ఛ ప్రబలంగా ఉన్న రోజులు కనక ఆనాడు వచ్చిన నవలల్లో చాలా భాగం జాతీయస్ఫూర్తికే ప్రాధాన్యం. అందుకు భిన్నంగా వచ్చిన నవలల్లో మనోవిశ్లేషణ నవలగా ప్రసిద్ధి పొందిన నవల బుచ్చిబాబుగారి **చివరకు మిగిలేది**. జి.వి. కృష్ణరావుగారి నవల **కీలుబొమ్మలు** కూడా అదే కోవలోకి వస్తుందని నాఅభిప్రాయం. అయితే **చివరకు మిగిలేది** నవలకి వచ్చిన ప్రాచుర్యం **కీలుబొమ్మలు**కి రాకపోవడం బహుశా ఇది కాంతాసమ్మితం కాకపోవడం కావచ్చు. నామటుకు నాకు **చివరకు మిగిలేది** కంటే **కీలుబొమ్మలు** ఎక్కువ నచ్చింది. కారణం చెప్తాను.

**చివరకు మిగిలేది** నవలలో దయానిధి పాత్రచుట్టూ నడుస్తుంది మొత్తం కథ. తనగురించి, ఇతరపాత్రలగురించీ దయానిధి అభిప్రాయాలే పాఠకుడికి తెలుస్తాయి, దయానిధికోణం తప్పిస్తే ఆపాత్రలకి అస్తిత్వం లేదు.

అందుకు భిన్నంగా, **కీలుబొమ్మలు** నవలలో ప్రతిపాత్ర ఆలోచనలు పాఠకులకి తెలుస్తాయి. ఏ పాత్రకి ఆ పాత్ర విడిగా తానుగా పాఠకుడికి దర్శనమిస్తుంది. ఏ పాత్ర ఎలా ఆలోచిస్తోందో తెలియడంమూలంగా పాఠకుడు తనకు తానై ఆ పాత్రగురించి ఆలోచించుకోడానికీ, అబిప్రాయాలు ఏర్పరుచుకోడానికి అవకాశం కల్పించేరు రచయిత.

సాధారణంగా **కీలుబొమ్మలు** అనగానే మనకి స్ఫురించేది మానవుడు విదిచేతిలో కీలుబొమ్మలు అన్నది. మరొకరెవరో తాళ్లు పుచ్చుకు లాగుతూ మనని ఆడిస్తున్నారని. కృష్ణరావుగారు ఈ నవల ఆ దృష్టితో రాయలేదని స్పష్టం చేసేరు ముందుమాటలో. మానవతావాదంస్ఫూర్తితో మానవుడు తనకి తాను ఆలోచించుకుని, ధర్మనిర్ణయం చేసుకోవాలని రచయిత ఆశయం. ఒక క్లిష్టసమస్య సంక్రమించినప్పుడు, మనం ఎలా ఆలోచిస్తాం, ఆ సమస్యని ఎలా పరిష్కరించుకుంటాం అంటే నూటికి తొంభై వంతులు ధర్మం మరిచి, తాత్కాలికమైన సౌకర్యాన్నే ఆశ్రయిస్తాం.

పుల్లయ్య భార్యకి చెప్పకుండా చంద్రశేఖరంతరఫున అప్పుపత్రంమీద పూచీ సంతకం పెట్టేడు. అప్పు తీర్చవలసినసమయం వచ్చేవేళకి శేఖరందగ్గర డబ్బు లేదు. పుల్లయ్య తీర్చాలి న్యాయానికి. కానీ ఆ అప్పు తీరిస్తే, తాను పూచీ పడ్డట్టు భార్య లక్ష్మమ్మకి తెలుస్తుంది. అది ఆయనకి ఇష్టంలేదు. కథలో ఇదీ కీలకసమస్య. ఊళ్లో అందరూ తలో విధంగా అనుకుంటారు. కూతురు నిలదీసి అడిగినప్పుడు, పుల్లయ్య కేవలం మౌనం ఆశ్రయించి, ఆమె అనుకున్నమాట “తండ్రి పూచీ పడలేదు” అని నిర్ణయించుకోడానికి పరోక్షంగా బలమిస్తాడు. ఆ తరవాత అదే సత్యమని పుల్లయ్య తనని తాను నమ్మించేసుకున్నతీరు చూస్తే మనకి ఆశ్చర్యం వేస్తుంది. పుల్లయ్య ధర్మాధర్మవిచక్షణ మరిచిపోయేడు. అజ్ఞానంతో కాదు, సంపూర్ణంగా తానేం చేస్తున్నాడో తెలిసి, ఆ స్పృహతోనే. రచయిత ఎత్తి చూపుతున్నది అదే. ధర్మాధర్మవిచక్షణ – ఎవరికి వారు చేసుకోవాలి. ఎవరికి వారు ధర్మం ఆచరించాలే కానీ మరొకరు సాధించిపెట్టేది కాదు.

ఇక్కడే మరొక కోణం కూడా ప్రస్తావిస్తాను ఈనాటి భావజాలం ప్రాతిపదికగా. పుల్లయ్య భార్యమాటకి ఇచ్చిన విలువ. సంపాదన ఆయన వంతు. సంసారం నడపడం ఆమె వంతు. తను చేసిన పని ఆమె అంగీకరించదన్న అభిప్రాయంతో ఆవిడకి చెప్పకుండా చంద్రశేఖరానికి పూచీ పడ్డాడు. ఆ సమయంలో తాను ఆ డబ్బు ఇవ్వవలసిన అవసరం రాదనే అనుకుని ఉంటాడు. అయితే, పుల్లయ్య భార్యతో చెప్పడానికి ఎందుకు వెనుదీశాడు అంటే అదే మనసంస్కృతిలో ప్రత్యేకత. భార్యాభర్తలు పరస్పరం ఒకరినొకరు గౌరవించుకునే తీరు. ఆనాడు దంపతులు ఆచరించే నియమనిష్ఠలు వాచ్యం చెయ్యకుండా చూపించడం జరిగిందిక్కడ.

**కీలుబొమ్మలు** నవలమీద ఆర్.యస్. సుదర్శనంగారు సాధికారకంగా చేసిన విమర్శ **సాహితిచైత్రరథం**లో ఉంది. ఆయనవ్యాసంలో ఒక అంశం – వాసుదేవశాస్త్రిపాత్ర – నాకు అంతగా పట్టుబడలేదు. "కృష్ణరావుగారు ధర్మాచరణవిషయంలో వ్యక్తికీ, అతని అంతఃకరణకూ ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తారు. పుల్లయ్య ధర్మాన్ని విస్మరించడంలోనూ డా. వాసుదేవశాస్త్రి ధర్మచ్యుతిలోనూ ఫ్రాయిడ్ ప్రతిపాదించిన అవచేతన ప్రమేయం చాలా ఉంది" అంటూ పుల్లయ్య తనధర్మాన్ని పిరికితనంతోనూ స్వార్థంతోనూ ధర్మనిర్వహణ చేయలేదనీ, వాసుదేవశాస్త్రి జరిగిన పొరపాటుకు బాధ్యత వహించి సామాజికంగా దాన్ని సవరించడానికి సిద్ధపడతాడనీ అంటున్నారు. నాకు వాసుదేవశాస్త్రి సూచించిన పరిష్కారం ధర్మసమ్మతంగా తోచడంలేదు.

సన్నివేశం ఏమిటంటే, వాసుదేవశాస్త్రి మగతనిద్రలో ఉండగా పద్మ తనకు తానై వచ్చి ఆయనతో సంభోగం జరిపింది. వాసుదేవశాస్త్రి అది కల అనుకుంటాడు. మళ్ళీ పద్మే వచ్చి తాను గర్భవతిననీ, ఆ బిడ్డ శాస్త్రిబిడ్డ అనీ చెప్పేవరకూ అది కల అనే ఆయన నమ్మకం. ఆతరవాత ఆయన చాలా ఆలోచించి చేసిన నిర్ణయం పద్మభర్త సత్యనారాయణకి చెప్పకుండా తనతో లేచిపొమ్మని. పద్మ దానికి అంగీకరించకపోవడం

ఆమె చేసిన నేరం. ఆమె పిరికితనాన్ని గర్హిస్తూ శాస్త్రి "ఆమెని బయటికి నెట్టివేసి దభేలును తలుపు వేసుకున్నాడు". ఇక్కడే నాకు శాస్త్రిధర్మాచరణ సబబుగా కనిపించడంలేదు. జరిగిన అధర్మంలో సత్యనారాయణకి పాలు లేకపోయినా, పద్మభర్తగా అతనికొక స్థానం ఉంది. జరిగిన తప్పు దిద్దుకోడానికి ఏ పరిష్కారం ఆలోచించినా, అందులో సత్యనారాయణకి కూడా పాలు ఉండాలి. ముగ్గురూ కలిసి ఒక నిర్ణయానికి వచ్చినప్పుడే ధర్మయుతమైన పరిష్కారం. (**సాహితిచైత్రరథం**. పు. 92).

సుదర్శనంగారు శాస్త్రిమాటలలో రచయిత తన అభిప్రాయాలని వ్యక్తం చేసేరంటున్నారు కానీ నాకలా అనిపించలేదు. శాస్త్రి పిరికితనం చూస్తే, కేవలం పాత్రగానే మనం తీసుకోడం న్యాయం అని నాఅభిప్రాయం. రచయిత ఇతరపాత్రలద్వారా కూడా తనఅభిప్రాయాలు వ్యక్తం చేసిన సందర్భాలున్నాయి.

రచయిత మున్నుడిలో "వ్యక్తులను గాని, పార్టీలను గాని, వస్తున్న ఎన్నికలను గాని ఉద్దేశించి దీనిని (ఈనవలని) రాయలేదు. ... ఈ రచనకు కళానుభూతే ప్రధానం. పార్టీ ఆవేశాలను సాధ్యమైనంతవరకు మరచి చదివినప్పుడే ఈ అనుభూతి ఇందులో సాధ్యం," అంటారు.

కృష్ణరావుగారు సత్యాన్వేషి. తత్వానుసంధాత. ఇంత విస్తృతమైన ధార్మికచింతనతో తదేకనిష్ఠతో సాహిత్యకృషి చేసిన మేధావి. బహుశా ఆయన తెలుగువాడుగా కాక ఏ పొరుగుదేశంలోనో పుట్టి ఉంటే, ఇంగ్లీషులోనో హిందీలోనో రచనలు చేసి ఉంటే విపులఖ్యాతి గడించి ఉండేవారేమో. ఆయనకాలంలో ఎందరో ప్రముఖకవుల, రచయితల, సాహిత్యాబిమానుల మన్ననలు పొందిన కృష్ణరావుగారిగురించి ఈనాటి పాఠకులు చాలామందికి తెలీదంటే, ఆయనపేరు కూడా వినలేదంటే ఆశ్చర్యం వేస్తుంది. కానీ ఆయనే చెప్పినట్టు ఆయన "యశఃప్రార్థి" కారు!

అంతర్జాలంలో కృష్ణరావుగారిరచనలూ, రచనలమీద విశ్లేషణలు నాకు దొరికిన కొన్ని వ్యాసాల, పుస్తకాలవివరాలు –

1. జి. ఆర్. కె. మూర్తిగారి వ్యాసం వారి బ్లాగులో

- http://karpuramanjari.blogspot.com/2011/03/rachana-vaisistyam-gv-krishna-rao.html

2. **సాహితీచైత్రరథం, జేగంటలు** ఆర్కైవ్.ఆర్గ్ లో

http://archive.org/search.php?query=creator%3A%22G.V.+Krishna+Rao%22

3. తెలుపు.కాంలో కృష్ణరావుగారి రచనలన్నీ దొరుకుతాయి అని ఉంది కానీ నాకు వివరాలు తెలీవు.

http://www.telupu.com/booklistGVK.html (distributors)

4. సి.పి.బ్రౌన్ ఎకాడమీవారి సైటులో కృష్ణరావుగారి కథ **చేసుకున్న కర్మ** Performed karma అన్న శీర్షికతో ప్రచురించేరు.

http://www.cpbrownacademy.org/chesukunna_karma.asp

5. DLI వారి సైటులో **కీలు బొమ్మలు** కూడా దొరుకుతుందని నాకిప్పుడే తెలిసింది. ఎటొచ్చీ మనకి వారి స్పెల్లింగులు తెలియాలి – రచయితపేరు - *ji vi krxshhnd-*araavu. పుస్తకంపేరు - kiilubommalu. బార్ కోడ్ - 2990100061623.

(అడిగిన వెంటనే కీలుబొమ్మలు పుస్తకం నాకు అందజేసిన జి.వి. కృష్ణరావుగారి కుమార్తె డా. కానూరి ఉమాదేవిగారికి కృతజ్ఞతలు.)

# 11. బుచ్చిబాబుగారి చివరకు మిగిలేది

## (పునరావలోకనం)



తెలుగు నవలాచరిత్రలో ప్రముఖ సాహితీవేత్తలు శాశ్వతస్థానంగలదిగా గుర్తించిన నవల బుచ్చిబాబు(1916-1967) చివరకు మిగిలేది. అయితే గత 10-15 సంవత్సరాలలోనూ పాఠకులలోనూ, విమర్శనాధోరణులలోనూ గణనీయమైన మార్పులు వచ్చేయి. ఆ మార్పుదృష్ట్యా కొన్ని ప్రసిద్ధనవలలు పునరావలోకనం చేసుకోవాలన్న నాఆలోచన ఈ వ్యాసానికి నాంది.

**చివరకు మిగిలేది** సమగ్రమైన తొలి మనోవైజ్ఞానికనవలగా విశేషమైనఆదరణ పొందినది. నవల పరిశీలించడానికి ముందు ఈ నవలకి ఉపోద్ఘాతంలో రచయిత వెలిబుచ్చిన అభిప్రాయాలు కొన్ని పరామర్శించవలసి ఉంది.

1. ప్రతీరచయితకీ తన ఆంతరంగికాన్ని నలుగురితో పంచుకున్నప్పుడే రచయితకి సంతృప్తి కలుగుతుంది. ... దానికొక మూల్యం, సామాజిక ప్రయోజనం ఏర్పడుతుంది.

2, పాఠకులకు జీవితంపై ఒక దృక్పథాన్ని కలగజేయాలనే ఉద్దేశంతోనే రచన సాగింది.

3. తల్లి చేసిన అపచారం నీడలా అతన్ని వెంటాడి, సంఘువిమర్శద్వారా, జీవితాన్ని కలుషితం చేసింది. ఈ దౌర్జన్యాన్ని ఎదుర్కోడంలో అతను కొన్ని విలువల్ని సాధిస్తాడు. ఆ విలువలతో ఈ నవలకి నిమిత్తం ఉంది.

4. రచయితకి జీవితంపై వున్న జిజ్ఞాసని సమగ్రంగా నిజాయితీతో అనుభవించగలిగేటట్లుగా చిత్రితమైనవా లేదా అన్నదే పాఠకునికి కావలసింది.

5. బెర్ట్రండ్ రాసిన "A Freeman's Worship" అన్న వ్యాసం తననీ, జీవితంపై తనకు గల దృక్పథాన్ని మార్చివేసింది. అయితే తాను ఈనవల రాస్తున్నప్పుడు రసెల్ కానీ ఆ వ్యాసం గానీ తన దృష్టిలో లేదని పాఠకులు గమనించాలి.

ఇవీ బుచ్చిబాబుగారు గ్రంథస్థం చేసిన అభిప్రాయాలు.

ప్రచురణకర్తలు (ఎమెస్కో, 1970) పరిచయంవాక్యంలో "పెద్దలతప్పిదాలు పిన్నల జీవితాలు వికసించకుండా ఎలా పాడుచేసేది సవిస్తరంగా తెలుపుతుంది ఈ నవల" అని వివరించారు.

ఈ నవలకి ఖ్యాతిని ఆర్జించిపెట్టిన విశేషాలు రెండు - ఒకటి శైలి (మనోవైజ్ఞానిక సరణి). రెండోది రచయితకి జీవితంగురించిన సిద్ధాంతీకరణము.

**చివరకు మిగిలేది** రచన 1943లో మొదలుపెట్టారు. ప్రచురణ 1946లో మొదలయి 16 మాసాలపాటు **నవోదయ** పత్రికలో సీరియల్‌గా. 1952లో దేశి కవితామండలి వారు తొలిసారిగా పుస్తకరూపంలో ప్రచురించారు. తిరిగి ఎమెస్కోవారు 1970లో రెండుసంపుటాలుగా ప్రచురించారు. పిలకా గణపతిశాస్త్రి, ఆచంట శారదాదేవివంటి మేధావులు విశేషంగా మెచ్చుకున్న నవల ఇది.

శైలివిషయంలో 40వ దశకంలో తెలుగుదేశంలో ప్రాచుర్యం గడించుకున్న తెలుగు రొమాంటికి కవితాఛాయలు (కృష్ణశాస్త్రి, శివశంకర శాస్త్రివంటి వారివి) కనిపిస్తాయి దయానిధివాదనల్లో. ఇతివృత్తానికొస్తే నేల విడిచి సాము చేస్తున్నట్టు ఉంది నాకు.

ఈ నవలలో ప్రధానాంశాలు - మొదటిది తల్లిదండ్రుల నైతికప్రవర్తన. తన తల్లిగురించిన అపవాదాలమూలాన తన జీవితం నాశనమయిపోయిందని దయానిధి నమ్మకం. రెండోది భిన్నసమాజాల్లో-సర్కారు, రాయలసీమవాసులమధ్య-అభివ్యక్తమయే పరస్పరవిద్వేషాలప్రభావం వ్యక్తులమీద ఉంటుందన్న వాదం. ఒక మనిషి ప్రేమ పొందలేకపోవడానికి కారణం సమాజం, సమాజంలో నిరోధకశక్తులు అన్నది. ఈరెంటికీ అనుబంధంగా ప్రేమ అలౌకికం, మహోన్నతం అన్న ధ్వని వుంది.

దయానిధి అనబడే ఒక తాత్త్వికునికోణంలోనే నడుస్తుంది నవల ఆద్యంతాలా. ఇది అతని భావనాలోకపురికార్డు. అతనికి జీవితంలో తారసపడిన ప్రతివ్యక్తినీ మానసికవిశ్లేషణ చేసుకుంటూ పోతాడు మొదటినుంచీ చివరివరకూ. అతనిజీవితంమీద ఏదో ఒకరకమైన ప్రభావం చూపిన పాత్రలు-అతని తల్లీ, కోమలీ, అమృతం, సుశీలా, తరవాత కొంతవరకూ ఇందిరా, నాగమణీ, కాత్యాయినీ.

దయానిధికి తల్లి అంటే అమితగౌరవం. ఆవిడ విగ్రహం చేయించి ప్రతిష్ఠిస్తాడు. కాని తల్లి దుర్నడతమూలంగా తనకి అపచారం జరిగిందన్నవిషయం మరోపక్క అతన్ని తీవ్రంగా బాధిస్తూంటుంది. రచయిత తొలిపలుకులో ఆ తల్లిఅపచారానికి సంబంధించిన సంఘటనలు అనవసరమని వదిలిపేయడం జరిగింది అన్నారు. ఆ సంఘటనలు అవసరమవునా కాదా అన్న వాదన అటుంచి, జిజ్ఞాసువూ, మనోవైజ్ఞానికుడూ అయిన దయానిధిలో ఆమె దుష్ప్రవర్తనకి వెనక వున్న కారణాలు ఏమిటి అని గానీ, ఆమెని అర్థం చేసుకోవాలన్న తపన గానీ, వాటిని అధిగమించి తాను సముపార్జించిన విజ్ఞానంద్వారా తన జీవితాన్ని చక్కదిద్దుకుందాం అన్న కోరికా, ఆవేదనా గానీ

కనిపించకపోవడం మాత్రం శిల్పందృష్ట్యా లోపమనే నా అభిప్రాయం. లోకంతోపాటే తనూ చెప్పుడుమాటలు విని ఓ నిర్ధారణకి వచ్చేస్తాడు అంతటి జిజ్ఞాసువూను. ఇదొక మనస్తత్త్వం అనుకుని సరిపుచ్చుకోవాలి పాఠకుడు. తను అబద్ధాలాడ్డానికి కారణం స్త్రీయే (సం. 1. పు. 73). తనబతుకు నరకప్రాయం కావడానికి కారణం తల్లి అవినీతి (సం.1 పు. 142). తనజీవితానికి తను బాధ్యుడు కాడు అన్నధోరణి కనిపిస్తుంది కథ పొడుగునా ఈ మనోవిశ్లేషకుడిలో.

అమృతంలో తల్లిపోలికలు చూసుకుంటూ ఆమెకి దగ్గరవుతాడు. ఆమెపెళ్లి అయినతరవాత వారి లైంగికసంబంధంమూలంగా అమృతం, అతనితల్లి -ఇద్దరిమధ్యా సామ్యం మరింతగా ధృవపడింది. అమృతం తనకు తానై వచ్చింది. ఇద్దరూ తాత్కాలికమైన ఉద్రేకానికి లోనై తమకోరిక తీర్చుకున్నారు. దయానిధిని తప్పుపట్టడానికి లేదేమో కానీ వారిద్దరి చర్యమూలంగా అమృతం కూడా అతనితల్లి చేసిన నేరమే చేసినట్టయింది. అందులో అతనికి ప్రత్యక్షంగా పాలుంది. కానీ అతను పడుతున్న దురవస్థ ఆమెకూతురికి కూడా పట్టవచ్చునన్న స్పృహ అతడికి లేదు. అంతేకాక, అతనిధ్యాసంతా అమృతంకూతురు తనదవునా కాదా అన్న మీమాంసమీదే (సం.1. పు.182-83). వాళ్లింటికి వెళ్తాడు కాని ఎదురుపడి అడగలేడు. ఈ ప్రవర్తన అతని నిజాయితీని పాఠకులు శంకించడానికి ఆస్కారం కాగలదు. అమృతానికి ఆరోనెల అని తెలిసినప్పుడు ఏనెలో ఎలా తెలుస్తుంది (సం. 1. పు.106) అని డాక్టరయిన దయానిధి సందేహం వెలిబుచ్చడం నవ్వు తెప్పించింది నాకు.

తల్లి తరవాత అతన్ని విశేషంగా ఆకట్టుకున్నది కోమలి. దయానిధిదృష్టిలో కోమలి స్త్రీ కాదు (సం.1 పు.139). పచ్చగడ్డీ, ఆకాశంలాగ ప్రకృతిలో భాగం. అంచేత ఆమె రాత్రి నూతికాడ దీపం పెడతాను రా అంటే ఆమాట పుచ్చుకు వెళ్తాడు కానీ ఆమెమీద చెయ్యయినా వెయ్యకుండా వెనుదిరిగి పోతాడు. కోమలి అతనిదృష్టిలో తాకితే రేకులు

రాలిపోయే పువ్వు. తాను ఆ పువ్వుని అపవిత్రం చెయ్యలేడు.  ఆమెకి కావలిసిన రొక్కం మాత్రం తలగడకింద పెట్టి వెళ్లిపోతాడు. తాను ఆమెని వాంఛించాడు కాని ప్రేమించలేదు. వాంఛ దైహికం, ప్రేమ మానసికం. వాంఛలో స్వార్థం వుంది. ప్రేమలో త్యాగం వుంది. కోమలి తనని ప్రేమిస్తోంది - ఇవి దయానిధిమనోవిశ్లేషణలో కొన్ని ఆలోచనలు. మొత్తం నవల చదవడం అయినతరవాత కోమలి అమాయకురాలని నమ్మడం కష్టం. నిజానికి ఆమె కార్యశీలి అనిపించింది నాకు. అది జాణతనం. తనకు గల వెసులుబాటు బేరీజు వేసుకుని జీవితాన్ని దిద్దుకున్న లౌక్యం ఆమెది.

కోమలి పచ్చగడ్డీ, పువ్వుల్లాటిది అంటాడు. ఇది భావుకతతో కూడిన ఆలోచన. కాని ఆ భావనలో భౌతికమైన ఒంపుసొంపులు కూడా చేర్చడంతో దయానిధి జిజ్ఞాస కేవలం వ్యక్తిత్వానికి సంబంధించినది మాత్రమే కాదనిపిస్తుంది. కేవలం రచయిత, పాత్ర చెప్పేరు కనక అనుకోవాలేమో. ఒక్క కోమలివిషయంలోనే కాదు, ఎక్కడ ఏ స్త్రీప్రసక్తి వచ్చినా (తల్లి తప్ప) అతని మనోవైజ్ఞానికవిశ్లేషణ ఒకచోటా, శారీరకమైన "కళ్లు" మరొకచోటా వుంటాయి. అతను చేసిన అంగాంగవర్ణనలూ, వెలిబుచ్చే అభిప్రాయాలద్వారా మనకి ఆ పాత్రలగురించి కంటే దయానిధి మనస్తత్త్వం మాత్రమే ఎక్కువ తెలుస్తుంది. అదే ప్రస్ఫుటం చేయటం రచయితఅభిప్రాయం అయితే ఆయన కృతకృత్యులయేరనే చెప్పాలి.

సుశీల అతనికి మరదలు వరసే కాని ఆమెతండ్రి ఆమెని దయానిధికిచ్చి పెళ్లి చెయ్యడానికి అంగీకరించడు. కారణం దయానిధితల్లి అవినీతి. తండ్రి మాటప్రకారం ఇందిరమెళ్లో తాళి కడతాడు. ఇది దయానిధి వ్యక్తిత్వంలో గొప్ప లోపం. అతని మనోవిశ్లేషణ అతనికి సదసద్వివేచనా, కార్యశీలతా నేర్పలేదు. ఏటివొడ్డున కూచుని ఈతమీద ఉపన్యాసాలిచ్చినట్టు ఎదటివారి ప్రవర్తనలమీదా వ్యాఖ్యానాలు చేసుకుంటూ పోవడమే అతనికి వచ్చినవిద్య.

తనచుట్టూ వున్న అమ్మాయిలందరూ తనకోసం తపించిపోతున్నారనీ, తనపై సదా ఉచ్చులు పన్నుతున్నారనీ మురిసిపోతూ రోజులు గడుపుకుంటాడే తప్ప తననమ్మకాలని పరీక్షకి పెట్టి వాటిలో సత్యమెంతో తెలుసుకోవాలనే సత్యాన్వేషణ కనిపించదు ఈ తాత్వికుడిలో. అతని అంచనా ప్రకారం, కోమలి ప్రకృతిలో భాగం. సుశీల బస్తీలోని నవనాగరీకతలో భాగం. అమృతం తల్లిలాగే నేలబారు మనిషి, వంటింటి కుందేలు. వీళ్లందరూ తనని వేటాడుతూ తనకి శాంతి లేకుండా చేస్తున్నారు. అసలు సృష్టిలోనే వుందది. ఆడవాళ్లు మగవాళ్లని వేటాడి వినోదిస్తారు (సం.1. పు. 28).

సుశీలా అమృతం పెళ్లి చేసుకుని కాపురాలు చేసుకున్నారు. కోమలి తనకి దయానిధివల్ల సుఖంలేదని తెలుసుకుని, ఒక జమీందారుతో వెళ్లిపోయి, అతనిదగ్గర చావుదెబ్బలు పడలేక మళ్లీ దయానిధి దగ్గరికి వచ్చేసింది. కారణం దయానిధి అనుకున్నట్టు ఇది స్వార్థరహితమైన ప్రేమేనా అంటే సందేహమే. నాకు మటుకు దయానిధి ఏం చెయ్యలేడు కనక అతనివల్ల తనకి బాధలుండవు కనక ఆ నిశ్చయానికి వచ్చింది అనిపించింది. అది అమాయకత్వం కావచ్చు, అమాయకురాలిలా నటించి పబ్బం గడుపుకోడం కావచ్చు కాని దయానిధికి మాత్రం ఈ ధోరణి ఆలోచనలే రాకపోవడం ఆశ్చర్యం.

ఇందిరతో దయానిధిపెళ్ళి అయినతరవాత రాజకీయాలు కారణంగా మామగారు కార్యం చెయ్యనివ్వరు. ఇందిర కాపురానికి రాదు. అప్పుడు కూడా దయానిధి పూనుకుని క్రియాశీలిగా చేసిన ఘనకార్యం ఏమీ లేదు. చదువుకున్నవాడు, బాధ్యతలనెరిగినవాడుగా మనకి అభివ్యక్తం కాడు ఇక్కడ. ఇందిరే తెగించి నన్ను మీయింటికి తీసుకుపో అని అడిగినప్పుడు కూడా ఉదాసీనుడుగానే వుండిపోతాడు.

చదువు ముగించుకుని, రాయలసీమలో ప్రాక్టీసు మొదలుపెడతాడు కాని. అక్కడ కూడా తల్లిమీదున్న అపవాదులమూలంగానూ, అతనికి కూడా ఏవో ఇతర వ్యసనాలు

ఉన్నాయన్న అపవాదుల మూలంగానూ మనశ్శాంతి లేదు. వైద్యుడుగా పేరు తెచ్చుకున్నట్టు కనిపించదు. అయాచితంగా దొరికిన వజ్రం అమ్ముకుని గొప్పవాడవుతాడు.

బుచ్చిబాబుగారే శలవిచ్చినట్టు, మతం, మూఢవిశ్వాసాలమాట వదిలేద్దాం. జీవితం అంటే కష్టం, సుఖం, మంచీ, చెడూ, బాధలూ, కన్నీళ్లూ, అనేక అనుభవాలమిశ్రమం కదా. ఆ దృష్టితో చూస్తే జీవితాన్ని నిజంగా అనుభవించినవాళ్లు కోమలీ, సుశీలా, అమృతమే. ప్రతి ఒక్కరూ తమ జీవితాల్ని వారికి తెలిసినపద్ధతిలో దిద్దుకుని జీవించారు.

దయానిధి వెలిబుచ్చే అభిప్రాయాలు చూస్తే పాఠకులసానుభూతికోసం ఆరాటపడుతున్నవాడిలా కనిపిస్తాడు. అతని మనోవిశ్లేషణంతా తనలో లోపాలకీ కారణం ఎవరా అని వెతకడంతోనూ, ఆ లోపాలని ఎవరినెత్తిన రుద్దుదామా అన్న తాపత్రయంతోనూ సరిపోతుంది.  అనేక ప్రముఖుల రచనలు చదివి అతను సముపార్జించిన విద్య అంతా ఈ బలిపశువులని కనిపెట్టడానికే పనికొచ్చింది. చాదస్తంగా ఎదటివారి ప్రతిచర్యా, ప్రతివాక్యం సాగదీసి సిద్ధాంతీకరించడం, వీలయినంతవరకూ పెద్దలసూక్తులు ఉదహరించడం మాత్రమే మనకి కనిపిస్తుంది ఈనవలలో. ఇలాటివారిని నిత్యజీవితంలో అయితే బోళా మనుషులంటాం. నవలల్లో అసమర్థనాయకులు.

నావి అని చెప్పుకోతగ్గ అభిప్రాయాలు లేకపోతే మరొకరి ప్రవచనాలు ఉదహరించుకుంటూ పోతారు కొందరు. దయానిధి ఆకోవకి చెందినవాడు, పిరికివాడు. రా.వి. .శాస్త్రిగారి సుబ్బయ్యలా (అల్పజీవి), కుటుంబరావుగారి సీతప్పలా (భయం?). ఎటొచ్చి సుబ్బయ్య, సీతప్పల భయం నిత్యజీవితంలో వాళ్లప్రవర్తనలో మనకి దృగ్గోచరమవుతుంది. కాని దయానిధి సైద్ధాంతికుడు. అతని బతుకు కేవలం తనదైన

ఒక కాల్పనిక జగత్తులో ఓలలాడుతూ వుంటుంది ఎల్లవేళలా. మనకి విదితమయేది అతని ఆలోచనలు మాత్రమే. అతని భౌతికజీవితంలో క్రియ నాస్తి. తిరణాలలో జనసందోహంలో జనంతోపాటు కొట్టుకుపోయే సగటుమనిషి అతను.

నవలంతా మనోవిశ్లేషణ-ఒక తాత్త్వికచింతనగా సాగినందుసేమో సూక్తిముక్తావళిలాగానో సుభాషితరత్నావళిలాగానో అనిపించింది నాకు. నిజంగా జరిగినకథ కంటే దాన్నిగురించిన అతని ఆలోచనలూ, సిద్ధాంతీకరణమూ పుష్కలంగా వున్నాయి. ఈవిషయం బుచ్చిబాబు గారు కూడా తొలిపలుకులో ప్రస్తావించారు అది ప్రతివారికీ వుండే బలహీనత లేదా లక్షణం అని.

జీవితం పుట్టినక్షణంనుండీ ఆమరణాంతం సాగే ప్రయాణం. మరణంతోనే జీవితానికి ముగింపు. ఈ నవల "జీవితానికి అర్థంలేదు చివరకి మిగిలేది ఏమీ లేద"న్న దయానిధిసిద్ధాంతంతో ముగుస్తుందే తప్ప అతని మరణంతో కాదు. అతను ఇంకా జీవించి వుండగానే ఇంక ఏమీ లేదు అనుకోడం నిరాశావాదం. నిజానికి అతను జీవితంలో అనుభవించిన సుఖసంతోషాలు ఏమీ లేవు.

ఇక్కడ లత రాసిన మరొక నవల, **మిగిలిందేమిటి**, గురించి బుచ్చిబాబు వెలిబుచ్చిన అభిప్రాయాలు సూక్ష్మంగా ప్రస్తావించడం అవసరం. **చివరకుమిగిలేది** వెలువడిన రెండు దశాబ్దాలతరవాత **మిగిలిందేమిటి** నవల వెలువడింది. ఆ నవలపై వ్యాఖ్యానిస్తూ బుచ్చిబాబు లతకి రాసిన వుత్తరంలో అభిప్రాయాలు చూడండి.

1. కొన్ని భాగాలు స్కిప్ చేస్తూ పూర్తి చేసారు (లత). తనకు (బుచ్చిబాబుకి) ఉత్సాహమూ, ఆశ్చర్యమూ, కొంత శారీరకమైన sensuous అనుభూతి కలగడమూ జరిగాయి.

2. నవలలో ఆయనకి అభ్యంతరకరంగా తోచినవి-ప్రధానపాత్ర, వేశ్యవనిత అయిన విద్య తనతల్లి కులస్త్రీకన్న పవిత్రమూర్తి అనడం అనవసరం అని. కథకి ఆమె పవిత్రత ముఖ్యం కాదు, ఆమె (విద్య) అట్లాంటి ఆమెకి పుట్టి, ఒక నైతికదృక్పథం అలవర్చుకున్నది ముఖ్యం అనీ. అంచేత ఆవాక్యం falsetto note అనీ అన్నారు. ఆదృష్టితో చూస్తే దయానిధి అబ్సెషన్-తనతల్లిని గురించిన అపవాదులు-మరింత పేలవంగా తోస్తాయి.

లత నవల వచ్చింది ఇరవైయేళ్ల తరవాత కనక బుచ్చిబాబు తన అభిప్రాయాలు మార్చుకున్నారనుకోవాలా? లేక దయానిధి ఒక పాత్ర, విద్య మరొక పాత్ర అని సరిపెట్టుకోవాలా?

3. లత నవలలో ప్రేమగురించి కూడా సుదీర్ఘంగా చర్చించారు కాని నాకు అది అర్థం కాలేదు. అంచేత ఆ ప్రేమజోలికి పోను కాని అదే పేరాలో మొత్తంనవల ఉత్తమపురుషలో కాక మధ్యమ పురుషలో రాస్తే హుందాతనం, సమన్వయం చేకూరేదన్న ఆయనఅభిప్రాయం మాత్రం నాకు కాస్త అయోమయంగా అనిపించింది. (మధ్యమపురుషలో రాయడం ఎలా సాధ్యం నాటకం అయితే తప్ప?). ‘‘హాస్పిటల్‌లో విద్య చేసిన ‘‘దురంతం’’ (రాజాతో) మరొకరు చెప్పివుంటే, పదును తగ్గి వుండేది. సభ్యత హెచ్చి వుండేది. జీవితంలోలాగే సాహిత్యంలో కాస్తంత అసభ్యత, అశ్లీలత అవసరమనుకునేవారిలో నేనొకణ్ణి. కాని మనసంఘం అంత దూరం వెళ్లడానికి చాలాకాలం పడుతుంది’’ అంటారు బుచ్చిబాబు గారు. (ఆంజనేయశర్మ. సాహితీలత. పు. 86). నిజానికి విద్యా, రాజాల ‘‘దురంతం’’కి (బుచ్చిబాబు భాషలో) దయానిధీ, అమృతంల అనుభవానికి(సం.2 పు. 90) మధ్య గల తేడా ఏమిటి? రెండు సంఘటనలలోనూ ఒకే వస్తువు. ఒక స్త్రీ, ఒక పురుషుడూ, వారి నిషిద్ధ సమాగమం. ఇద్దరు రచయితలూ ఒకేరకమైన భాష వాడారు. మరి బుచ్చిబాబు ఎందుకు పని

గట్టుకుని ఆ సందర్భం ఎత్తి చూపినట్టు? బహుశా ఇలాటి సందర్భాలలోనేమో ఆడరచనలూ మగరచనలూ అంటూ కథలకి లింగబేధం కల్పిస్తున్నారన్న వాదనకి బలం చేకూరేది.

**చివరకుమిగిలేది** ప్రధమపురుషలో సాగినా, ప్రధానపాత్ర ఆంతరంగిక చిత్రణ కావడంచేత ఉత్తమపురుషలో సాగినట్టే వుంటుంది పాఠకుడికి. ఉత్తమపురుషలో కథ చెప్పినప్పుడు కొన్ని వసతులుండే మాట నిజమే. కాని ఈ రెండు నవలల్లో వస్తువు పరిశీలించినప్పుడు, రచయితలు ఆ వస్తువుని చిత్రించిన తీరు గమనించినప్పుడు, ఈ వ్యాకరణచర్చ అనవసరం అనిపించింది నేను.

సూక్ష్మంగా చెప్పాలంటే బుచ్చిబాబు రచయితగా **చివరకు మిగిలేదిలో** సాధించినదానికీ, పాఠకుడిగా ఆయన లతగారికి రాసిన ఉత్తరంలో వెలిబుచ్చిన అభిప్రాయాలకీ సమన్వయం కుదరడంలేదు.

సాహిత్యప్రయోజనంలో ముఖ్యభాగం పాఠకుని ఆలోచింపచేయడం అని బుచ్చిబాబు గారే ఆనవలకి ముందుమాటలో రాసేరు. నవల చదవడం ముగించిన తరవాత ఈ నవలలో సందేశం ఏమిటి అని చాలా ఆలోచించవలసివచ్చింది నేను. మగవారి మనోభావాలు కేవలం ఇంత సంకుచితంగా తమపరిధిలోనే ముడుచుకుపోయి వుంటాయనా? మగవారిలో దయానిధిలా ఆలోచించేవారు వుండడానికి కనీసం కొంత అవకాశం వుందనా? ఇలా జీవితం విశ్లేషిస్తూ కూచుంటే నిజంగా జీవితం అనుభవించడం గానీ, జీవితంలో సాధించేది గానీ ఏమీ వుండదనా?

ఈ నవలకి ప్రయోగాత్మకమయిన ఒక సాహితీప్రక్రియగా తెలుగుసాహిత్యంలో సుస్థిరమయిన స్థానం వుండొచ్చు. కాని ప్రయోగం దాని ఫలితం తెలుసుకునేవరకే. ఆ తరవాత మళ్లీ మళ్లీ అదే ప్రయోగం చెయ్యం. అలా కాక మనసుకు హత్తుకోగల రచన,

మనసుని రంజింపజేయగల రచన అయితే మళ్లీ మళ్లీ చదువుతాం. ఈ నవల నేను తొలిసారి యాభై ఏళ్లకిందట చదివేను, అప్పట్లో అందరూ చదువుతున్నారనో, కాకపోతే ఎవరో చదవమన్నారనో. ఇప్పుడు మళ్లీ ఈ వ్యాసంకోసం చదివేను. మళ్లీ చదువుతాను అనుకోను.

000

**ఉపయుక్త గ్రంథాలు.**


ఆంజనేయశర్మ, ఘట్టి. సాహితీలత. శ్రీవాణీ ప్రచురణాలయం, 1962.

బుచ్చిబాబు. చివరకు మిగిలేది. ఎమెస్కో బుక్స్. 2 సం. 1970.

--- నన్ను మార్చి పుస్తకం. 1953. పునర్ముద్రణ..

లత. అంతరంగచిత్రం. వంశీ ప్రచురణలు, 1963.

-- మిగిలిందేమిటి. జయంతి పబ్లికేషన్స్, 1971.

# 12. మద్దిపట్ల సూరిగారి స్వయంసిద్ధ

మణిలాల్ బెనర్జీ (బందోపాధ్యాయ బెనర్జీ) రచించిన స్వయంసిద్ధ నవలకి మద్దిపట్ల సూరిగారి (1920-1995) అనువాదం ఇది. తెలుగుదేశంలో బెంగాలీ నవలలంటే చటుక్కున గుర్తుకొచ్చే బెంగాలీరచయితలు శరత్, టాగోర్. అసలు తెలుగుదేశంలో శరత్ ప్రాచుర్యం చూస్తే, శరత్ తెలుగువాడే అన్నా తప్పు లేదు. కానీ మనం మరొకటి మర్చిపోకూడదు. బెంగాలీనవలలు అంతగా తెలుగుపాఠకులను ఆకర్షించి ఆకట్టుకోడానికి ప్రధానకారణం ఆ అనువాదకుల ప్రతిభే.

ఇది అనువాదరచనలమీద నా మొదటి సమీక్ష. అంచేత అనువాదాలగురించి స్థూలంగా ఒక మాట ముందు చెప్తాను.

సాధారణంగా నవలలో పాఠకులని ఇతోధికంగా ఆకర్షించేవి ఇతివృత్తం, పాత్రచిత్రణ, పరిష్కారం లేక ముగింపు. అనువాదాలగురించి ఆలోచిస్తున్నప్పుడు, అనువాదకుడు మూలకథ యథాతథంగా ఉంచుతాడు కనక, ఉంచాలి కనక, ఇతివృత్తంవిషయంలో అనువాదకుడు చేయగలిగిందేమీ లేదు. ఆయన తనప్రతిభ చూపించగలిగింది ఏ భాషలోకి అనువదిస్తున్నాడో ఆ భాషలో తనకు గల సామర్థ్యము ఉపయోగించుకుని అనువాదాన్ని పరిపుష్టం చేయడం.

విద్వాన్ విశ్వం, మద్దిపట్ల సూరి, సూరంపూడి సీతారాం – ఈ పేర్లు తలుచుకుంటే నాకు ఇప్పటికీ, అంటే 60 ఏళ్లతరవాత, ఆనాటి వారపత్రికలపేజీలు నాకళ్లముందు మెదులుతాయి. అది వారి అనువాదప్రౌఢిమకి తార్కాణం. వారికథనం అచ్చమైన తెలుగుకథ చదువుతున్నంత హృద్యంగమంగా ఉండడం.

మద్దిపట్ల సూరిగారు అటువంటి ప్రజ్ఞ సాధించేరు ఈ నవలలో విజయవంతంగా. **స్వయంసిద్ధ** చదువుతుంటే ఇది బెంగాలీనవల అని మనకి తెలియజెప్పే సందర్భాలు కొన్ని ఉన్నాయి. వాటిగురించి తరవాత చెప్తాను. కానీ ప్రధానంగా ఆ నవలలో భాష మనం అనుదినం చదివే పుస్తకాల్లో చూస్తున్న భాషే.

స్థూలంగా కథ – సామాన్య గృహస్తు, ఆయుర్వేదవైద్యుడు అయిన కరాలీ ఛటర్జీ కూతురు చండీ. ఆ అమ్మాయికి ఐదేళ్ళ వయసప్పుడు మాతామహుడు చూసి ముచ్చటపడి, తనతో పంజాబ్ తీసుకెళ్తాడు తండ్రిఅనుమతితో. ఆయన వ్యాయామశిక్షకుడు, బహుభాషాకోవిదుడు, సకల శాస్త్రాలు చదివినవాడు. ఆయన తనవిశ్వాసాలననుసరించి చండికి ఆరోగ్యశిక్షణ, విద్యాశిక్షణతోపాటు ఆత్మగౌరవాన్ని కాపాడుకోడం కూడా నేర్పి పరిపూర్ణయువతిగా తీరిచి దిద్దుతాడు. ఆమె యౌవనదశ ప్రవేశించేవేళకి ఆరోగ్యం, అందంతోపాటు అనేక విద్యలలో అనవద్యమైన మేధ కూడా సంపాదించుకుని, తాతగారు దివంగతులయేక తిరిగి తండ్రిఇంటికి వస్తుంది. అప్పటికి ఆమెవయసు పన్నెండు.

చండి అపూర్వగుణగణాలు విని చండప్రచండుడైన బాశులి జమీందారు హరినారాయణబాబు ఆమెగురించి విని, శ్యామాపురానికి తానే స్వయంగా వచ్చి ఆమెని కోడలిగా చేసుకోడానికి నిశ్చయించుకోడం కథలో ప్రధానఘట్టం. కథలో ఆయువుపట్టు అయినఘట్టం - చండి శోభనంరాత్రి పెళ్లికొడుకు గోవిందుడు జడుడని గ్రహించి, అచంచలమైన ఆత్మవిశ్వాసంతో అతనిని విద్యావంతుడిగా చేయడానికి పూనుకోడం. అక్కడినుండి కథలో ఉత్కంఠ పుంజుకుని కథనానికి మంచి ఊపునిస్తుంది. తనధ్యేయం సాధించేలోపున అత్తవారింట చండి  సవితిఅత్తగారి ఉదాసీనత, సవితిమరిది ధూర్తత్వం తట్టుకు నిలబడి, తన అస్తిత్వాన్ని ఋజువు చేసుకున్నతీరు ప్రశంసనీయం. అవసరమైతే మామగారిని సైతం ప్రశ్నించడానికి

వెనుదీయని ఆత్మస్థైర్యం. మరిది చేసిన ఫిర్యాదులు నిరాధారమైనవని కమిషనరు, కలెక్టరులఎదుట నిరూపించకోవలసివచ్చినప్పుడు కూడా అద్భుతమైన సంయమనం చూపుతుంది. కమిషనరు గోవిందుని మానసికస్థితినిగురించి ప్రశ్నిస్తే, అతనిలో "ఒక ప్రత్యేక లక్షణమున్నట్టు గ్రహించి నేను శాయశక్తులా ప్రయత్నించి వారిని ఒక ఆదర్శపురుషునిగా చేయవచ్చుననే ఉద్దేశంతో వివాహం చేసుకున్నాను," అంటూ ఇచ్చిన జవాబు రచయిత కథనచాతుర్యానికి మచ్చుతునక. నవల ప్రారంభంలో గోవిందుని బుద్ధి వికసించలేదని గ్రహించినప్పుడు చండి ఈవిషయం వాచ్యం చేయలేదు. నవల పొడుగునా ఎక్కడా ఆమె "నేనిలా చేస్తాను, ఈ సమస్య ఇలా పరిష్కరించుకుంటాను," అని చెప్పడం ఆమె ప్రవృత్తిలో చూడం. అవి పాఠకుడు కథలో సంఘటనలద్వారా తెలుసుకోవలసిందే. మరొకలా చెప్పాలంటే, అనవద్యమైన చిత్తస్థైర్యంతో, స్వకీయమైన సామర్థ్యంమీద ఆధారపడి సందర్భానుసారం నిర్ణయాలు చేసుకుని కార్యం సాధించుకోడమే కార్యశీలురపద్ధతి కానీ వాగాడంబరంతో కాదు. చండి అది ఎంత సమర్ధవంతంగా నిర్వహించిందంటే, ఆమెనే ఆశ్చర్యపరుస్తాడు గోవిందుడు వికసించిన మేధతో.

అది ఎప్పుడు జరిగిందంటే, నవల చివరిఘట్టంలో హరినారాయణుడు అనారోగ్యంతో మంచంలో ఉండి, కోడలిని రమ్మని కబురు పంపినప్పుడు. చండి గోవిందుని కూడా రమ్మంటుంది అతడు సాధించిన విద్యాభివృద్ధి మామగారికి తెలుస్తుందన్న ఊహతో. గోవిందుడు "అస్వస్థతగా ఉన్నప్పుడు దుఃఖవార్తలలాగే సంతోషకరమైన వార్తవల్ల కూడా చెఱుపు జరగవచ్చునని" తానెక్కడో చదివేననీ, అంచేత ఆ సమయంలో ఆ విషయం తండ్రికి తెలియజేయడం మంచిది కాదనీ అంటాడు. జడుడుగా ఉన్న పూర్వపరిస్థితినుండి అర్థవంతమైన ఆలోచనలు చేయగల పరిపూర్ణవ్యక్తిగా అతను ఎదిగినట్టు చూపడం జరిగింది అక్కడ.

చండి తరవాత పరిపూర్ణంగా చిత్రింపబడిన పాత్ర జమీందారు హరినారాయణబాబు. ఈ పాత్ర కూడా అడుగడునా పాఠకుని సందేహాలలో ముంచెత్తుతుంది. ఉదాహరణకి ప్రధానం వేళ, "నేను మీఅమ్మాయిని ఎలా పరీక్షించి తెలుసుకున్నానో, అలాగే మీరు కూడా మీ జమీందారుబిడ్డని చూచుకోవటం మంచిదనుకుంటాను," అంటూ కరాలి ఛటర్జీకి గోవిందునిగురించి తెలుసుకోడానికి అవకాశం ఇస్తాడు. కరాలీ ఛటర్జీ అవసరంలేదనగానే ఊరుకుంటాడు కానీ గోవిందుని వాస్తవస్థితి చెప్పడు. హరినారాయణబాబు పూర్వకథలో అలా ఊరుకోడానికి కారణం కనిపిస్తుంది. అలాగే స్వేచ్ఛావిహారీ, అభిమానవతి అయిన చండి గోవిందునిగురించి మొదట్లోనే తెలిసి ఉంటే ఈ వివాహానికి అంగీకరించి ఉండేదా? ఈప్రశ్నకి సమాధానం కూడా పాఠకులఊహకే వదిలివేయబడింది. చివరలో తనమీద నేరారోపణలు విచారణ చేయడానికి వచ్చినప్పుడు ఈ ప్రస్తావన తీసుకురాలేదు. ఆయన గోవిందునితల్లికి ఇచ్చిన వాగ్దానం ఎందుకు నిలబెట్టుకోలేదని మాత్రమే ఆయనని ప్రశ్నిస్తుంది.

మరొక మనోజ్ఞమైన మలుపు ప్రధానంసమయంలో చండికి కాబోయే మామగారు బంగారు కొరడా ఇచ్చి, తమఇంట "ఒక అలివిమాలిన గాడిద ఉన్నాడు. వాడిని నువ్వు అదుపులోకి తీసుకురావాలి," అని చెప్పినతరవాత, చండి దానిని వినియోగించుకున్న విధానం. మామగారికోరికమేరకు గోవిందుని ఆదర్శపురుషుడిని చేస్తుంది కొరడా ఉపయోగించకుండానే. ఆ కొరడా ఉపయోగించలేదు కానీ ఎవరివిషయంలో ఉచితం, "గాడిద" పదం ఎవరికి అన్వయించడం తగును అన్న విషయాలలో చండి చతురత బహునైపుణ్యంతో చిత్రించడం జరిగింది. ఇవి చాలనుకుంటాను మద్దిపట్ల సూరిగారు ఈ నవలని అనువాదానికి ఎందుకు ఎన్నుకున్నారో చెప్పడానికి.

అనువాదం విషయం తీసుకుంటే, సూరిగారు చక్కని తెలుగు నుడికారాన్ని వాడుకున్నారని చెప్పకతప్పదు. "గోవిందుడు ఒట్టిదద్దమ్మలా, వెర్రిబాగులవాడి"లా

ఉంటాడు. “బెడదలొచ్చి పడ్డాయి”, “త్రైతక్కలాడలేదు,” లాటి వాక్యనిర్మాణం కనిపిస్తుంది.

శ్రీ ఏల్చూరి మురళీధరరావుగారు మద్దిపట్ల సూరిగారి శైలిగురించి, “ఏ కోశాన చూసినా నిరుష్టమైన భాష, రచనమంతా వెల్లివిరిసే సరసమైన ఆత్మీయత, బెంగాలీ భాషనుంచి తెలుగు చేసేటప్పుడు బెంగాలీ సంస్కృతం వొకడలో గాక తెలుగుతనం చెక్కుచెదరని శైలి, సరళభాషలో వ్రాస్తున్నా మహాపండితుని రచన ఇది తెలిసివచ్చే రచన సూరిగారి ప్రచురణలకు DNA ముద్రలు :)” అని వ్యాఖ్యానించేరు.

ఈ నవలలో ఆనాటి బెంగాలీనవలలకి వచ్చిన అనువాదాలలో సర్వసాధారణమైన కొన్ని పదాలు లేకపోలేదు. అవగుంఠనం, పాదధూళి స్వీకరించడం, అశ్రురుద్ధ నేత్రాలు, పాపిట సింధూరంవంటివి. ఇవి బెంగాలీనవలలకి తెలుగు అనువాదాల్లో మాత్రమే కనిపిస్తున్నాయంటే అవి సంస్కృతిపరమైన విశేషంగానే భావించాలి. అలాగే, నాకు ప్రత్యేకంగా కనిపించిన మరొక అంశం కుటుంబంలో ఒకరిమీద మరొకరు ఫిర్యాదు చేసినప్పుడు, జమీందారు హరినారాయణబాబు ఆ ఫిర్యాదులను న్యాయస్థానంలో విచారించినట్టు విచారించడం. అక్కడ వాడిన భాష కూడా న్యాయస్థానంలో ప్రయోగించేభాష కావడం–బహుశా బెంగాలీకుటుంబాల్లో కుటుంబసమస్యలు అలా పరిష్కరించుకుంటారేమో నాకు తెలీదు. లేదా అది జమీందారీకుటుంబాల్లో ఆనవాయితీ కూడా కావచ్చు.

నేను వెనకటి దశాబ్దాలలో వచ్చిన కథలు చదివినప్పుడు అది ఈనాటి సమాజానికి ఎలా వర్తిస్తుంది, వర్తింపజేసుకోడానికి అనువుగా ఉందా అని కూడా చూస్తాను. ఏదో ఒక విధమైన పాఠం మనకి ఇవ్వలేని కథలు నాకు అంతగా రుచించవు. మరి 1946లో అనువదించింది అంటే ఇది ఇంకా ముందే రాసి ఉండాలి. మరి ఈ నవల ఈనాటి సమాజానికి ఎలా వర్తిస్తుంది? మరి ఈనాటి స్త్రీలు చండిలా వ్యాయామం చేసి

దేహదారుఢ్యం, మనోదారుఢ్యం వృద్ధి చేసుకోగల అవకాశాలు ఏమైనా ఉన్నాయా అంటే కనీసం కొందరివిషయంలో జరుగుతోందనే అనుకుంటున్నాను. కాలేజీల్లనూ, స్కూళ్ళలోనూ మాత్రం కాదు. ఇది ఇంట్లోనూ సమాజంలోనూ రావలసిన మార్పు. స్త్రీలని స్వమేధమీద ఆధారపడగల, అలా తీరిచి దిద్దగల సమాజం రావాలి. ప్రతివారూ చండి అంత మేధావులు కాకపోవచ్చు కానీ తగిన వనరులు సమకూర్చి గోవిందునివలే ఒక మంచిమనిషిగా చేయడానికి ప్రయత్నించవచ్చు.

చివరిమాటగా, అనువాదాలగురించే మరొకమాట కూడా చెప్పాలి. ఎందుకంటే, తెలుగుకథలు ఇంగ్లీషులోకి అనువదించినప్పుడల్లా, ఎవరో ఒకరు అనడం వింటూనే ఉన్నాను—జానుతెలుగు సొగసులు అనువాదంలో రాగల అవకాసం లేదని. ఇలా వ్యాఖ్యానించే తెలుగువారికి నా ప్రశ్న-మీరు తెలుగులోకి అనువదించిన బెంగాలీనవలో రష్యన్‌నవలో చదివినప్పుడు ఆ మూలభాషలో ఉన్న సొగసులు ఈ అనువాదంలోకి వచ్చేయా లేదా అని చూసుకుంటున్నారా? నిజానికి మూలభాషలో ఏసొగసులున్నాయో లేవో మీకు ఎలా తెలుస్తుంది? అంటే నేననడం, మీచేతిలో ఉన్న నవల మీదృష్టినాకట్టుకోగలిగితే చదువుతారు, లేకపోతే లేదు అని. ఆ క్షణంలో అనువాదంలో భాషకే ప్రాముఖ్యం. తెలుగుభాషలో ఉన్న స్వారస్యం అలాటిది అనుకోవచ్చు. లేదా ఎవరి మాతృభాష వారికి అలాగే ఉంటుంది అనుకోవచ్చు.

అనువాదాలగురించి ఇంతగా చెప్పడం మద్దిపట్ల సూరిగారు చేసిన ఈ అనువాదం స్వీయరచన అంత శక్తిమంతంగానూ ఉందని చెప్పడానికే. ఎందుకంటే, మూలగ్రంథలో కథకి కావలసిన కొన్ని హంగులు ఉంటాయి. అనువాదకుడిపని ఆమూలకథని తీసుకుని అనువాదించినభాషలో అంత సౌష్టవంగానూ ఉండేలా చూసుకోడం. అది మద్దిపట్ల సూరిగారు నిర్ద్వంద్వంగా సాధించి, మనకొక మంచి నవల అందించేరు. అందుకు వారికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి.

# 13. మునిపల్లె రాజుగారికథల్లో ప్రయోగశీలత



మునిపల్లె రాజు గారు “కథాకథనసంవిధానంలో ప్రయోగాలు చేసేర”ని ప్రసిద్ధ కథకులు శ్రీపతిగారు అని వ్యాఖ్యానించేరు ఒక ఇంటర్వ్యూలో. “కథకులకథకుడు” అని ప్రశంసించేరు అక్కిరాజు రామాపతిరావు గారు. “కథాఋషి” అంటూ మెచ్చుకున్నారు మధురాంతకం రాజారాంగారు.

70 ఏళ్ళకి పైగా తెలుగుకథ ఎలా రాయాలి అన్న ప్రశ్నతో కుస్తీలయేక, ఇటీవల కథలు ఎలా రాయకూడదన్న చర్చ ప్రారంభమయింది.

గత ఆరునెలలుగా మునిపల్లె రాజుగారికథలు నేను అక్షరం అక్షరం, పదం పదం, వాక్యం వాక్యం చూసుకుంటూ(!) చదివినందున పై రెండు ప్రశ్నలగురించి తీవ్రంగా ఆలోచించేను. కథలు ఇలా ఉంటేనే ప్రచురిస్తాం అని (మంకు?)పట్టు పడుతున్న సంపాదకులూ, ప్రచురణకర్తలూ ఓపక్కా, రచయితలు నూతన ప్రయోగాలు చెయ్యడం లేదు, మంచికథలు రావడంలేదంటూ పాఠకులూ, సంపాదకులూ మరోపక్కా మహోద్ధృతంగా ఆక్రోశిస్తున్న నేపథ్యంలో రాజుగారికథల్లో ఈ ప్రశ్నలకీ సమాధానంగా నేను గమనించిన “ప్రయోగాలు”గా గుర్తించదగ్గ అంశాలు ప్రస్తావించే ప్రయత్నం ఇది.

“కథని అనుసరించు, కథకుడిని కాదు,” అని రాజుగారే శలవిచ్చేరు కనక ఆ కోణంలోనుండే ఈ వ్యాసం. అంటే ఇది కేవలం కథలమీద చర్చే కానీ రాజుగారి ప్రతిభాపాటవాలవిమర్శ కాదని గ్రహించాలి.

ఈ సమాచారం దృష్టిలో పెట్టుకుని, వస్తువులోనూ, శైలిలోనూ, శిల్పంలోనూ రాజుగారు చేసిన ప్రయోగాలు, లేదా, ఈనాడు  మన పండితులూ, విమర్శకులూ నిర్ణయించిన మంచికథ లక్షణాలకి  భిన్నంగా ఉన్న భాగాలు ఏమిటి అంటే -

వస్తువు తీసుకుంటే రాజుగారే ఒక ఇంటర్వ్యూలో[1] చెప్పేరు. ప్రధానంగా “యుద్ధాలూ, మరణాలూ, భీభత్సం, సమాజంలోనూ, ఇంట్లోనూ సంఘర్షణలూ ఈనాటి జీవితంలో ఇతోధికంగా కనిపిస్తున్నాయి. అందుకు భిన్నంగా భారతీయవేదాంతం, మతగ్రంథాలూ శాంతిని బోధిస్తాయి. నిరీక్షణని ప్రోత్సహిస్తాయి. ఈ వైరుధ్యాలమధ్య మానవీయవిలువలని ఆదరించి మనిషి మానసికంగానూ, సమాజజీవిగానూ ఔన్నత్యాన్ని సాధించడానికి దోహదం చేయడం కథలలక్ష్యం,” అన్నారు రాజు గారు. అంచేత ఈ కథలు ఆ విశాలదృక్పథంపరిధిలో జీవితాన్ని అనుభవించి,  పరిశీలించి చిత్రించినవి.

> “మానవఔన్నత్యం, మానవపరిణతి కథలో చిత్రిస్తే, ఆ కథ సామాజిక అనుబంధాలలో కుటుంబంలోవారితో అనుబంధాలలో సమస్యలని తట్టుకునే శక్తి ఇస్తుంది.” అంటారు.

అంతర్లోకం, అంతర్మథనం, ఆత్మపరిశీలన ఇతరకథల్లో కనిపించవని కాదు కానీ రాజుగారికథల్లో ఉన్నంత తీవ్రంగా లేవనే అనుకుంటాను. చాలావరకు ఈనాటి పత్రికలు సంఘర్షణలచిత్రణని బాగానే ప్రోత్సహిస్తున్నాయి. అందుకు సందేహం లేదు. కానీ

---

[1] ఈ ఇంటర్వ్యూకి లింకు https://www.youtube.com/watch?v=oO5hcOM_YS4.

రాజుగారికథలలో ఆ సంఘర్షణ అంతస్సంఘర్షణగా, ఆ సంఘర్షణమూలంగా పాత్రలో కలిగిన పరివర్తనా ప్రధానంగా సాగుతాయి. బంగాళాఖాతంలో వాయుగుండంలో చిక్కుకున్నంత ఉధృతంగా మనసు అల్లోకల్లోలం అయిపోయినప్పటి ఆత్మఘోష రాజుగారికి వస్తువు. అంచేత కథల్లో దుష్టపాత్రలు ఉన్నా వాటిప్రస్తావన సూచనప్రాయంగా మాత్రమే చిత్రితమయింది.

ప్రధానపాత్ర మనసులో అల్లకల్లోలం చిత్రితం అయిందంటే భాషద్వారాను, పదాల ఎంపికలోనూ, వాక్యనిర్మాణంలోనూ కనిపిస్తుంది. కొన్ని పదాలు రాజుగారు సృష్టించేరేమో అని కూడా అనిపించింది నాకు. కొన్ని సందర్భాలలో పదాలు మనని గందరగోళపెడతాయి. అక్కడిక్కడ చదవడం ఆపి, కథకుడు ఏం చెప్తున్నాడా అని ఆలోచించుకోవలసి వస్తుంది.

ఉదాహరణకి “నిశ్శబ్దం ఒక పదం కాదు” అన్న చిన్నకథలో కథానాయకుడు నిశ్శబ్దాన్ని ఆశ్రయిస్తాడు. ఆయన ఆలోచనలు పాఠకులకి సూచనప్రాయంగా మాత్రమే విదితమవుతాయి. ఈ కథలో “తన” పదం ఉపయోగం విచిత్రంగా ఉంది. ప్రధానపాత్ర రావుగారికి ఆయింట్లో గల స్థానం ఏమిటి అన్నది అయోమయం చేస్తుంది ఈ “తను” వచ్చి.

“మనసులో ఏముందో తెలీదు. … ఎప్పుడూ తనవాళ్ళగొడవే. ఇంట్లో సంగతి చిన్నమెత్తు పట్టదు” (భార్య మాటలు).

“వాళ్ళ నాన్నగారితద్దినమని అన్నారు. ఇంట్లో కుదరదు. మఠంలో పెట్టుకోండని అత్తగారన్నారు” (కోడలి మాటలు).

“తనవాళ్ళని ఎవరికైనా ఉంటుంది” (కొడుకు మాటలు).

ఈ వాక్యాలు చూసినప్పుడు నాకు కలిగిన సందేహం ఆఇంట్లో ఉన్నభార్య, పిల్లలు "తన" వాళ్ళు కారా? కాకపోతే, మరి ఈ "తన"వాళ్ళు ఎవరు? కథలో ఎక్కడా ఆ "తన"వారు కనిపించరు. అంటే పాఠకులఊహకి వదిలిపెట్టిన అంశం ఇది. మరి పాఠకులు దీనిని ఎలా అర్థం చేసుకుంటారు? ఈవిషయం నేను చాలాకాలం ఆలోచించేను. తండ్రితద్దినం ప్రస్తావనని బట్టి, తల్లిదండ్రులూ, ఉంటే తోబుట్టువులూ అయి ఉండాలనిపిస్తోంది. అలా అనుకుంటే, అత్తమామలకీ కోడలికీ పొత్తు లేదన్న అర్థం వస్తుంది. కథంతంలో రావుగారు ఆస్తి ఆశ్రమానికి రాసి ఇచ్చేస్తారు. అంటే ఆయనకి భార్యాబిడ్డలమీద మమకారం లేదనే అనుకోవాలి. ఆయనకి సంబంధించిన కాయితాలేవో ఆశ్రమంవారు ఇంటికి పంపుతారు కానీ అందులో ఏముందో భార్య కానీ కొడుకు గానీ చూడరు. ఇవన్నీ ఆ "నిశ్శబ్దం"ద్వారా పాఠకులకి జవాబులు లేని ప్రశ్నలుగానే మిగిలిపోతాయి. ఆ విధంగా ఆ నిశ్శబ్దం కథలో ప్రముఖపాత్ర వహించినా, తద్వారా కథకి సమకూడిన అధికలాభం ఏమిటి అన్న ప్రశ్నకి కూడా మౌనమే సమాధానం అవుతుంది.

వాక్యనిర్మాణంలో రెండు రకాలవాక్యాలు విలక్షణమైనవిగా కనిపిస్తున్నాయి. మొదటిది పొడి పొడి వాక్యాలు, పదబంధాలు సంపూర్ణవాక్యాలకి బదులు వాడడం కనిపిస్తుంది. ఉదాహరణకి,

> "తెల్ల కాన్వాస్ షూ, ప్రభాతఫేరీలాంటి కాలనీపరిభ్రమణం, మూడు కిలోమీటర్లు."

> "మిశ్రాగారికి భార్యావియోగం, కోడలితో కొన్ని సమస్యలు, నిశ్శబ్ద ఉషఃకల్యాణలావణ్యంలో ఒక ఆక్రందన పరిభాష."

సాధారణంగా కథల్లో పాత్రని పరిచయం చేసినప్పుడు ఆపాదమస్తకం వర్ణించడం ఒక పద్ధతి. ఒకొకప్పుడు గుణగణాలని చేర్చడం కూడా జరుగుతుంది. మధురాంతకం రాజారాంగారికథల్లో చూస్తాం ఈ పద్ధతి. మల్లాది రామకృష్ణశాస్త్రిగారూ, రాచకొండ విశ్వనాథశాస్త్రిగారూ సూచనప్రాయంగా కొన్ని లక్షణాలు మాత్రం ఉటంకిస్తారు. చలం, కుటుంబరావు, పేరు చెప్పి సంఘటనలు వివరించుకుంటూ కొనసాగిస్తారు. పాఠకులు ఆ పాత్రలమాటలనుబట్టీ ప్రవర్తనలనుబట్టీ పాత్రల రూపురేఖలు ఎవరికి తోచినట్టు వారు ఊహించుకోవచ్చు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి **విమానం ఎక్కబోతూనూ** కథలో పాత్రలపేర్లు కనిపించవు.

పైన ఉదహరించిన **నిశ్శబ్దం ఒక పదం కాదు** కథలో మిశ్రా తెల్ల కాన్వాస్ షూ వేసుకున్నారని మాత్రమే మనకి తెలుస్తుంది. ఆ పైన పాఠకుడు ఊహించుకోవాలి ఆ పాత్ర రూపురేఖలు. పాఠకులలో తమకి పరిచయమైనవారిలో తెల్ల కాన్వాస్ షూ వేసుకున్నవారుంటే, బహుశా ఆ వ్యక్తిరూపం చూచాయగా మనసులోకి రావచ్చు. లేదా కేవలం షూ ఇలాటిది వేసుకుంటే మనిషి ఇలా ఉంటాడని ఊహించుకోవచ్చు. అలాగే మిగిలిన పదబంధాలు కూడా పాఠకుడి ఆలోచనలని అనేక వైపులకి నడుపుతాయి. కంటికి కనిపించే బాహ్య రూపురేఖలు అనవసరం కూడా కావచ్చు కొన్ని సందర్భాలలో.

రెండోరకం వాక్యం లెక్కకు మించిన అసమాపకక్రియలతో చేసిన సుదీర్ఘ వాక్యనిర్మాణం. ఇంగ్లీషులో సుదీర్ఘమైన వాక్యాలు ఉండవని కాదు కానీ, ఈమధ్య "కథలు ఇలా రాయాలి" అని నియమాలు సూచించే పండితులలో చాలామంది చిన్న చిన్న వాక్యాలు రాయాలంటున్నారు. సరళాతిసరళమైన పదాలతో, స్పష్టాతిస్పష్టంగా కూర్చిన చిట్టి పొట్టి వాక్యాలకే పెద్ద పీట కథలబడులలో ఈనాడు. నిజానికి అలా రాసి మెప్పించగల రచయితలు లేకపోలేదు మనకి. అటువంటి రచయితల్లో నేనయితే రావిశాస్త్రిగారికి

పెద్దపీట వేస్తాను. ఆయనకథల్లో ఈనాటి పాఠకులకి తెలియని పదం ఒక్కటి కూడా లేదేమో. అలాగే మధురాంతకం రాజారాంగారు ఒకొక సన్నివేశాన్ని బాగానే పొడిగించినా, పదాలు సాదారణంగా మనకి తెలీనివి ఉండవు. అక్కడక్కడ చిత్తూరు ప్రాంతంపదాలు నాకు తెలీనివి కొన్ని ఉన్నా, చాలావరకూ సాఫీగానే సాగిపోతుంది ఆయనకథ. అలాగే, చలం, కొడవటిగంటి కుటుంబరావు, తదితరులు అతిసాధారణమైన భాషలో బలమైన భావాలు పొదిగినవారు ఉన్నారు.

రాజుగారికథల్లో కూడా అలాటివి లేకపోలేదు. **ఇద్దరు పిల్లలు** కథ ఒక ఉదాహరణ. అందులో కూడా నాకు తెలియని పదాలు తగిలేయనుకోండి, అది వేరేకథ. ప్రధానంగా రెండు, మూడు తరాలవెనకటి జీవితాన్ని, ఆనాటి ఆటపాటలు, వంటావార్పులు, అండీలూ, గుండిగెలులాటివి-ఆనాడు ప్రాచుర్యంలో ఉన్నపదాలు-వాడుతున్నప్పుడు అవి విననందుకో, మరిచిపోయినందుకో నన్ను నేనే తూలనాడుకోవాలి గాని రచయితని అనడానికి లేదు! అదలా ఉండగా, రచయిత తీసుకున్న వస్తువు కూడా భాషని నిర్ణయిస్తుంది కదా.

> అలివిమాలిన తన్మయత్వంతో పాటనందుకున్నాడు. ఆర్తితో, ఆవేదనతో, సుడులు తిరిగే నిస్సహాయతతో, ఒక కృతయుగ వేదఘోష, ఒక కలియుగ దుఃఖదేవత, ఒక ప్రణువి, ఒక ప్రణవనాదం, ఒక మధురసంగమం, ఒకమాతృశ్రీ ఆత్మీయవేదన, ఒక అన్వేషణ, ఒక నిర్వేదపరిధిలో అతిలోక అనుభూతిపర్వం. (అదృష్టదేవత).

ఇలాటి వాక్యాలలో పాత్ర ఆత్మవేదన ఎంత బలంగా ఉందో ఎత్తి చూపాలి. అందుకు రచయిత ఎంచుకున్న పదజాలం తోడ్పడుతుంది. బంగాళాఖాతంలో వాయుగుండంలో చిక్కుకున్న చిన్నపడవలాటి హృదయాన్ని చిత్రించాలంటే దానికి తగిన భాష వాడకతప్పదు కదా. "కృతయుగ వేదఘోష", "కలియుగ దుఃఖదేవత" వంటి

నుడికారాలకి మరోరకంగా అర్థం వివరించడం కష్టం. పైవాక్యంలో "ప్రణువి" అంటే మాత్రం అర్థం నాకు తెలీలేదు. కొన్ని పదాలు రాజుగారిసృష్టేమో అని నేను అనుకున్న పదాలలో ఇదొకటి. ఆంధ్రభారతి, ఆప్టే, బ్రౌణ్యనిఘంటువుల్లో నాకు అర్థం దొరకలేదు. అనువాదంకోసం సుమారుగా, సందర్భాన్నిబట్టి ఊహించుకున్నానంతే.

అసమాపకక్రియలో కూడిన సుదీర్ఘవాక్యానికి ఉదాహరణ -

> ఈలోకంలో మానవుడి జీవితగమనాన్ని అరాచకం చేయగల శక్తిని ఈ డబ్బుకు ఎవరిచ్చేరో తెలియక, భద్రతకూ అభద్రతకూ మధ్య అదృశ్యరేఖను క్షణంలో నిర్దాక్షిణ్యంగా చెరిపివేయగల రాక్షసప్రవృత్తి దానికి ఏ ఖగోళంనుండి లభిస్తున్నదో గ్రహించలేక, తనకంత తాత్త్వికాభినివేశం లేక, ఎవరినీ ఎన్నడూ అప్పుకోసం అర్థంచేసేర్పు లేక, ఇప్పటికే మూడుసార్లు తప్పి నెలరోజుల్లో మళ్ళీ రానున్న పరీక్షల భూతభయాన్ని ఎదుర్కోలేక, తన స్వగతాలబరువుతో కదలనంటున్న కాలరథాన్ని కదిలించే మనోబలం లేక, పట్టణవీధుల్లో ప్రోది చేసుకున్న వివిధ విషాదాల ప్రతిశ్రుతుల్ని పారద్రోలుకోలేక, చలనం లేని వెలుగు నివ్వని ఒంటరి దీపస్తంభంలాగా దిగులుతో ముసురుకొస్తున్న చీకటిసంధ్యను తిలకిస్తూ, ఎన్నాళ్ళనుండో వెల్లకోసం వేసారుతూ ఊడలమర్రివలె దృగ్గోచరమవుతున్న తనగది గోడలమధ్య-తనకిష్టమయిన పాటను నెమరువేసుకుంటున్నాడు. (అదృష్టదేవత)

పై పేరాలో మురళి జీవితకథంతా తెలుస్తుంది. అందులో ఒకొక వాక్యం-డబ్బుకి ఇంత శక్తి ఎలా వచ్చిందో అన్న శంక, తనకి తాత్త్వికాభినివేశం లేదు, పరీక్ష 3 సార్లు తప్పేడు, పట్టణవీధుల్లో వివిధ విషాదాలు ప్రోది చేసుకున్నాడు - ఇవన్నీ ఒకొక వాక్యం ఒకోక చిన్నకథ కావచ్చు. ఒక్కొక్క క్రియావిశేషందగ్గరా ఆగి ఆ వాక్యంవెంట

ఆలోచించుకుంటూ పోవచ్చు. నిజానికి చివరి నాలుగు వాక్యాలకీ అర్థం చెప్పుకోడానికి కూడా నాకు చాలా సమయమే పట్టింది.

"మునిపల్లె రాజుగారి కథలు చదివి కథలు ఎలా రాయాలో నేర్చుకున్నాను," అన్నారు మధురాంతకం రాజారాంగారు. బహుశా ఇలా పాఠకులని "ఆలోచించుకునేలా" చేయడంగురించే ఆయన ఆమాట అని ఉండవచ్చు. కానీ రాజారాంగారి శైలికీ, రాజుగారి శైలికీ మధ్య చెప్పుకోదగ్గ వ్యత్యాసం ఉంది. అందుకే పాఠకుడిని ఆలోచింపజేయడం మాత్రమే అంటున్నాను. రాజారాంగారి కథలు అర్థమయినంత తేలిక కాదు రాజుగారి ప్రయోగాల కథలు అర్థం చేసుకోడం

**సత్రయాగం, అస్తిత్వనదం ఆవలితీరాన, వేరేలోకపు స్వగతాలు వంటి కథల్లో** సంపూర్ణ జీవితంగురించిన తర్కవిచారణ పుష్కలంగా చూస్తాం. వీటిలో అసమాపకక్రియలతో కూడిన సుదీర్ఘమైన వాక్యాలు పాఠకుడిని నిలబెట్టేస్తాయి. ఇటువంటి సుదీర్ఘసమాసాలతో కూడిన వాక్యాలు సాధారణంగా రచయితని అనేకానేక ఆలోచనలు కందిరీగల్లా చుట్టుముట్టి మూకఉమ్మడిగా ఉక్కిరిబిక్కిరి చేస్తున్నప్పుడు వస్తాయనుకుంటాను. కనీసం అటువంటి భావాన్ని పాఠకుడిలో కలిగించవచ్చు. సాధారణంగా మన దైనందినజీవితంలో కూడా ఆపకుండా మాటాడేవారిని తరుచూ చూస్తాం కదా. రాస్తున్నప్పుడు అటువంటి భావాన్ని కలిగించడం కూడా ఒక ప్రయోజనమే మరి.

సంక్లిష్ట పదబంధాలతో కూడిన సుదీర్ఘవాక్యాలలో ఏది విశేష్యమో, ఏది దేనికి విశేషణమో, ఆ రెంటికీ సంబంధం ఏమిటో కనుక్కోడానికి కూడా సమయం కావాలి. పాఠకుడు పదే పదే ఆలోచించుకోవలసిన తరుణం ఆసన్నమవుతుంది.

> "పాఠశాలలో ఒక ఉపాధ్యాయుడు, వీధిమలుపులో అభిశప్తురాలైన అప్సరకన్యగా కనిపించి, తనభర్త అమానుషక్రౌర్యానికి నిత్యమూ బలి అవుతూ కూడా తనను ఆదరించిన చిట్టెమ్మ, హనుమాన్లగుడిలో పెనవేసుకుని జమిలి నాగసర్పాలలాగా తోచే రావిచెట్టూ వేపచెట్టూ చెప్టామీద తపస్సు చేసుకునే అంజన్న తాత ..."

> "అమ్మ తనపనుల్లో నిమగ్నమై వైశ్యవనిత ఆదెమ్మ ఇంటివరండాలో తనను విడిచినప్పుడు, ఆమె చెప్పే కథలు వింటూ, నిస్సంతువుగా ఆమె పడ్డ ఆందోళనల అర్థం తెలియక దిగులుపడుతూ, ఎక్కడో అడవి మధ్య అగస్తేశ్వరుడిగుడిలో భర్తతోపాటు దీక్షామండలాలు ఐదేళ్ళుగా నిర్వర్తించిన అనుభూతుల్తో చకితుడై, అప్పుడప్పుడు హఠాత్తుగా దర్శనమిచ్చే తాపసులు చూపిన మహిమలు కళ్ళకు కడుతుంటే, తన చిరంతన స్వప్నలోకం నిదురకు ఆహ్వానిస్తుంటే లొంగిపోయిన తన శైశవం ఒక స్వర్గలోకం." (నిష్క్రమణ ద్వారం)

అలాగే ఒక సన్నివేశంలో నవ్వు అనిపించే వాక్యాలు కూడా అక్కడక్కడ తగులుతాయి.

సీతారాం పాత్రని మహోన్నత వ్యక్తిగా మలిచేప్రయత్నంలో చెప్పినమాటలు -

> అందరూ చెప్పుకున్నది-గ్వాలియర్ నగరానికి వందమైళ్ళదూరం అడవుల్లోకి బందిపోట్లు అపహరించుకుపోయిన పెళ్ళిబస్సును వెంటాడి, ఎవరికీ హాని జరగకుండా స్త్రీలని ఆభరణాలతోసహా రక్షించేడని. కొందరు దొంగల్ని వినోబాముందుకు తెచ్చి, అస్త్రసన్యాసం చేయించాడని. అమోఘమైన హింది వాక్చాతుర్యం కలవాడు. సంస్కృతం సరే సరి. ఏకసంతగ్రాహి. బహుశః వినోబాజీ

> ప్రేరణతోనే కావచ్చు తన గ్రామపరిసరాల్లో అశేషంగా ఉన్న-యానాదులనబడే అనాది ఆదివాసులసేవకు అంకితమైనాడు. (సప్తతి మహోత్సవం)

ఇక్కడ ఆ పాత్ర భాషాపాటవంగురించిన సమాచారం అసందర్భం అనిపించింది నాకు. ఒకవేళ తనవాక్చాతుర్యంతో బందిపోటులని మార్చేడు అని చెప్పుకున్నా, సంస్కృతం, ఏకసంతగ్రాహి వంటివిషయాలకి చిన్నకథలో స్థానం లేదనే కథారచన పాఠాలు చెప్పేవారు చెప్పగలరు.

రాజుగారిని కథలఋషి అనీ కథకులకథకుడు అనీ ఇందుకే అన్నారేమో. అంటే పై ఉదాహరణలన్నీ ఆర్షప్రయోగాలనో, వ్యాసఘట్టాలనో కాదు కానీ, జీవితంలో అతిముఖ్యమైన, క్లిష్టతరమైన ప్రశ్నలకి సమాధానాలు వెతుక్కుంటూ, వాటిని వ్యవహారికభాషలోకి దింపడానికి యత్నించినప్పుడు రచయిత ఎలాటి, ఎంతటి మానసికక్షోభకి గురి అవుతాడో, భాషతో ఎంతగా కుస్తీ పట్టవలసివస్తుందో ఈ కథలు చదివితే తెలుస్తుంది. మరోలా చెప్పాలంటే, వర్ధమాన రచయితలు "రాజుగారిలా రాద్దాం" అని కాక, రాజుగారు తమభావాలని వెలిబుచ్చడానికి ఎలాటి వేదన అనుభవించేరో, మానసికంగా ఎంత క్షోక్ష అనుభవించేరో అంత బలంగా కథ చెప్పడానికి అని గుర్తించడం అవసరం.

చివరిమాటగా, మాజికల్ రియాలిజంగురించి కూడా ఒకమాట చెప్పకుండా రాజుగారి కథలమీద వ్యాసం సంపూర్ణం కాదు. రాజుగారు "మాజిక్ రియాలిజం అనే కథాప్రక్రియా విశేషం అందరూ అనుకుంటున్నట్టు పాశ్చాత్య సాహితీకారులు సృష్టించినది కాదు" అన్నారు.

"భారతీయ జానపదవాఙ్మయంలోనూ, రాయాయణ, మహాభారత, భాగవత పురాణాల్లోనూ దర్శనమిచ్చేది ఈ అద్భుత మాయావాదరసమే. దీన్ని

అనితరసాధ్యంగా నిర్వహించిన ఆద్యుడు వ్యాసమహర్షి. ... మాజికల్ రియాలిజం సృష్టికర్త వ్యాసులవారిని స్మరించుకుంటూ, ఆధునిక సంక్లిష్ట జీవనసమస్యలపరిధిలో యిముడుస్తూ ఈ కథారచన సాగింది" అన్నారు తమ **అస్తిత్వనదం ఆవలితీరాన** సంకలనానికి నాందీప్రస్తావనగా రాసిన **రచయితవివరణ**లో.

అయితే మరి ఇవి వినూత్న ప్రయోగాలు అవునా, కాదా? నాకు తెలీదు కానీ ఈనాడు వస్తున్న అనేకానేక కథలకి భిన్నంగా ఉన్నాయని మాత్రమే అనిపిస్తోంది.

(ఆగస్ట్ 20, 2014)

# 14. మధురాంతకం రాజారాంగారికథల్లో జీవనమాధుర్యం!



మధురాంతకం రాజారాంగారి (1930-1999) కథలగురించి కొత్తగా చెప్పేదేముంది అని మీకనిపిస్తే నాకు ఆశ్చర్యం లేదు. చాలాకాలం తరవాత మళ్ళీ చదువుతుంటే నవ్యనూతనంగా భాసించేయి వారి కథలు. మరొకమారు అద్భుతమైన అనుభవం ఇది.

నాకు చాలాకాలంగా రావిశాస్త్రిగారు అభిమానరచయిత. ఎవరైనా నన్ను మంచికథకులెవరని అడిగితే రావిశాస్త్రిగారి పేరే మొదట చెప్తాను. తరవాత మల్లాది రామకృష్ణశాస్త్రీ, మధురాంతకం రాజారాంగార్ల పేర్లు చెప్తాను. ఇప్పుడు రాజారాంగారి పేరు మొదటికి తీసుకొస్తున్నాను. అంటే ఇది తెలుగు సాహితీక్షేత్రంలో వారిస్థానాలు నిర్ణయించడం కాదు. వారు ముగ్గురూ దిగ్దంతులు. భావుకులు. తెలుగుకథకి వన్నెచిన్నెలు అలదిన  మేధావులు నిస్సంశయంగా. అయితే, వీరిలో కొన్ని తేడాలున్నాయి. నామటుకు నాకు రావిశాస్త్రిగారికథలు చదువుతుంటే, అవి ఆయన స్వగతాలలా, తనలో తను మాటాడుకుంటున్నట్టు అనిపిస్తుంది. ఎదుట పాఠకుడు ఉన్నాడన్న స్పృహతో కథ చెప్తున్నట్టుండదు. రామకృష్ణశాస్త్రిగారి కథల్లో ఒకరకమైన ఆరూఢి స్ఫురిస్తుంది. “ఇదుగో అబ్బాయీ, నీకు తెలీదు కనక చెప్తున్నాను” అన్నట్టుంటుంది వారి కథనరీతి. రాజారాంగారు వృత్తిరీత్యా ఉపాధ్యాయులు.

ప్రవృత్తిరీత్యా కూడా ఉపాధ్యాయులుగానే ప్రత్యక్షమవుతారు ఈ కథల్లో. మునిమాణిక్యం నరసింహారావుగారు  కూడా వృత్తిరీత్యానూ ప్రవృత్తిరీత్యానూ ఉపాధ్యాయులే. అలాగే భమిడిపాటి కామేశ్వరరావుగారు కూడా రెండు విధాలా ఉపాధ్యాయులే. అయితే, వీరు ఆవిష్కరించిన కోణాల్లో వ్యత్యాసం ఏమిటంటే వీరిద్దరూ బడిలో ఆనాటి చిన్నపిల్లలప్రవర్తన చిత్రించేరు హాస్యరసస్ఫోరకంగా. ఆరోజుల్లో ఉపాధ్యాయులయందు లుప్తమైన గౌరవం కూడా కొంతవరకూ కనిపిస్తుంది వీరి కథల్లో. వీటికి భిన్నంగా, రాజారాంగారికథల్లో "జిత్తెడు నిక్కర్లపైన జానెడు చొక్కాలు తొడుక్కున్న ఒకనాటి బుల్లి విద్యార్థులు పెరిగి పెద్దవాళ్ళయిపోయి మీసాలతో, గడ్డాలతో ఏ బజారులోనో ... నమస్కారమండీ అంటూ పలకరించడం" చూస్తాం (మా బొంబాయి ప్రయాణం పు. 270). ఆ గురుశిష్యులమధ్య చిన్నతనంలో నాటుకుని, దరిమిలా కాలక్రమంలో ననలు తొడిగి, ఫలపుష్పభరితాలయిన ఆత్మీయతలు, అభిమానాలు చోటు చేసుకుంటాయి. నాకు రాజారాంగారికథలు ముఖ్యంగా ఇప్పుడు మళ్ళీ చదువుతుంటే, మనని పక్కన కూచోబెట్టుకుని ఆదరపూర్వకంగా మాటాడుతున్నట్టు ఉంది. కొండొకచో కథకుడు వినయంగా కూడా కనిపిస్తారు. రాజారాంగారి తొలికథల్లో "తాను వెలిగించిన దీపాలు" వారిని మేలుబంతి రచయితగా సుస్థిరం చేసిన కథ. కథ నాకు బాగా గుర్తు లేదు కానీ అందులో వస్తువు మాత్రం ఇలాటి గురుశిష్యుల అనుబంధమే.

ప్రతి ఒక్క విషయమూ క్షుణ్ణంగా పరిశీలించి, అనేక కోణాలను చక్కగా పరిశీలించి ఆవిష్కరిస్తాయి రాజారాంగారి కథలు. కథ ఎత్తుగడలో, పాత్రచిత్రణలో, సన్నివేశాలు ఆవిష్కరించడంలో, ముగింపులో - ప్రతి పదంలోనూ ప్రతి అక్షరంలోనూ రాజారాంగారి ముద్ర కనిపిస్తుంది. వన్నె తరగని, చెక్కు చెదరని ముద్ర అది. ఇతివృత్తాల్లో వైవిధ్యం, పాత్రచిత్రణలో పరిపూర్ణత, కథనరీతిలో అసదృశమైన పోకడలు – రాజారాంగారి కథలని తెలుగు కథాసాహిత్యంలో ప్రత్యేకంగా, విడిగా నిలబెడతాయి. మౌలికమైన

భారతీయాత్మని ఎంతగా అభిమానిస్తారో అభ్యుదయభావాలని అంతగానూ అభినుతించి ఆదరిస్తారు.

ఇతివృత్తం తీసుకుందాం. రాజారాంగారు 300 కథలు రాసేరుట. ఈ సంకలనంలో 37 కథలున్నాయి. వీటిలో వైవిధ్యం వారి ఉపలబ్ధికి సాక్ష్యం. పల్లెజీవితాలు-పట్టణపు పోకడలు, స్వదేశీజనాలు-విదేశీయులు, రైతులు-వ్యాపారులు, ఉపాధ్యాయులు-ఆఫీసుల్లో మేనేజర్లు, దొంగలు-దొరలు-ఇలా వైవిధ్యభరితమైన పాత్రలు చూస్తాం వీరి కథల్లో. చంపవచ్చినవారికైనా అతిథిసత్కారంలో లోపం చేయని ఉత్తమురాలెంతో, ఆత్మనిగ్రహంతో తన మార్గం తాను కనుగొన్న సబల కూడా అంతే. ఆధునికయుగంలో కులాంతర, మతాంతర, విజాతీయవివాహాలు, కుటుంబనియంత్రణలు అన్నీ ఆయనకి కథావస్తువులే. తమకి ఇబ్బంది కలిగించే అంశాలు—అశ్లీలసాహిత్యంతో సహా-వస్తువుగా స్వీకరించక మానరు కానీ అది తమకి అప్రియమని తెలియజేయడానికి వ్యంగం వాడుకుంటారు. “కామినీ, బట్ట విప్పుకుని పైకి వచ్చేస్తున్నట్టుండే మోహినీ పిశాచాలు, తదితర దయ్యాలు, తలపుర్రెలు, కంకాళాలు, రాక్షసరతులు, సమిష్టి సంభోగాలు ... ఇదే తిండీ, నీళ్లూ ... పరమార్ధము అయినట్టు వ్యవహరించే వల్లకాటి నాగరికతకి అద్దంపడుతూ రుద్రభూమి”లాటి పుస్తకాలుషాపు. అది చూసిన కథకుడికి ‘‘ఒళ్ళంతా చెమటలు పోశాయి. కళ్ళు తిరిగేయి. ఉన్నట్టుండి శవాలజాతరలో పీనుగుల కుంభమేలాలో ఆటవికదిగంబరుల పాశవికప్రవృత్తులనడుమ చిక్కుపడిపోయేను’’ అనుకుంటాడు. “ఇంకా నేలమాళిగలో ఎంతో నమ్మకమయినవాళ్ళకు గాని చూపించనివి కూడా ఉన్నాయి” కానీ ఆయన అక్కడ నిలవలేక పారిపోతాడు (రుద్రభూమి పు. 317).

పాత్రచిత్రణ. సాధారణంగా రచయిత పాత్రలని పరిచయం చేసే విధాలు రెండు. ఒకటి అక్షిగోచరమైన రూపాన్ని వర్ణించడం, రెండోది పాత్రల ఆంతర్యాలను సూచనప్రాయంగా

తెలియజేయడం. మొదటి తరహా వర్ణనకి మచ్చు-బండలాంటి బట్టతలకు ఓ తుండుగుడ్డ చుట్టుకుని, రిపేర్లతో తలమునకలైన చెప్పుల్లోనుంచీ పాదాలను ఊడ్చుకుంటూ వీధుల వెంటతిరగే మిఠాయి బేరగాడు (సుడిగుండం. పు. 32). చీరె కట్టుకున్న చెరుకుగడలా అమ్మాయి ... గుబురుగా పెరిగిన చెరకు నోగలకుమల్లే శిరోజాలను గూళ్ళుగూళ్ళుగా" (సుడిగుండం. పు. 41). శేఖరంగారు బాగా పొడుగరి. స్థూలం కాదుగానీ సొరకాయలా జబ్బుబారిన శరీరం ఆయనిది ... రోజులతరబడి సంస్కారానికి నోచుకోని క్రాపింగుతో, నలిగిపోయిన దుస్తులతో, ఏదో మందకొడితనం గూడు కట్టుకున్న ముఖంతో, అప్పుడే నిద్రపడకనుంచి లేచినట్టుగా" (సుడిగుండం పు.35). మాసిపోయిన నాలుగు మూళ్ళపంచె, గోనెపట్టాలా వున్న నీలిరంగు అరచొక్కా, పొట్టి వెంట్రుకల గుండ్రటి తల. కోపంతో కందగడ్డలా జేవురించిన ముఖం. అతడిపేరు కోదండం. (మసి మరక. పు. 175.). దయ్యాన్ని చూచి జడుసుకున్నట్టుగా తలవెంట్రుకలు నిక్కబొడుచుకుని గాలిలో కదులుతున్నాయి. (ఉన్నదీ కోరుకున్నదీ. పు. 48).

రెండోపద్ధతి పాత్రచిత్రణకి ఉదాహరణ-"ఒకానొక సామూహిక చిత్రంలో... బాల్యాన్ని అధిగమించి, యౌవనంలో కాలుబెడుతున్న చంద్రం ... కళ్ళల్లో కాంతులు నింపుకుని చిరునవ్వుని మరీ అంత స్వేచ్ఛగా పారిపోకుండా పెదవులచివళ్ళలో త్రొక్కిపట్టి వెలుగుతూన్న కాకరపువ్వొత్తిలా కనిపించేడు. ఆ చూపులేవో ప్రగల్భభావాల్ని వెలార్చుతున్నాయి. కొంచెంగా కుంచించుకపోయిన కనుబొమలు మనిషిలోని ఆలోచనను, నిశ్చలత్వాన్నీ లీలగా ప్రకటిస్తున్నాయి. ... పెడదారివెంట పరుగెత్తీ పరుగెత్తీ పొరపాటు తెలిసి రాగానే ఆగిపోయి వెనుదిరిగి వెళ్ళడానికీ మనస్కరించక, ముందుకు వెళ్ళడానికీ సాహసంలేక ఇసుక తుఫానులో చిక్కి బిక్కరిస్తున్న ప్రయాణీకుడిలా" (సుడిగుండం. పు. 34).

ఈ కథల్లో మనని సూదంటురాయిలా ఆకర్షించి, ఆనందడోలలలో ఊపిరాడకుండా ఊపేసే మరో సుగుణం రాజారాంగారి కవితాత్మ. "మంచులో తడిసిన తర్వాత నీరెండలో నిగనిగలాడుతున్న గులాబీపువ్వులా ఉంటుంది." (**ఉన్నదీ కోరుకున్నదీ**. పు. 48). "ఆషాఢమాసంలో ప్రథమదివసంలాంటి రోజు. నీలాంబరాన కాలాంబుదాల లముకున్నాయి. ఉదయం పదిగంటలు కావస్తున్నా వానవాసనతో మిళితమై హేమంతకాలపు శీతలపవనం కిటికీగుండా లోపలికి వీస్తోంది." (**వైరాగ్యంతో సరాగం**. పు. 52). "దిక్కులవరకూ పచ్చని తోటలు, కెంపులు, పచ్చలు, యింద్రనీలాలు గుప్పిళ్ళతో తీసి వెదజల్లినట్టున్న పుష్పగుచ్ఛాలు. మెల్లగా కదలిపోతున్న నీలిమబ్బులు, ఆకాశాన మేఘాంచలాలకు మెరుగులు దిద్ది క్రిందికి దిగివచ్చి సర్వప్రపంచంపైన వసంతాలు చల్లుతున్న సువర్ణకాంతులు. భువనమోహనంగా ముస్తాబైంది సంధ్యాసుందరి. పచ్చనిపావడా కట్టి పువ్వులకంచుకాన్ని తొడిగి, సరిగంచు వచ్చిన నీలిరంగు వలువను పమిటగా కైసేసి నృత్యానికి సిద్ధమైన రాజనర్తకిలా సంధ్య ఒయ్యారాలు పోతోంది." (**ఉన్నదీ కోరుకున్నదీ**. పు. 47).

రాళ్ళసీమగా రత్నాలసీమగా పేరుబడ్డ రాయలసీమలో పల్లెపట్టుల వర్ణనలు రాజారాంగారివంటి పుట్టు రైతుబిడ్డకే చెల్లు. "అప్పట్లో అది బంగారుకాలం అనుకోవాల. తలుచుకోగానే వానలు పడి చెరువులు సముద్రాలమాదిరిగా అంచులదాకా పొంగివచ్చి, ఏడాదికిరుగార్లు పంటలు పండితే రైతు ఆ భూభారమంతా చిటికెనేలితో మోసెయ్యడా సార్! వరసగా అయిదారేండ్లు సరిగా వానల్లేక, పంటలు చేతికందక పోయేటప్పటికి ఏటిలో బోర్లేసేసిరి, ఏటి గట్లలో బోర్లేసేసిరి. నీటిజల అడుగంటిపోయె." ఆ తరవాత మామిడిచెట్లు నాటి, "మాంగోనగర్"గా ప్రసిద్ధిగా పేరు సంతరించుకుంటుంది. తీరా ఆ "మాంగో" వ్యాపారం కారణంగా ఇద్దరు శిష్యులు తగువు పడితే, తగువు తీర్చమని ఈ చిన్ననాటి గురువుగారిదగ్గరకే రావడం పాఠకుడిని సైతం ఆర్ద్రతతో అలరించగల అనుభవం. ఆ తీర్పు బొంబాయిలో వర్తకుడు తోతారాం సమక్షంలో జరగాలి కనక

ఆయన్ని బొంబాయి తీసుకువెడతారు ఆ శిష్యులిద్దరూ. అదీ **మాబొంబాయి ప్రయాణం** కథ. ఈ కథలో నాకు మరో విషయం కూడా స్ఫురించింది. శీర్షిక **బొంబాయిప్రయాణం** అని చూసినప్పుడు ఆ ప్రయాణానికి ఇల్లాలు కట్టే మూటలో, ఇరుగూ పొరుగూ బొంబాయిలో మరెవరికో చేర్చమని ఇచ్చే మూటలో అనుకున్నాను. కానీ ఈ కథలో మనం చూసేది ఆ ప్రయాణం ఏ సందర్భంలో చేయవలసివచ్చింది అని మాత్రమే. అంటే నేను చెప్తున్నది ప్రతిభావంతుడైన రచయిత ఒకకథకి శీర్షిక పెట్టినప్పుడు పాఠకుడిని ఎలా తికమక పెట్టగలడో చూడమని. ఇది ఒకవిధంగా నాకు కొత్త పాఠం కూడా అయింది కథలకి శీర్షికలు ఇవ్వడంలోనూ, వాటిని ఎలా అన్వయించుకోవాలో గమనించడంలోనూ.

అలాగే, పల్లెల్లో వెనకటిరోజుల్లో ఉత్తరాలు బట్వాడా చెయ్యడానికి తిరిగే చిన్నాయన పాత్రచిత్రణ అద్వితీయం. "పాకాలనుంచి దక్షిణాదిగా కాట్పాడివైపు వెళ్ళే రైల్లో ప్రయాణం చేసినవాళ్ళు పూతలపట్టు, చిత్తూరు, రామాపురం, బొమ్మసముద్రంలాటి ఊళ్ళపేర్లు వినివుంటారు. ... చిన్నాయన ఉత్తరాల సంచి భుజాన వేసుకుని సుఖమా మనరాజ్యమెల్ల సుఖమా అన్నంత దర్పంగా పల్లెలపైకి బీటు వెడలేవాడు. ... ఆయనవెంట ఊళ్ళు తిరగడమంటే భలే ఖుషీగా ఉండేది." (ఆగని వేగం 257). లెక్కలపంతులు అయిన కథకుడు చిన్నాయన ఉద్యోగకాలంలోనూ ఇతరత్రా నడిచిన దూరం మొత్తం నాలుగు లక్షల కిలోమీటర్లు అంటూ లెక్క కట్టి చూపించేరు. ఈకథలో కూడా ఆ ప్రదేశాలు, చిరుతిళ్లు, నడిచిన దూరాలు, ఆడుకున్న కబుర్లు చదువుతుంటే ఇలాటి ప్రపంచం ఉండేదా ఒకొప్పుడు అని అనిపించకమానదు ఈనాటి పాఠకుడికి.

ఒక సామెతని యదాలాపంగా కథలో చొప్పించడం ఒక ఎత్తు. దాన్ని కథలో ఒక ప్రధానాంశంగా మార్చుకోడం మరొక ఎత్తు. "ఒక ఆడబిడ్డకు వివాహ సంబంధం కుదర్చాలంటే మునుపు ఏడు జతలజోళ్ళు అరిగిపోయేవిట." (అనామకుడు పు.

134). రాజారాంగారు సామెత ఉదహరించి వదిలేయడం కాక, దాన్ని వెంటనే కథకి అనుగుణంగా ఆధునీకరిస్తారు. "కాలేజీలెక్కువై అబ్బాయిలు అమ్మాయిలు పరస్పరం ప్రేమించుకోడమంటూ ఒకటి ప్రారంభమైన తరవాత ఇప్పుడా బెడద చాలావరకు తగ్గిపోయినట్టే ఉంది." (పు. 135). ఇది కథలో ఒక కీలకమయిన అంశమని మనకి చివరికి గానీ స్పష్టం కాదు. మొత్తం కథంతా ఈ అంశంమీద కేంద్రీకృతమై, పాఠకుడిని తీవ్రమైన ఆందోళనకి గురి అయేలా చేస్తుంది ఆఖరికి.  అంటే రాజారాంగారు ప్రేమకథలకి వ్యతిరేకి అని కాదు. మానవసంబంధాలు ఆధునికయుగంలో ఎలా మార్పుకు లోనయేయో, వాటి ఫలితాలేమిటో చిత్రించడమే రచయిత చేసేరు ఈ కథలో.

"బీటలు వారిన నేలపైన తొలి ముంగారు వానలు కురిసినట్టుగా", "వలచిన వనిత దొరకడం కన్నా కోరిన ఉద్యోగం దొరకడం కష్టం", "ఎలాగైతేనేం కోరిన కొండలో వాన కురిసింది." (**వైరాగ్యంతో సరాగం.** పు. 59.) లాటివి రాజారాంగారు కొత్తగా కూర్చిన సామెతల్లా ఉన్నాయి. "పెదవి దాటితే పృథివి దాటుతుంద"ని వాడుకలో ఉన్న సామెత. రాజారాంగారు "పెదవి దాటినతరవాత పెన్నసే లంఘించగలదు" అంటారు (**సంఘజీవి.** పు. 13). "తల్లి చనిపోతే తండ్రి దాయాది" (**సబల**. పు. 66). "ముంతపొగలో ఊపిరి తిప్పుకోలేనంతగా". (పు. 89). "పోస్ట్‌మాన్ కొలువు చేసేది రూకలకు. పార్వతమ్మ ఇల్లిల్లూ తిరిగేది పొద్దు పోకడకు". (పు. 12). "పాదలేపనంతో అవుసరం లేకుండా త్రిప్పి చూపించగలిగింది ఉద్యోగం" (**ప్రజాపతి** పు. 72). "ఆమె ముఖాన కృష్ణపక్షం కళలు మార్చుకుంది. చిట్టచివర అక్కడ నిండు అమావాస్య నెల నాటుకుపోయింది." (పు. 15). ఇలాటి జాతీయాలు కోకొల్లలు.

తమకి సమ్మతంకాని సందర్భం వచ్చినప్పుడు సంయమనంతోనే అయినా చురుగ్గానే అంటించగలరు. "తన భార్యను తానొక దేవతలా చూచుకుంటాననే వ్యక్తిని నేను స్వయంగా ఎరుగుదును. మొదటితరగతి ఆడఖైదీకి మగకాపలాదారు కన్నా అతడి

వ్యవహారం ఏమంత మెరుగ్గా లేదు" (**మట్టి పొయ్యి**. పు. 140). మాటకారితనం అంటే ఏమిటో తెలుసుకోవాలంటే **ప్రజాపతి** కథలో విశ్వపతిని గమనించండి. "పిల్లకాలువ గాదు, జీవనదిలాంటిది విశ్వపతి వాక్ప్రవాహం. అందులో పడి ఎంత దూరం కొట్టుకపోవలసి ఉంటుందో తెలియదు," అంటాడు కథకుడు. (పు. 82).

నాకు అద్భుతంగా అనిపించిన మరో అంశం - ఈ కథల్లో కథారచనకి సంబంధించిన వాక్యాలు చోటు చేసుకోడం. అవి రాజారాంగారి వ్యక్తిగతఅభిప్రాయాలు అవునో కాదో నాకు తెలీదు గానీ కథకుడుగా అక్కడక్కడ వెలువరించిన అభిప్రాయాలు, కాబోయే రచయితలు తప్పకుండా గమనంలోకి తీసుకోవాలి అనుకుంటున్నాను. ఉదాహరణకి

"మీరెలా రాస్తారండీ" అని అడిగితే, ఆయనజవాబు, "అదెంత పని లేవోయ్ కన్నారావ్! వ్రాయగలిగిన పేనా ఒకటి చేతిలో ఉండాలి. అందులో సిరా ఉండాలి. ఎవరైనా రాసి పారెయ్యొచ్చు." ఆ తరవాత మాత్రం ఆయనకి చిన్న బెదురు కలుగుతుంది. "ఈ కన్నారావు కరపత్రాలు, ఆకాశరామన్న ఉత్తరాలు మొదలైనవి రాసేవాళ్ళకున్నూ, కథలు, నవలలు మొదలైనవి వ్రాసేవాళ్ళకున్నూ స్వభావంలో తేడా ఏమాత్రముండదన్నట్టు భావిస్తున్నాడు!'' అంచేత వెంటనే, "ఏదైనా వ్రాయాలంటే దండిగా చదవాలోయ్, కన్నారావ్." (రుద్రభూమి పు. 323) అని హెచ్చరిస్తారు.

"గడచిపోయిన అధ్యాయంలో ఒకచోట కనిపించి తనను విస్మయచకితం చేసిన పాత్రయొక్క పునరాగమనంకోసం కుతూహలంతో వేచి ఉండడం పాఠకుడి స్వభావం. ఎంతకూ ఆ పాత్ర కథలోకి రాకపోతే కొంత నిరుత్సాహం తప్పదు." (ప్రజాపతి. పు. 80.)

"అతనికి నేను కృతజ్ఞుణ్ణి. కథ మొదటినుంచీ చెబుతాను." "(శివానందంతో) పరిచయం ఎలాంటి పరిస్థితుల్లో కలిగిందో చెబితే, ఈ కథలోని ముఖ్యపాత్రల్ని పరిచయం చేసినట్టవుతుంది." (కృతజ్ఞుణ్ణి! పు. 120).

"ఆదినుంచీ పూస గుచ్చినట్టు చెప్పాలంటే, యిది 'డూమ్స్ డే చిట్టా'లాంటి ఉద్గ్రంథమై పోయే ప్రమాదం ఉంది. మరైతే ఎక్కడ ప్రారంభించడం? నాపాలిటికిది పెద్ద కృత్యాద్యవస్థ అయిపోయింది. దీర్ఘాలోచన తర్వాత ఒక నిర్ణయానికి రాగలిగేను. కథ ఎక్కడ అయితే అడ్డం తిరుగుతుందో అక్కడినుంచే ప్రారంభించడం, అవసరాన్నిబట్టి వెనక్కి వెళ్లి మళ్లీ ముందుకు రావడం!" (యక్షప్రశ్న. పు. 205)

హాస్యం, వ్యంగ్యం పుష్కలంగా ఉన్నాయి ఈకథల్లో. "గరిమనాభినుంచి వస్తున్న సరళరేఖ ఆధారతలంలో పడడం లేదేమో, ఆమె ఒక్కొక్క మెట్టు దిగినప్పుడల్లా ఒక్కొక్క రకంగా వంపులు తిరిగిపోతోంది." (సుడిగుండం. పు. 41). "నామరూప గుణరహితుడైన భగవంతుడికిమల్లే ఆ వాక్యాల్లో కర్త, కర్మ, క్రియలు లేవు. ఎండమావిలో నీటికిమల్లే ఆ పదాలసముదాయానికి అర్థం లేదు. పటిష్టమైన ప్రభుత్వానికి నోచుకోని దేశంలో చెలరేగే అరాచకాలకుమల్లే ఆ కాగితాల్లో ఎక్కడబడితే అక్కడ కాపిటల్ లెటర్స్! ఎక్కడ చూసినా కామాలే! ఎక్కడ చూసినా ఫుల్‌స్టాపులే! మనవాళ్ళు కవుల్ని నిరంకుశులంటారు. కవులు నిరంకుశులైతే వాళ్ళపాపాన వాళ్లే పోతారు కానీ, ఈ విద్యార్థులసంగతి అలా కాదు. వీళ్ళు మనదుంప తెంచేస్తారు." పరీక్షల్లో కాపీ కొట్టడంగురించి, "బుర్ర గోక్కుంటే 'ఎ' అనీ, ఒళ్ళు విరుచుకుంటే 'బి' అనీ ... పెళ్ళికూతురికి మల్లే తల బాగా క్రిందికి వంచేస్తే ఆన్సరు 'డి' అనీ సుస్థిరంగా ఏర్పడిపోయిన సంకేతాలను." (**అంగరక్షకుడు**. పు. 109, 110). ఈ కాపీలసంగతి బహుశా ఈనాటి పాఠకులకి సుపరిచయమే కావచ్చు కానీ నాకు కొత్త.

ఒక వైద్యశాలముందు తప్పక దయ చేయండి అని బోర్డు ఉందిట. “ఇంకా నయం. శ్మశానందగ్గర, సుస్వాగతమన్న బోర్డు కట్టారు గాదు” అంటాడు కథకుడు. “’రోగపీడితులకు మనవి’ అంటూ ఒక హెడ్డింగు తగిలించి ఉంటే ఆ ప్రకటన మరీ అంత అసంగతంగా ఉండి ఉండేది కాదేమో!’’ కొంతకాలం అయినతరవాత చూస్తే, “ఒకసారి వచ్చినవారు తిరిగి వెళ్ళలేరు” అన్నవాక్యం జోడించి ప్రకటన పరిపూర్తి గావించాడు!” ఇలా ఎంతైనా చెప్పుకుపోగలను. నాకైతే చదువుతున్నంతసేపూ పట్టలేనంత నవ్వొచ్చింది.

చివరిమాటగా, వర్ధమానరచయితలకు ఒక ఉచిత సలహా. కథ ఎలా రాయాలని దిక్కులు చూసేవారికి మధురాంతకం రాజారాంగారి కథాసంకలనం గొప్ప పాఠ్యగ్రంథం కాగలదు. అభ్యాసంకొరకు ఏమి చేయాలంటే, ఆ ధర్మసూక్ష్మం ఇదుగో రాసుకోండి లేదా చదువుకుని గుర్తు పెట్టుకోండి.

1. ఒకొక పాత్రని ఎలా పరిచయం చేసేరు? పాత్రగురించి చెప్తున్నప్పుడు ఎటువంటి నుడికారం వాడేరు? సామెతలు ఏవిధంగా ఉపయోగించుకున్నారు? కొత్తవి ఎలా సమకూర్చుకున్నారు? ఒకొక సన్నివేశం వర్ణించడంలో ఏయే సంగతులు చెప్పేరు? ఎన్నివిధాలుగా చెప్పేరు? ముగింపులో కొసమెరుపుకోసం, పాఠకులని కేవలం సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తెయ్యడానికే చమత్కారవాక్యం రాసేరా? కథలో సందేశాన్ని ఒడుపుగా ముక్తాయించేరా? ఇవి జాగ్రత్తగా ఈ కథల్లో పరిశీలించి చూసి, జవాబులు చెప్పుకుంటే, రాజారాంగారికథలంత గొప్పకథలు రాయగలరో లేదో నాకు తెలీదు కానీ మంచి కథలు రాయగలరని మాత్రం చెప్పగలను.

రాజారాంగారికి అనేక పురస్కారాలు లభించేయని తెలుసు కానీ ఉత్తమ ఉపాధ్యాయుడుగా వచ్చిందో లేదో నాకు తెలీదు. రాకపోతే ఎందుకు రాలేదో కూడా నాకు తెలీదు. కానీ కాగితంమీద వచ్చినా రాకపోయినా, రాజారాంగారు

ఉత్తమరచయిత, ఉత్తమ ఉపాధ్యాయుడు, ఉత్తమ రచయితఉపాధ్యాయుడు, ఉత్తమ ఉపాధ్యాయరచయిత.

వారు తెలుగుసాహిత్యాభిమానులకి అందించిన ఈ కానుకకి కృతజ్ఞతాపూర్వక శతసహస్ర నమస్కారాలు చెప్పుకోడమే నేను చేయగలిగింది.

(ఏప్రిల్ 29, 2014).

# 15. మల్లాది వసుంధరగారి నరమేధము

మల్లాది వసుంధరగారు(1934-1993) రాసిన ఆరు చారిత్రక నవలలలో ఆమె రాసిన తంజావూరు పతనము ఆంధ్రాయూనివర్సిటీ నడిపిన చారిత్రకనవలలపోటీలో 1951లో బహుమతి పొందింది. వసుంధరగారు రాసిన చివరి నవల ఈ **నరమేధము** 1979లో ప్రచురించారు. ఈ నవలలో ప్రధానాంశం విష్ణుకుండినరాజు అయిన మాధవవర్మ అనేక యజ్ఞయాగాదుల చేసినతరవాత నరమేధము తలపెట్టడము. ఈ నరమేధము రెండు స్థాయిలలో జరుగుతుంది ఈ కథలో.

యజ్ఞసన్నాహాలవర్ణనలతో మొదలయిన ఈ నవలలో ఆద్యంతాలా ఈ నరమేధం ఎందుకు అన్న ప్రశ్న ప్రత్యక్షమవుతూనే వస్తుంది పాఠకులకు. విష్ణుకుండినులు శౌర్యశీలురు. వేదధర్మనిష్ణాతులు. రాజసూయాశ్వమేధాధి యజ్ఞములు ఎన్నో చేసినవారు. అన్ని చేసినతరవాత, తమరాజ్యంలో ప్రజలు సుఖంగా ఉన్నప్పుడు, మళ్ళీ మరొక యజ్ఞం, నరబలి కోరే యజ్ఞం తలపెట్టడం ఎందుకు అన్న ప్రశ్నకి నిజంగా సమాధానం లేదు.

"అన్ని యజ్ఞములతీరు వేరు, ఈ మహాయజ్ఞముతీరు వేరు" అంటారు కథకులు. ఈ యజ్ఞమునకు నియమములు ఎక్కువ. ఇక్కడ "యజ్ఞపశువుగా మానవుడు వరణీయుడు. యజ్ఞపశువు కాదగిన వటుడు కొన్ని విశిష్టలక్షణములు కలిగి పరిపూర్ణారోగ్యవంతుడై, విద్యావంతుడై, యజ్ఞయాగాది క్రతువులందు ఆదృతి కలవాడై, యజ్ఞపశువగుటకు తానై సమ్మతించవలెను" (పు.8).

మహారాజే స్వయంగా వెళ్ళి తన కోరికమేరకు యజ్ఞదత్తశర్మని నరమేధంకోసం తనతో పంపమని ఆ పిల్లవాడితండ్రి నరసింహాశర్మని కోరినప్పుడు మళ్ళీ ఆ ప్రశ్న వస్తుంది. నరమేధం ఎందుకు చెయ్యడం? అంటే చరిత్రలో నరమేధము చేసిన రాజులు ఉన్నారు. హరిశ్చంద్రుడు నరమేధము చేసేడు కదా. కానీ ఆ నరవధ జరగబోయేముందు విశ్వామిత్రుడు కలగజేసుకుని, శునశ్శేఫుడికి వరుణమంత్రం ఉపదేశించి, ఆయనకుమారుని ప్రాణాలు నిలబెడతాడు. అంచేత ఆ నరమేధం నరవధ లేకుండా ముగిసింది. నరసింహాశర్మ అనేక విధాల ఆ మహారాజుని ఆ నిర్ణయంనుండి మరలించడానికి ప్రయత్నిస్తాడు. యజ్ఞంకోసం ఇలా తమ ఏకైక సంతానం, వృద్ధిలోకి రావలసిన బాలుడు, వృద్ధాప్యంలో తమ ఆలనా పాలనా చూడవలిసినవాడు, అతనిని యజ్ఞపశువుగా బలి చేయడం తగునా? మాధవవర్మ మహారాజు ఇవ్వగల ధనకనకవస్తువాహనములు వారికి అవుసరం లేదు. వారిజీవికకు సరిపడు మాన్యములు వారికి ఉన్నాయి. (పు. 15).

మాధవవర్మ వాదం - తాను ప్రభువు, తాను తలపెట్టిన కార్యం పౌరులక్షేమంకోసం. నృసింహశర్మ పాలితుడు కనక ఆ క్రతువుకు కుమారుని త్యాగం చేయడం అతనిధర్మము. అంతే కాదు, తాను బలవంతంగానైనా ఆ బాలుని తీసుకుపోవడానికి సంసిద్ధుడు, సమర్థుడు. మాధవవర్మ ఇలా ఓ పక్కన వాదిస్తున్నా, మనసులో మాత్రం మధన లేకపోలేదు. “తానీ నరమేధమునెందుకు సంకల్పించినట్లు? పూర్వులెవ్వరు జేయనిదానిని తాను నిర్వహించితినను తృప్తి ననుభవించుటకా? లేక తన యాధిక్యమును వెలయించుటకా? హయమేధరాజసూయాది మహాధ్వరములకన్న నిది యధికతర ఫలదాయినియైనదా? తనకే సమగ్రముగ తెలియుట లేదు,” అనుకుంటూ, ఆ సదసద్సంశయములో కొట్టుమిట్టాడుతూనే, “ఇంత జరిగినది గనుక మిగిలినది జరుగవలెను” అని నిశ్చయించుకుంటాడు. ఈ సంశయం మహారాజుని చివరివరకూ వెన్నాడుతూనే ఉంటుంది. ఈ రెండు దృక్పథాలూ అలా ఉండగా,

మానవనైజమైన మరొక కోణం కూడా కనిపిస్తుంది. యజ్ఞదత్తశర్మని చూస్తున్నంతసేపూ మహారాజుకి యువరాజు గోవిందవర్మ మనసులో మెదులుతున్నాడు. యజ్ఞదత్తశర్మ "బాల్యము వీడుటకిష్టము లేనట్లున్న పాలు పొంగారు బుగ్గలు, నూనూగు మీసములు పొడసూపని మోము, సుదృఢమైన శరీరముతో మకరాంకమనోజ్ఞమూర్తివలె" ఉండి, గోవిందవర్మని తలపిస్తున్నాడు. తనకుమారుని తను బలి పెట్టలేడు. మరోవైపు, ఆ చిన్నవాడు "తాను ఆచరించబోయే మహాక్రతుఫలము రూపుగొని తనయెదుట సాక్షాత్కరించినట్టు" కూడా ఉన్నాడు.

ఇలా ఒక సన్నివేశాన్ని వివిధకోణాలనుండి పరామర్శించడంద్వారానూ, ఒక వ్యక్తి మనసులో తలలెత్తే వివిధ భావాలూ, విరుద్ధభావాలూ ఆవిష్కరించడంద్వారాను కథనం విశేషంగా మూర్తిమంతమై పాఠకులలో ఉత్సుకత రేకెత్తిస్తుంది.

నరమేధము పూర్తి అయి చాలాకాలం అయినతరవాత కూడా మహారాజుకి "క్రతువు సాకల్యముగా నెరవేరినదను" తృప్తి కలుగలేదు. క్రతుసమయంలో యజ్ఞదత్తుని రూపం ఆయనమనఃఫలకంమీద చెరగని ముద్ర వేసింది. "నిరీహుడై, నిర్మముడై, అంతర్ముఖుడై, యూపస్తంభమునకు కట్టినప్పుడు ఏ విధమైన ప్రాతికూల్యమును ప్రదర్శింపక స్థిరుడై నిలిచాడే కానీ బలిపశువులా గింజుకోలేదు." (పు. 44). ఆ బాలునితల్లి ఏడ్పులు మహారాజు శ్రవోరంధ్రముల మార్మోగుతూనే ఉన్నాయి చాలాకాలంతరవాత కూడా. అసలు ఈ యజ్ఞం ఎందుకు తలపెట్టినట్టు అని మళ్ళీ మళ్ళీ ప్రశ్నించుకుంటూనే ఉంటాడు చివరివరకూ.

మంత్రి పినాక భట్టారకునితో మరొకమారు సంప్రదిస్తాడు. "నరమేధమన్నచో మాకు స్పష్టార్థము గోచరించుట లేదు. సృష్ట్యాదినుండి సంగ్రామములు జరుగుచున్నవి. అసంఖ్యాకములుగ జనులు నిహతులగుచున్నారు. ... దేవ-దానవ, రామ-రావణ, కురు-పాండవ మహాహవముల నెంత నరమేధము జరిగినది! ... అట్టివేళల

మామనస్సున బాధాలేశము కలుగకపోగా నుత్సాహము దీపించెడిది. ... కాని నాటి యధ్వరమున యజ్ఞదత్తుడు బలిపశువై మరణించుచుండ నామనస్సు రగిలిపోయినది. ... ఎంత విచారించినను మామనస్సు సమాధానము కుదురకున్నది." (పు. 55).

భట్టారకునికి కూడా మొదట్లో ఈవిషయమై సందేహం ఉంది. ఎన్నో క్రతువులు మహరాజు చేసేరు కదా మళ్ళీ ఇదెందుకు అని ప్రశ్నిస్తాడు. కానీ ఇప్పుడు మహరాజు మళ్ళీ అదే ప్రశ్న తననే వేస్తే, జవాబు చెప్పక తప్పదు కదా. వారి పూర్వులు ఈ నరమేధము చేసి యశఃకాయులయేరని సమర్థింప చూస్తాడు. ఈ మాధవవర్మ ముత్తాతగారి తాత చేసేరు. ఇంకా ఎవరో చేసేరనే విన్నాడు. యజ్ఞాలు, యాగాలు రాజులు లోకకల్యాణార్థం చెయ్యాలి. ఏ కార్యం చేసినా అందులో తాము అభిలషించినదానితో పాటు అవాంఛనీయమైనది కూడా ఉంటుంది – ఇలా అందీ పొందని సమాధానం చెప్పి మహరాజుకి ఊరట కలిగించడానికి ప్రయత్నిస్తాడు.

మళ్ళీ మహరాజుకి ఈవిషయంలో తీవ్రమైన ఆందోళన కలిగింది యువరాజు గోవిందవర్మకి మరణశిక్ష విధించవలసినవచ్చినప్పుడు. పుత్రప్రేమతో యువరాజు ప్రాణాలు కాపాడడమా, మహరాజుగా న్యాయమైన తీర్పు ఇచ్చి ధర్మరక్షణ చేయడమా? న్యాయంగా మరణశిక్ష విధించి, యజ్ఞదత్తశర్మ తల్లిదండ్రులు ఆనాడు పడిన క్షోభ తలుచుకుంటాడు. ఇది వారి శాపఫలమేమోనన్న సందేహం కలుగుతుంది. తాను నరమేధము తలపెట్టకుండ ఉండవలసిందని కూడా అనుకుంటాడు.

రాణి చంద్రమతీదేవి పుత్రశోకంతో కృంగి, కృశించి మరణించింది. కోడలు సుదర్శనాదేవికి పుత్రశోకంతో మతి భ్రమించింది. "యజ్ఞదత్తుని బలిపశువుగ చేయకుండ నుండవలసినది. ఆ పుణ్యదంపతుల శాపములు తన కుమారునికి తగిలినవేమో" అన్న సందేహం మహరాజుని పట్టి పీడిస్తుంది. శత్రురాజులు సంకల్పించిన

దండయాత్రలు మరింత కృంగదీస్తాయి ఆ మహరాజుని. రాజ్యంతే నరకమ్ ధృవమ్ అని ఆర్యోక్తి. (పు. 201).

ఇలా చివరివరకూ తాను చేపట్టిన ఒక మహత్కార్యంగురించిన సందేహాలతో మాధవవర్మ సతమతమవడం ఈ కథలో ఒక ముఖ్య భాగం.

000

ఈ నరమేధంలో రెండోభాగం పల్లవరాజు మూడవ కుమారవిష్ణువు మనుమరాలయిన త్రిలోచన పల్లవిని తనతరఫున విష్ణుకుండినవంశజులమీద పగ తీర్చుకోమని నియమించడం. దక్షిణాపథంలో పల్లవరాజులు ఎదురు లేని మహారాజులు, శూరులు, బ్రాహ్మణ ప్రభువులు. వారిలో మూడవ కుమారవిష్ణువు గతంలో దక్షిణాపథమంతా గెలుచుకుని, తూర్పున విష్ణుకుండినులతో యుద్ధం చేసి, ఓటమిని అంగీకరించవలసివచ్చింది. ఆ ఓటమి ఆయనకి ఎదలో ముల్లై ఆమరణాంతం బాధించింది. వారి మనుమడు కుమారవిష్ణువు, మనుమరాలు త్రిలోచన పల్లవి.

త్రిలోచన పల్లవి వారి కులదేవత అయిన కామాక్షీదేవి అవతారము అని తాత విశ్వాసము. అంచేత త్రిలోచన పల్లవిమీద తన ఆశలన్నీ నిలుపుకుని, అన్నతో సమంగా క్షాత్రవిద్యలు నేర్పించాడు. ఇక్కడ మూడవ కుమారవిష్ణువు మనుమడిని కాదని, మనుమరాలయిన పల్లవిని పగతీర్చుకోడానికి నియమించడం గమనార్హం. ఆవిషయం త్రిలోచన పల్లవికి స్పష్టం చేస్తాడు కూడా. "ఎచట గాంచినను స్త్రీపాత్ర నాధారము చేసికొని ప్రళయాంతకమైన యుద్ధములు సాగినవి. స్త్రీబుద్ధిః ప్రళయాంతకః అని నానుడి". భారతంలో ద్రౌపది, రామాయణంలో కైకేయి, ఇలా ఎక్కడ చూసినా స్త్రీలే పగ సాధించడానికి మూలాధారం. ఆమె కారణజన్మురాలు. అందుకే విష్ణుకుండిన

వంశం నిర్వంశము చేయవలెనని, అది త్రిలోచన పల్లవే చేయాలనీ ఆయన ఆకాంక్ష (పు. 31).

ఈ కాంక్షలో కూడా మాధవవర్మ నరమేధములాగే కొంత అనుచితం ఉంది. అన్నగారయిన కుమారవిష్ణువు త్రిలోచన పల్లవితో ఆ విషయం ప్రస్తావిస్తాడు కూడా. తాతగారే విష్ణుకుండినరాజుమీదకి యుద్ధానికి వెళ్ళేరు కానీ అటునించి ఇటు కాదు. త్రిలోచన పల్లవి కూడా ఆ విషయమై మధనపడిన సమయాలున్నాయి. మాధవవర్మ నరమేధానికీ, ప్రతిజ్ఞ నేరవేర్చుకునే నెపంతో తాను తలపెట్టిన విష్ణుకుండిన వంశనిర్మూలనానికీ ఏమిటి తేడా? తాను పన్నబోయే వ్యూహంలో జరగగల ప్రజానాశనం కూడా నరమేధమే కాదా? మాధవవర్మలాగే త్రిలోచన పల్లవి కూడా ఈ తర్కానికి ఇది సమయం కాదని, విరుద్ధబావాలను పక్కన పెట్టేసి, తాను తలపెట్టిన కార్యాన్ని సాధించడమే పరమావధిగా ముందుకు సాగుతుంది. అదే చాణుక్యనీతి అని సమర్థించుకుంటుంది.

నరమేధానికి మాధవవర్మ తమని ఆహ్వానించడం తనపథకానికి అనుకూలం అయింది. క్రతుసమయంలో యజ్ఞదత్తశర్మ తల్లిదండ్రులు అనుభవించిన నరకయాతన, మాధవవర్మ కాఠిన్యమూ చూసేక అది అగ్నికి ఆజ్యమయి ప్రతిజ్ఞాపాలనాకాంక్ష మరింత బలపడింది.

ఆ సమయంలోనే త్రిలోచన పల్లవికి అనుకూలించిన మరొక సంఘటన. మాధవవర్మ నాల్గవ కొడుకు అయిన సునీతవర్మ. అప్పట్లో ఎవరు ఎవరో ఇద్దరికీ తెలియకపోయినా పరస్పరాకర్షణకి లోనవుతారు. ఆ పరిచయం కూడా త్రిలోచన పల్లవికి నరమేధంలాగే పరస్పరవిరుద్ధమైన భావాలకి దారి తీస్తుంది. వారిమధ్య జనించిన అనురాగాన్ని పగ తీర్చుకోడానికి ఉపయోగించుకోడం కథలో మరో మెలిక.

క్రతువు ముగిసినతరవాత తమదేశం వెళ్ళిపోయి, తిరిగి చెలికత్తెతో పురుషవేషం ధరించి విజయవాటికకి వచ్చి, అత్యంత నేర్పుతో అంతఃపురం ప్రవేశించి, రాజకుటుంబంలో అందరి అభిమానాన్ని చూరగొనడం ఒక యెత్తైతే సునీతవర్మతో ప్రణయం సాగించడం, వారిద్దరి మధ్య జరిగిన వాగ్వివాదాలు మనోరంజకంగా, నాటకీయంగా ఉండి పాఠకులని అలరించడం మరొక యెత్తు. ఈ సన్నివేశాల్లో రచయిత్రి కథ నడిపినతీరు మెచ్చకోక తప్పదు.

వారిమధ్య ఆకర్షణ అధికమవుతున్నకొద్దీ పల్లవికి మరొక చిక్కు సమస్య - సునీతవర్మమీద అనురాగం ఒకవైపు, తాతగారికిచ్చిన మాట మరొకవేపు. సునీతవర్మతో వివాహం తన పథకానికి అనుకూలంగా మలుచుకోవచ్చు కానీ వివాహం చేసుకుని విష్ణుకుండినులని నిర్వంశం చేయడం నమ్మకద్రోహం. ఇలా అనేకానేక ఆలోచనలతో సతమతమవుతూనే, తన పథకం నెరవేర్చుకోడంలో అసమాన ప్రతిభ చూపుతుంది త్రిలోచన పల్లవి.

అంతఃపురంలో రాణుల ఆదరాభిమానాలు పొంది వారిమధ్య ఈర్ష్యాసూయలు రేకెత్తించడం,  పొరుగు సామంతరాజులని తిరుగుబాటుకి ప్రోత్సహించడం – ఇవి సాధించడంలో త్రిలోచన పల్లవి రాజకీయపరిజ్ఞానం పాఠకులని ముగ్ధులని చేస్తుంది. ఆ సమయంలో పల్లవిలో చెలరేగిన అంతస్సంఘర్షణ కూడా శక్తిమంతంగా నిర్వహించేరు రచయిత్రి.

ముగింపుగురించి కొంత ఆలోచించవలసివచ్చింది. త్రిలోచన పల్లవి తన ప్రతిజ్ఞ నెరవేర్చుకుంది. విష్ణుకుండినులవంశం నాశనమయింది.

ఈ నవలకి పరచయంలో రచయిత్రి “ఏదియయిన యొక కర్మను ఫలాపేక్షతో చేసిన నది ఫలించును. నీ సంకల్పమునుబట్టి యాఫలము నావిధముగ దీపించును.

మహారాజుగ చేసిన నరమేధఫలితము రాజ్యమునకు సౌఖ్యఫలదాయినియై పైయక్తియై మాధవవర్మకు విపరీత ఫలదాయినియై పుత్రఘాతి యైనది.”

రాజ్యమునకు సౌఖ్యఫలదాయిని అయినభావం కలగలేదు నాకు చదవడం పూర్తి చేసిన తరవాత ఆలోచిస్తుంటే. ప్రజలు సుఖంగా ఉన్నారంటూ ఆవిష్కరించిన సన్నివేశాలుగా రెంటిని చెప్పుకోవచ్చు. మొదటిది మహరాజు యువరాజుకి మరణశిక్ష విధించినప్పుడు. యువరాజు అమితోత్సాహంతో అత్యంతవేగంతో నడుపుతున్న రథంక్రింద ఒక చిన్నవాడు పడి చనిపోతాడు. ప్రజలు న్యాయం కోరతారు. మహరాజు యువరాజుకి మరణధండన విధించి, తన ధర్మనిరతిని ఋజువు చేసుకుంటాడు. ప్రజలకి న్యాయం జరిగిందన్న తృప్తి కలిగింది. రెండో ఘట్టం - యువరాజు శిరచ్ఛేదన అయిన వెంటనే, “దుర్గాంబ మాధవ వర్మ ధర్మనిర్ణయమునకు సంప్రీతురాలై సువర్ణవృష్టిని గురిపించినది. మహారాజు ధర్మబుద్ధిని పొగడుకొనుచు ప్రజలెల్లరు ఆ నాణెముల నేరుకొనిరి!” (పు. 196). అంటే ప్రజలకి సంపద లభించింది. అంతకుమించి, జనసామాన్యంయొక్క జీవనవిధానం, శ్రేయస్సుగురించిన వివరణ లేదు. అయితే ఆ కనకవర్షంతో ప్రజలజీవనం సుఖమయిపోయిందా? సిరిసంపదలకీ సుఖజీవనానికీ సంబంధంలేదని చెప్పడానికి మాధవవర్మ, చంద్రమతీదేవి, కోడలు సుదర్శనాదేవి జీవితాలే నిదర్శనం.

ఈ రెండు సంఘటనలూ మొత్తం నవల చదివినతరవాత నామనసులో పడిన మారణకాండతాలూకు ముద్రలను చెరిపివేయగలిగినంత బలంగా లేవు.

000

ఇంతకుముందొక టపాలో వసుంధరగారి మరో రెండు నవలలగురించి సూచనప్రాయంగా ఒకటి, రెండు మాటలు చెప్పేను. అంతకంటే స్పష్టంగా ఇక్కడ మరొకసారి ప్రస్తావిస్తున్నాను.

సాంఘిక నవలలు కోకొల్లలుగా వచ్చిన 50వ దశకంలో క్లిష్టతరమైన చారిత్రక నవల రాయడానికి పూనుకున్న రచయిత్రిగా మల్లాది వసుంధరగారికి ప్రత్యేకస్థానం ఉంది తెలుగు సాహిత్యచరిత్రలో.

వసుంధరగారి తొలి నవల **తంజావూరు పతనము.** ఆంధ్రాయూనివర్సిటీవారు ఇంటర్మీడియట్ విద్యార్థులకి ఉపవాచకంగా ఉపయోగించుకోడానికి రచయితలని ప్రోత్సహించే ఉద్దేశంతో నడిపిన పోటీలో మల్లాది వసుంధరగారి తంజావూరుపతనము ప్రథమ బహుమతి పొందింది. అప్పటికి ఆమె వయసు 17 సంవత్సరాలంటే ఆమె ఉపజ్ఞ గ్రహించవచ్చు.

చరిత్రరచనలలో సాధారణంగా రాజులు, రాజ్యాలు, రాజ్యవిస్తరణ కాంక్షని ప్రస్ఫుటంచేస్తూ వారి జయాపజయాలు ఆవిష్కరింపడతాయి. అందుకు భిన్నంగా చారిత్రక నవలలో ఆ రాజులు, రాణులు, వారి జయాపజయాలవెనక వారి అంతర్మధనలు మరింత ప్రస్ఫుటంగా ఆవిష్కరింపబడి, వారిలోని మానవీయకోణాన్ని మనముందు ఉంచుతాయి. తంజావూరు పతనంలో విజయరామరాజు రాజ్యకాంక్షకంటే భోగభాగ్యాలు (ఉదాహరణకి ఆయన స్నానవిధులు, భోజన విశేషాలు), సౌందర్యపిపాస (స్త్రీలోలత్వము) ఎంతో విపులంగా వివరించేరు. అవి చదువుతుంటే రాజభోగం అంటే, అష్టైశ్వరాలంటే ఇవీ అనిపిస్తుంది.

మరొక ఉదాహరణ - ప్రబంధాలు చదవని పాఠకులకి కూడా పరిచితమయిన, రంగాజమ్మ రచించిన పద్యం -

ఏ వనితల్ మముందలుపనేమిపనో తమరాడువారుగా

రో, వలపించునేర్పెరుగరో, తమకౌగిలిలోననుండగా,
రావదియేమిరా విజయరాఘువ యంచిలుదూరి

బలిమి మై, తీవరకత్తెనై, తీసుకవచ్చితినా తలోదరీ.

ఈ పద్యంలో రంగాజమ్మ ఆత్మవిశ్వాసం, పాండితీప్రౌఢిమతోపాటు ధిక్కారం కూడా సుస్పష్టం. అయితే ఈ పద్యాన్ని ఈ కథలో ఒక ప్రధానాంశంగా మలచడం రచయిత్రిస్ఫూర్తికి తార్కాణం. విజయరామరాజు తనయందు సంపూర్ణంగా రాగబద్ధుడు అన్న అవగాహన ఉంది రంగాజమ్మకి. ఆమె చంద్రమతికి ఎటువంటి సవాలు పంపనక్ఖర్లేదు. కానీ ఆమె తన విద్వత్తునీ, విద్యావతిగా తనకు గల అహంకారాన్ని ప్రదర్శించుకోగల సమయం వృథా పోనీయ మనసొప్పలేదు. ఆచంద్రతారార్కం నిలిచిపోగల చక్కని చాటువు రచించి తనప్రజ్ఞని ప్రదర్శించుకుంది.

మహారాజ్ఞి చంద్రావతి జ్ఞానసంపద కూడా ఏమీ తక్కువ కాదు. ఆమె చక్రవర్తి చంద్రగుప్తుని కుమార్తె. విజయనగరసామ్రాజ్యపు పట్టమహిషి. రాజనీతితో పాటు సకలవిద్యలు నేర్చిన విదుషి. షట్కర్మలలో శయనేషు రంభా అయితే చాలదు. కరణేషు మంత్రీ కూడా. రంగాజమ్మ తనఅహాన్ని రెచ్చగొట్టి, తనసామర్థ్యాన్ని కించపరిచింది. స్త్రీగానూ మహరాణిగానూ కూడా తన వ్యక్తిత్వాన్ని ఋజువు చేసుకోడమే కాదు. పట్టమహిషిగా, యువరాజు మన్నారుదాసు తల్లిగా కూడా ఆమెకి తనగౌరవం నిలబెట్టుకోవలసిన అవుసరం ఉంది. ఆమె తన స్థానాన్ని ఋజువు చేసుకునే కార్యక్రమం చేపట్టింది. రాచకార్యాలలో జోక్యం కలుగజేసుకుని, రంగాజమ్మ అహాన్ని కించపరిచేవిధానం ఆలోచించింది. చారులని నియమించి రంగాజమ్మ పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకుంది. ఇది చాణుక్యనీతి. రాజ్యరక్షణకోసం మహరాజు

స్త్రీలోలుడయి, విందువినోదాలలో కాలం పుచ్చుతుంటే, మహారాణిగా చంద్రవతి ప్రవర్తన సమర్థనీయం. సామాన్యస్త్రీకి ఉండగల ఈర్ష్య మాత్రమే కాదు ఇక్కడ ప్రదానపాత్ర వహించింది.

కవిసామ్రాట్ నోరి నరసింహశాస్తిగారు శ్లాఘించిన నవల ఇది. ఆయన అభినందనవాక్యాలు చూడండి

"తంజావూరు పాలించిన ఆంధ్ర నాయకరాజులలో చివరివాడగు విజయరాఘవరాయ యాస్థానములో కవిత్వము, సంగీతము, నృత్యము, శిల్పము పరాకాష్ట నందుట చక్కగా పోషింపబడ్డది. కాని రాజు భోగలాలసత, వేశ్య రంగాజమ్మ యందు వ్యామోహము, ముఖస్తుతి యందు ప్రీతి, ఆస్థానకవులు స్తుతించుచున్నట్లు తాను నిజముగా భగవంతుడనే అనుకొనుట, శ్రీకృష్ణదేవరాయల యంతవాడనని గర్వించుట, తన అష్టమహిషులతో దక్షిణ నాయకత్వము సమర్థింపలేకుండుట, వెంకన్న కుట్ర కాననగుట ఏవిధముగా రాజ్యపతనమునకు దారితీసినవో అద్భుతముగా చిత్రింపబడినవి. పరమభక్తుడైన పెద్దిదాసు పాత్ర, అమాయకుడైన ఎల్లు సోమయాజుల రాయబారములు, యువరాజును బంధించినందున కోపోద్దీపితయైన పట్టమహిషి రాజగోపాలాంబిక విజృంభణము, విజయరాఘవనాయకునకు ఉంపుడుకత్తెగా ఉన్న రంగాజమ్మ తనకు సోదరియని చివరకు తెలిసినందున కలిగిన నిర్వేదము, పాఠకుల హృదయములలో చిరకాలము నిలిచిపోవును. ఈ నవల వసుంధర సర్వతోముఖ ప్రజ్ఞకు ప్రతీక." (నోరి నరసింహశాస్త్రి సాహిత్యం. 5వ సం. వ్యాసాలు).

ఏ రచయిత్రికి మాత్రం ఇంతకుమించిన ఆమోదముద్ర ఏముంటుంది?

**నరమేధము** నవలకి ముందు పరిచయంలో వసుంధరగారు "కథాసంవిధానమునకై కొన్ని విషయములు మార్చుట జరిగినది." చారిత్రక నవలలో ఇది సర్వసాధారణం.

కథనం రక్తి కట్టడానికి రచయితలు చరిత్రలోనుండి కటికరాళ్ళలాటి వాస్తవసంఘటనలు తీసుకుని, మనోరంజకంగా తీరిచి దిద్దుతారు. నోరి నరసింహశాస్త్రిగారు **రుద్రమదేవి**నవల కథాకాలం ఆరు సంవత్సరాలనుండి ఆరునెలలకి కుదించేనని చెప్పేరు. **నరమేధం**లో రచయిత్రి ఏ చారిత్రకవాస్తవాలను మార్చేరో చెప్పి ఉంటే బాగుండేది. ఈ విషయం నేను ప్రత్యేకంగా పరామర్శించడానికి కారణం - పల్లవులలో త్రిలోచన పల్లవుడు అని ఒక రాజు ఉన్నాడని నేలటూరి వెంకటరమణయ్యగారు చారిత్రకవ్యాసాల్లో రాసేరు. కథాకాలం చూస్తే, ఈ త్రిలోచన పల్లవుడు చంద్రగుప్తుడు, మాధవవర్మల సమకాలీనుడుగా కనిపిస్తున్నాడు. నా సందేహం, వసుంధరగారు ఆ త్రిలోచన పల్లవుడినే త్రిలోచన పల్లవిగా చిత్రించేరా అని. అలా అయితే అది చాలా పెద్ద మార్పు. మిగతా కథ అంతటికీ అది కీలకం. పైన చెప్పినట్టు, చారిత్రకనవలలో మార్పులూ చేర్పులూ అవసరమూ, సహజమూ అయినా, అవి ఏమిటో తెలిస్తే, పాఠకులకు వాస్తవచరిత్రయందు అవగాహన మెరుగు పడడానికి అవకాశం ఉంటుంది అని నేను అనుకుంటున్నాను. నేను వసుంధరగారి ప్రతిభావ్యుత్పత్తులని శంకించడం కానీ కించపరచడం గానీ చేయడంలేదు. కేవలం కుతూహలంతో మాత్రమే ప్రశ్నిస్తున్నాను.

బాష, శైలి, శిల్పం ఇత్యాదులగురించి రెండు మాటలు చెప్పి ముగిస్తాను.

భాషవిషయంలో “సరళగ్రాంథికమునే వాడితిని,” అన్నారు వసుంధరగారు. ఆమెని విశ్వనాథ సత్యనారాయణగారి శిష్యురాలంటారు సాహిత్యాభిమానులు. నేను విశ్వనాథ సత్యనారాయణగారి సాహిత్యం చదివింది తక్కువే కానీ నేను చూసినంతవరకూ భాషాపరంగా, భాషని ఉపయోగించుకోడంలో సత్యనారాయణగారి ప్రభావం ఈమెమీద ఉందేమో అనిపించింది. శిల్పందృష్ట్యా పరిశీలించి చూస్తే వ్యత్యాసాలు కనిపిస్తాయి. సత్యనారాయణగారినవలలో ఉండే మౌఖికసాహిత్యఛాయలు వసుంధరగారిరచనల్లో లేవు. కథ ఎత్తుగడ, నడక, ముగింపు నీటుగా ఇటుకమీద ఇటుక పేర్చి గోడ కట్టినట్టు

సమీకరిస్తారు వసుంధరగారు. ఆధునికరీతిలో మొత్తం నవల అంతా ప్రధానాంశంమీద కేంద్రీకృతమై సూటిగా నీటుగా సాగిపోతుంది.

వసుంధరగారి భాషాపాటవం మనోరంజకం. **తంజావూరుపతనం**లో మొదటి అయిదు పేజీలలో రచయిత్రి సహ్యాజనదీ, ఆ నదీతీరంలో తోట, ఆ తోటలో పెద్దిదాసు ఉంటున్న ఆరామం వర్ణిస్తారు. అందులో పదచ్ఛేదం చేసుకోవాల్సిన అవసరం రాలేదు కానీ ఆ తరులతా గుల్మాదుల పేరులు చూసి ఆశ్చర్యపోయేను నేను. అందులో  కవితాత్మ ప్రాణం పోసుకుంది. రచయిత్రి ముఖ్యపాత్రలనీ, నాట్యగత్తెలనీ వర్ణించినతీరు పాఠకులని మురిపిస్తుంది. నర్తకీమణులు ధరించిన ఆభరణాలూ, కాసె పోసి చీరె కట్టినతీరూ ఈనాడు ఊహించుకోడం కూడా కష్టమేనేమో.

నేను చదివిన మూడోనవల **పాటలి.** పై రెండూ చారిత్రకనవలలు అయితే ఇది చారిత్ర్యకకథా, ప్రేమకథా కూడా. గౌతమీపుత్ర శాతవాహనుడికీ మహారాష్ట్రులకీ మధ్య జరిగిన యుద్ధంచుట్టూ అల్లినకథ. ఇందులో కథానాయిక పాటలి బ్రాహ్మణయువతి. తండ్రి గ్రామణి అనగా గ్రామాధికారిట. ఆయన తన తమ్ముడిని గ్రామసంరక్షణకి నియమిస్తాడు. గ్రామరక్షణకోసం మరి ఆయనకి క్షాత్రం కూడా రావాలి కదా. ఆయన పాటలిని చేరదీసి క్షాత్రవిద్యలు కూడా నేర్పుతాడు. పాటలీ, శాతవాహనుడికొలువులో గూఢచారి అయిన పురందరుడూ – వీరి ప్రేమకథ.  ఇందులో పాటలి శక్తిసామర్థ్యాలు చిత్రించినవిధానంలో అద్భుతమైన పాండిత్యప్రకర్ష తెల్లమవుతుంది.

ఒక్కమాటలో తెలుగుభాషమీద, చరిత్రమీద, తెలుగు సాహిత్యంలో అభిమానం గలవారందరికీ ఒక అపురూపమయిన వరం మల్లాది వసుంధరగారినవలలు.

(మార్చి 15, 2014.)

# 16. ఒక దుష్టుడి మనోవేదన

## Marie Corelli's Sorrows of Satan

ఒక నవల మొదటిమారు చదివినప్పుడు కలిగిన ఉత్సాహం, ఆనందం, రెండోమారు అరవై ఏళ్ళతరవాత చదివితే ఉండదు సాధారణంగా . కారణం అదే వస్తువుతో రాసినకథలు అప్పటికి చాలా చదివి ఉంటాం. కథ ముందే తెలుసు కనక ఏమవుతుందో అన్న ఎదురుచూపు ఉండదు. రెండోది, వయసు, అనుభవాల మూలంగా అభిరుచులు మారిపోతాయి. అప్పట్లో అద్భుతంగా కనిపించిన నవల రెండోసారి ఒస్, ఇంతేనా అనిపించవచ్చు.

నేను అరవై ఏళ్ళక్రితం చదివిన Sorrows of Satan అన్న నవల ఐదు రోజులక్రితం తీసుకుని ఐదురోజుల్లో పూర్తి చేసేసేను 470 పేజీలు. అంటే నా రికార్డు నేనే అధిగమించిపోయేను. దానికి కారణం ఆ కథలో వస్తువు ఈ నాటికీ వాస్తవమే కానీ అంతకుమించి రచయిత్రి రచనాపాటవం.

రాయల్ ఇంగ్లిషు ఆ కాలానికి అనుగుణంగా ఉన్నా, రచయిత్రికి భాషమీద గల పట్టు ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ప్రతి సన్నివేశం నాటకీయంగా, మన కళ్ళముందు జరుగుతున్నట్టు, ప్రతి వాక్యం ఉత్తుంగతరంగంలాగానో జాతి సర్పం జరజర పాకిపోతున్నట్టుగానో సాగిపోతుంది కథనం. ఉదాత్త భావాలు నర్మగర్భంగా వాక్యాల్లో పొదగడం ఆమెదగ్గర్నుంచి నేర్చుకోవాలి.

ఈనవల ప్రచురణ 1899లో. రచయిత్రి పేరు Marie Corelli (1855-1924). ఆమెకి ఆనాటి సమాజంగురించిన అవగాహన, మానవనైజంగురించిన అవగాహన ఉండడం

ఒక ఎత్తు అయితే, దాన్ని పాఠకులని ఆకర్షించేలా ఆవిష్కరించగలగడం మరో ఎత్తు. ఈ నవలలో ప్రధానాంశం మానవుడి నైతికపతనం.

సైతాను ఎవరు, అతనికి sorrow ఏమిటి? అన్న ప్రశ్నకి సమాధానం మధ్యలో తెలుస్తుంది కానీ చదువుతున్నప్పుడు ఎక్కడికీ ప్రయాణం, ఏది గమ్యం అన్న ప్రశ్నలు పాఠకుడిలో కలగవు అంటే కారణం ఆమె రచనావైదగ్ధ్యమే. మరో రెండు నవలలు కూడా వెనకటిరోజుల్లోనే చదివేను. వీటన్నిటిలోనూ నన్ను ముఖ్యంగా ఆకట్టుకున్నది ఆ లక్షణమే. ప్రతివాక్యం వచనకవితలా సాగిపోతుంది. ప్రతివాక్యంలో చమత్కారం, ఎత్తిపొడుపు, హేళన, సమకాలీనసమాజంమీద విసుర్లు మాత్రమే కాక, మనిషి అంతరాంతరాలలోకి తొంగి చూస్తూ ఆ వ్యక్తిత్వాలు మనోహరంగా చిత్రించిన రచయిత్రి.

ఈ నవలకి మూలం బైబిల్‌లోని Lucifer కథ. ఈ నవలలోనే ఒక పాత్ర మరొక పాత్రకి వివరించినట్టు చూపించడం జరిగింది. మూలకథ నాకు తెలీదు కానీ ఈ నవలలో వివిరించినదేమిటంటే—భగవంతుడు లూసిఫర్ని సృష్టించినతరవాత మానవులని సృష్టించేడు. లూసిఫర్‌కి అది కంటకప్రాయమయింది. ఈర్ష్యతో భగవంతుడిని నిందించడంతో  భూలోకంలోకి వచ్చి పడ్డాడు. మరి విముక్తి ఎప్పుడు అంటే, మంచి చెడ్డలవిచక్షణ జ్ఞానం, తనకి తగినది ఎంచుకోడానికి స్వేచ్ఛ గలిగిన మానవుడు లూసిఫర్ ఎర చూపిన ప్రలోభాలకి లొంగక, ఋజువర్తనకి కట్టుబడి ఆ ప్రలోభాలని తిరస్కరించినప్పుడు. ఈ కథలో ఇది మతసంబంధమైన చర్చలో భాగంగా పాఠకులకి తెలుస్తుంది. ఈ ఉపకథ పాత్ర అంతవరకే. తరవాత కథంతా మాత్రం ఆనాటి సమాజంలో జరుగుతున్న అక్రమాలని, దురంతాలని, వాటివెనక మనకళ్ళకి పొడగట్టిన మానవనైజం అడుగుపొరలు చిత్రించడం జరిగింది.

మామూలుగా నేను అభూతకల్పనలు, Sci-Fi చదవను. కానీ ఆ అభూతకల్పనలని ఆధారం చేసుకుని, 19వ శతాబ్దం ఉత్తరార్థంలో సామాజికపరిస్థితులని, సాహిత్యరంగంలో ధనానికున్న ప్రాముఖ్యతని చిత్రించడంలో రచయిత్రి ప్రదర్శించిన ప్రజ్ఞవల్ల నన్ను ఈ నవల ప్రత్యేకంగా ఆకట్టుకుంది.

రచయిత్రిశైలిలో రెండు విశేషాలు—మొదటిది భాష. అసలు భాష అంత బలంగా నామీద ముద్ర వేయకపోతే నేను మళ్ళీ చదివేదాన్ని కాదు. ప్రతి వాక్యం భావగర్భంగా వచనకవితలా సాగుతుంది అని ముందే చెప్పేను. రెండోది ఆమెకి మానవస్వైజాన్ని అర్థం చేసుకుని వచనకవితలాటి భాషలో చిత్రించడంగల చాకచక్యం, భిన్న అభిప్రాయాలని మనసుకి ఆకట్టుకునేలా పాఠకులకి అందించడంలో నేర్పు.

కథలో నాలుగు పాత్రలు –

కథానాయకుడు Geoffrey Tempest—ఉన్నతాశయాలతో మానవుల అభ్యున్నతికోసం, మానవుడిని అభ్యుదయంవేపు నడిపించగల నవలలు రాయడానికి పూనుకున్న రచయిత. ఆర్థికంగా ఇంటి అద్దె అయినా ఇచ్చుకోగల స్తోమతు లేనివాడు. అతని అభిప్రాయంలో స్త్రీలు మగవారిసేవకీ, ఇల్లు చక్కదిద్దుకోడానికీ పుట్టేరు. రచనలాటి ప్రక్రియలకి అస్సలు తగరు. ఎవరైనా రాయడానికి పూనుకుంటే, వారు unsexed అంటాడు.

Lucio Rimanez  అపార మేధస్సు, ధనమూ, చూపరులనాకట్టుకోగల రూపమూ, ఎంతటి పెద్దవారిచేతనైనా ఏ పనైనా చేయించగల చాకచక్యమూ గలవాడు. మాటల్లో వ్యంగ్యం, కరుకుదనం, తీక్షణమైన చూపులూ గలవాడు. మరొకస్నేహితునిద్వారా జఫ్రీకి పరిచయమై, అతను ఆశిస్తున్న పుస్తకప్రచురణ, దానితో రాగల ఖ్యాతి

సమకూర్చిపెట్టడానికి పూనుకుంటాడు. దానికి జఫ్రీ అంగీకరించడం కథలో ప్రధానమైన మెలిక.

Sybil – బతికి చెడిన Earl of Elton కుమార్తె. ఆమెతో జఫ్రీవివాహం రిమసెజ్ ఏర్పాటు సమాజంలో అతని స్థాయి పెంచడానికి. సిబిల్ దాన్ని వ్యాపారసంబంధమైన ఒప్పందంగానే గ్రహిస్తుంది. ఈ పాత్ర పరిచయం చేసినప్పుడు ఇలాటి ఆలోచనమూలంగా ఆమె అంటే పాఠకులకి సానుభూతి కలగదు కానీ చివరలో ఆమె అలా తయారు కావడానికి వెనక గల పరిస్థితులు తనే వివరించినతరవాత మన సమాజంలో అవకతవకలూ, పిల్లలమీద వాటి ప్రభావం మనకి అర్థం అవుతాయి. ఆ పరిస్థితులు ఈనాటికీ అలాగే ఉండడం కాదు, అంతకంతకీ అర్థ్వాన్నంగా ఉన్నాయి.

నాలుగో పాత్ర Mavis Clare. ఆమె సమాజానికి దూరంగా చిన్న కాటేజిలో రెండు జాతికుక్కలతోనూ, ఇంటిచుట్టూ పక్షులనీ పువ్వులనీ పెంచుకుంటూనూ ప్రశాంతంగానూ జీవితం గడుపుకుంటూ ఉంటుంది. ప్రచురణకోసం, ప్రచారంకోసం రచయితలకి తప్పనిసరి అయిన నెట్వర్కింగ్, డబ్బు సంతర్పణలూ లాటివేమీ లేకుండా కేవలం పాఠకులఆదరణతోనే అసమాన ఖ్యాతినార్జించుకున్న రచయిత్రి.

కథంతా ఈనాలుగు పాత్రమధ్యే నడిచినా, ప్రధానంగా కథ జఫ్రీ పతనంతో మొదలయి అతనికి జ్ఞానోదయం కలగడంతో ముగుస్తుంది.

ఇలా చెప్పినప్పుడు-సూక్ష్మంగా డబ్బూ, మనిషీ కథ అని అనిపించినా పైన చెప్పినట్టు, రచయిత్రి కథనవిధానం, మనకి ఆలోచించుకోడానికి అందించిన భావజాలం మూలంగా ఇది ప్రత్యేకత సాధించుకుంది. అనేక విషయాలమీద వాదోపవాదాలు రెండు ప్రక్కలనించి చిత్రించడంలో కొరెలీ సామర్థ్యం కనిపిస్తుంది.

నాకు నచ్చిన మరో అంశం పాత్రల ఆత్మశోధన. ఒకొకప్పుడు తనలో తను, మరొకప్పుడు మరొకపాత్రతో మాటాడుతూనూ, “నేను ఇలాటి మనిషిని” అని వర్ణించుకోడంలో మనకి రెండు కోణాలు కనిపిస్తాయి–తనమీద తనకున్న అభిప్రాయం, మనకి ఆ పాత్రమీద ఉన్న అభిప్రాయం. పాత్రల మనసులోని భావాలని చిత్రించడంలో కూడా కొరెలీ గొప్ప నేర్పు చూపిస్తుంది. నిత్యజీవితంలో ఇంత విస్తృతంగా వ్యక్తిత్వాల చర్చ జరగకపోవచ్చు కానీ ఏదో ఒక సమయంలో ప్రతివాడికీ నేనెలాటి వ్యక్తిని అన్న చర్చ మనసులో జరుగుతుందనే అనుకుంటాను.

జీవితంలోంచే కథలొస్తాయి. మరీ కొరెలీ జీవితానికీ ఆమె సృష్టించిన పాత్ర మేవిస్ క్లేర్ జీవితానికీ కొన్ని సామ్యాలున్నాయి. కొరెలీకి కుటుంబంలేదు. ఆమె రచనలని కూడా ఆనాటి సమాజంలో బుధవరులు క్రూరవిమర్శపాలు చేసేరు. ఆమె కూడా సమాజానికీ, అధికారపూరిత సాహితీశేఖరులకీ దూరంగా ఏకాంతవాసం గడిపింది. ఆమెకి విశేషంగా ఖ్యాతి తెచ్చిన నవల Sorrows of Satan. ఆమె ఇతరనవలలలో Thelma (రొమాంటిక్) చదివేను. వాటిలో కూడా ఇలాగే కొంత అభూతకల్పన ఉంటుంది కానీ దాన్ని ఆమె సమకాలీనసమాజం చిత్రించడానికి ఉపయోగించుకున్న తీరు ప్రశంసనీయం. ముగింపులో జఫ్రీకి జ్ఞానోదయమయి, రిమనెజ్ కి దూరం అయినతరవాత, రిమానెజ్ ఒక ప్రముఖ మెంబర్ ఆఫ్ పార్లమెంటుతో పార్లమెంటు భవనంలోకి ప్రవేశించడం మరొక గొప్ప చమత్కారం.

ఆమె శైలికి ఉదాహరణగా కింద కొన్ని భాగాలు ఇస్తున్నాను. ఇవి గుటెన్బర్గ్.ఆర్గ్ వారి సైటులోంచి కిండిల్ కాపీలోంచి తీసుకున్నవి. ఇక్కడ కొన్ని అక్షరాలు గల్లంతయేయి. ఇతర సైటులోంచి తీసుకుంటే మంచి కాపీ రావచ్చు.

సమకాలీన సాహిత్యంగురించి కొన్ని వాక్యాలు -

"What put it into your head, my dear Tempest, to write a book dealing with, as you say, * the noblest forms of life* ? There are no noble forms of life left on this planet,—it is all low and commercial,—man is a pigmy, and his aims arg" pigmy like himself. For noble forms of life seek other worlds !—there are others. Then again, people don't want their thoughts raised or purified in the novels they read for amusement—they go to church for that, and get very bored during the process. And why should you wish to comfort folks who, out of their own sheer stupidity generally, get into trouble? They wouldn't comfort7^7^,—they would not give you sixpence to save you from starvation. My good fellow, leave your quixotism behind you with your poverty. Live your life to yourself,—if you do anything for others they will only treat you with the blackest ingratitude,—so take my advice, and don't sacrifice your own personal interests for any consideration whatever."

- Marie Corelli. The Sorrows of Satan (Kindle Locations 585-591). J. B.

Lippincott company.

If it is to succeed by itself, it must not attempt to be literature,—it must simply be indecent. As indecent as you can make it 4 without offending

advanced women,—that is giving you a good wide margin. Put in as much as you can about sexual matters and the bearing of children,—in brief, discourse of men and women simply as cattle who exist merely for breeding purposes, and your success will be enormous. There's not a critic living who won't applaud you,—there's not a s school-girl of fifteen who will not gloat over your pages in the silence of her virginal bedroom !"

- Marie Corelli. The Sorrows of Satan (Kindle Locations 576-583). J. B.

Lippincott company.

స్త్రీ అంటే జఫ్రీ ప్రకటించిన అభిప్రాయం ఆనాటి సమాజంలో కొందరి అభిప్రాయం కావచ్చు –

"I myself have no sympathy with the new ideas that are in vogue concerning the intellectuality of woman. She is simply the female of man,—she has no real soul save that which is a reflex of his, and being destitute of logic, she is

incapable of forming a correct opinion on any subject. All the imposture of religion is kept up by this unmathematical hysterical creature,—and it is curious, considering how inferior a being she is, what mischief she has contrived to make in the world, upsetting the plans of the wisest kings and counsellors, who as mere men, should undoubtedly have mastered her!

- Marie Corelli. The Sorrows of Satan (Kindle Locations 665-669). J. B. Lippincott company.

మేవిస్ ఖ్యాతి చూసి, ఈర్ష్యతో కువిమర్శ రాసి, ప్రచురించి, తన దుగ్ధ తీర్చుకున్న జఫ్రీ ఆమెని ప్రత్యక్షంగా చూసినప్పుడు, అతని ఆలోచనలు -

the woman I saw was Mavis Clare. That small head was surely never made for the wearing of deathless laurels, but rather for a garland of roses (sweet and perishable) twined by a lover's hand. No such slight feminine creature as the one K 19 I now looked upon could ever be capable of the intellectual

grasp and power of * Differences/ the book I secretly admired and wondered at, but which I had anonymously striven to * quash' in its successful career. The writer of such a work, I imagined, must needs be of a more or less strong physique, with pronounced features and an impressive personality.

- Marie Corelli. The Sorrows of Satan (Kindle Locations 3879-3886). J. B. Lippincott company.

Geoffrey రాసిన విమర్శ చూసినా, మేవిస్ అతనిని సాదరంగా ఇంట్లోకి ఆహ్వానిస్తుంది. జఫ్రీ విమర్శకులగురించి ఆమెఅభిప్రాయం అడిగితే, ఆమె నవ్వి తను వారిని పావురాళ్ళతో పోలుస్తానంటుంది -

Here are my reviewers !'* she said laughing. " Are they not pretty creatures? The ones I know best are named after their respective journals,—there are plenty of anonymous ones of course, who flock in with the rest. Here, for instance, is the * Saturday Review,' " and she picked up a strutting bird with coral-tinted feet, who seemed to rather like the attention shown to him. " He

fights with all his companions and drives them away from the food whenever he can. He is such a quarrelsome creature !"—^here she stroked the bird's head. " You never know how to please him,—he takes offence at the corn sometimes, and will only eat peas,

- Marie Corelli. The Sorrows of Satan (Kindle Locations 4064-4067). J.

B. Lippincott company.

Marie Corelli జీవిత విశేషాలూ, రచనావిశేషాలూ వికిపీడియాలో చూడండి.

http://en.wikipedia.org/wiki/Marie_Corelli.

(అక్టోబరు 5, 2013)

# 17. తెల్లతోలు గల నల్లవాడిఆంతర్యం

James Weldon Johnson's An Autobiography of an ex-Colored Man

An Autobiography of an ex-Colored Man అన్న పుస్తకం పూర్తి చేసేక నాకు కలిగిన మొదటి సందేహం ఇది రచయిత ఆత్మకథ అవునా కాదా అని. మామూలుగా autobiography అంటే ఆత్మకథ అనే కదా అర్థం. ఈ పుస్తకం మొదటిపేరాలో రాసిన వాక్యాలు-"ఊరుపేరు చెప్పను ఆఊళ్ళో కొందరు బాధ పడతారని" లాటివి కూడా అదే అభిప్రాయాన్ని కలిగిస్తాయి. కానీ ప్రచురణకర్తలు దీన్ని నవల అన్నారు. ఇది 1912లో James Walden Johnson (1871-1938) ప్రచురించిన పుస్తకం.

రెండోది ex-colored అన్న విశేషణం. ఎక్స్ బార్యలూ, ఎక్స్ భర్తలూ ఉండడానికి అవకాశం ఉంది కానీ పుట్టినజాతి స్థిరం కదా. అది ఎక్స్ ఎలా అవుతుంది. ఇలాటి సందేహాలతో వాస్తవమో, కల్పనో అర్థం కాని ఈ పుస్తకం చదవడానికి పూనుకున్నాను. పైగా రాసి వందేళ్ళు కావడంచేత కూడా నాకు మరింత కుతూహలం.

ఈ పుస్తకంమీద చూసిన తరవాతే ఇది చాలా గొప్ప ప్రాచుర్యం పొందిన పుస్తకం అనీ, దీన్ని కాలేజీలు టెక్స్‌టుబుక్‌గా ఆదరించాలని కొందరు కోరుతున్నారనీ కూడా తెలుసుకున్నాను.

అంతర్జాలంనిండా దీన్ని గూర్చిన చర్చలు ఇంగ్లీషులో చాలా ఉన్నాయి కనక అదంతా ఇక్కడ మళ్ళీ రాయను. ఈ పుస్తకం లేక నవలలోనన్ను విశేషంగా ఆకట్టుకున్నవి - అమెరికాలో నీగ్రోజాతివారి ప్రవృత్తులూ, అవి అలా రూపు దిద్దుకోడానికి వెనక గల కారణాలూ, ఆనాటి సామాజికపరిస్థితులలో వారి మనస్తత్వవిశ్లేషణ. అవి విదేశాల్లో

ఉన్న భారతీయుల జీవనసరళి, ప్రవృత్తులతో పోల్చడానికి వీలుగా ఉన్నాయా లేదా, ఎక్కడ తేడా ఉంది లాటి విషయాలు మనసులో పెట్టుకుని చదివేను. అంచేత, ఇక్కడ నేను స్పృశించే భాగాలు తదనుగుణంగానే ఉంటాయని గ్రహించాలి.

సూక్ష్మంగా కథ ఒక తెల్లజాతి స్త్రీకి తెల్లతోలు గల కుమారుడుంటాడు. అతడే కథానాయకుడు. ఉత్తమపురుషలో అమెరికాలో నీగ్రోజాతి జీవనసరళిని విశ్లేషణాత్మకంగా చర్చించడం ఇందులో ప్రధానాంశం. అతనిపేరు మనకి తెలీదు. పదకొండేళ్ళప్పుడు స్కూల్లో ప్రిన్సిపాల్ చెప్పేవరకూ తాను నల్లవాడినని అతనికి తెలీదు. తల్లిని అడుగుతాడు కానీ ఆవిడ కూడా వివరాలేమీ చెప్పదు, తండ్రి "పెద్దమనిషి" అని తప్ప. అప్పుడే మొదలవుతుంది తనజాతిగురించి తెలుసుకోవాలన్న తపన. స్కూల్లో మాత్రం నల్లపిల్లలని చూసినప్పుడు తాను వారిలో ఒకడిని అన్న ధ్యాస తక్కువే. "వారిని" నిశితంగా పరిశీలిస్తూ ఉంటాడు. చురుకైనవాడు కావడంవల్ల సాటి పిల్లలకీ, పెద్దలకీ అభిమానపాత్రుడవుతాడు. స్వయంకృషితో పియానో వాయించడం నేర్చుకుని ప్రతిభావంతుడుగా పేరు తెచ్చుకుంటాడు. స్కూలు చదువు అయినతరవాత, హార్వర్డులో చేరడానికి అర్హతలున్నా డబ్బు లేక, అట్లాంటాకి వెళ్తాడు. అనతికాలంలోనే చదువుమాట వదిలేసి, తనజాతి సంస్కృతి అర్థంచేసుకునే కోరికతో నల్లవారితో సావాసం చేసి, నల్లజాతికి ప్రత్యేకమైన rag music, cake-walk dance గురించి తొలిసారిగా తెలుసుకుంటాడు. వాళ్లతో సమానంగా జూదం ఆడ్డం నేర్చుకుని త్వరలోనే ఆరితేరి, అదే జీవనమార్గంగా కొంతకాలం గడుపుతాడు.

Classical సంగీతాన్ని  rag music బాణీలో పియానోమీద వాయించి, తెల్లవారి అభిమానం కూడా గెల్చుకుంటాడు. ఒక మిలియనీర్ అతని ప్రతిభకి ముగ్ధుడయి. చేరదీస్తాడు. తనతో విదేశాలకి తీసుకెళ్తాడు. కథకుడికి, ఇతరసంస్కృతులని పరిశీలించడానికి అవకాశం కలుగుతుంది. ఫ్రాన్స్, ఇంగ్లండ్ వంటి దేశాల్లో కూడా తన

జాతి సంస్కృతి ఎలా పరివర్తన పొందుతోందో చూస్తాడు. అక్కడ అతను ప్రస్తావించిన కొన్ని వాక్యాలు చూడండి. Adaptation నల్లవాడికి చాలా చక్కగా పట్టుబడిన విద్య. లండనులో తెల్లవారికంటే నల్లవాడే perfect gentleman. ఫ్రాన్సులో ఫ్రెంచివాడికంటే, నల్లవాడే ఎక్కువ French మనిషి!

లండన్లో ఒక కచేరీలో తాను rag music బాణీలో classic ప్రదర్శించి ప్రేక్షకులమన్ననలు పొందితే, మరొక పండితుడు rag music classic బాణీలో పియానోమీద వాయించి, అందరిచేత శభాష్ అనిపించుకుంటాడు. కథకుడికి కూడా అది అద్భుతం తోస్తుంది. ఆ తరవాత తిరిగి అమెరికా వచ్చి, తనజాతిని ఉద్ధరించే కార్యక్రమం చేపట్టడానికి నిశ్చయించుకుంటాడు. మిలియనీరు అతన్ని నిరుత్సాహపరుస్తాడు, "నువ్వేదో అనుకుంటున్నావు కానీ నువ్వు తెల్లవాడివే సుమా," అని హెచ్చరిస్తాడు. తిరుగుప్రయాణంలో వృద్ధుడయిన ఒక North soldier ఒక Texanతో వాదనకి తలపడతాడు నల్లజాతి విషయంలో. ఈ విషయంలో ఆ సోల్జర్ వెలిబుచ్చిన అభిప్రాయాలు గమనార్హం.

> "The Anglo-Saxon race has always been and will be the masters of the world, and the niggers in the South ain't going to change all that record of history" అని old soldier from the North వాదన. చరిత్ర పరిశీలించినా అదే అర్థమవుతుందంటాడు.
>
> "Can you name a single one of the great fundamental and original intellectual achievements of which have raised man in the scale of civilization that may be credited to the Anglo-Saxon? The art of letters, of poetry, of music, of sculpture, the science of mathematics, of astronomy, of philosophy, of logic, of physics, of chemistry, the use of the metals, and the principles of mechanics, were all invented or discovered by darker and what we now call inferior races and nations. We have carried many of these to their highest point or perfection, but the foundation was laid by others. Do you know know the only original contribution to civilization we can claim is what we have done in steam and electricity and in making implements of war more deadly?"

(Johnson, James Weldon (2012-05-12). The Autobiography of an Ex-Colored Man (p. 79). Kindle Edition.)

ఇది నిశితంగా ఆలోచించవలసిన విషయం. ఈ వాదనలో ఎంత బలం ఉందో నాకు తెలీదు కానీ ఇక్కడ కథకుడు "we" అనడం నాకు ప్రత్యేకంగా కనిపించింది. వాదన చాలాసేపు జరిగినా, అతను ఏదో ఒక పార్శ్వం మాత్రమే వాదించకుండా, కేవలం ప్రేక్షకుడుగానూ, లేఖకుడుగానూ ఉండిపోయేడు. తనదేశం తిరిగి వచ్చేక, దేశసంచారం చేస్తూ అనేక విషయాలు తెలుసుకున్నాడు. అనేక సంఘటనలు సూక్ష్మదృష్టితో పరిశీలించి చూసేడు. తనకి నచ్చిన తెల్ల అమ్మాయి కనిపించేక, పెళ్ళికి ముందే తాను నల్లవాడినని తెలియజేసేడు. ఆ అమ్మాయి అప్పటికి షాకు తిని వెళ్ళిపోయినా, తరవాత పెళ్ళికి ఒప్పుకుంటుంది. ఇద్దరు పిల్లలు కలుగుతారు. కథకుడికి మళ్ళీ సదసత్సంశయం – పిల్లలకి తన వంశంగురించి చెప్పాలా వద్దా అని. ఇక్కడే నాకు కథకుడి నిజాయితీగురించిన సందేహం కలిగింది. అతని సందేహానికి మనం ఎలా టీక చెప్పుకోవాలి? మొదట్నుంచీ నల్లజాతిగురించి కథకుడికి కలిగిన సందేహాలూ, కుతూహలం కేవలం పాండిత్యధోరణికి చెందినదా? లేక ఇది నాజాతి, నాజాతిచరిత్ర నేను తెలుసుకోవాలి అని చేసుకున్న ఆత్మశోధనా?రెండోదే నిజమైతే, ఆయన నిజాయితీని శంకించవలసివస్తుంది. కానీ నల్లజాతివారు ఆయన్ని చాలా గౌరవంగా చూస్తున్నారు. నీగ్రో జాతి జాతీయగీతం రచించినకీర్తి ఆయనకి దక్కింది.

ఇప్పుడు నేను ఆదిలో ప్రస్తావించినవిషయం చూద్దాం. విదేశాల్లో ముఖ్యంగా అమెరికాలో ఉన్న తెలుగువారివిషయంలో మనం పరిశీలించవలసింది – 1. సాంఘిక సంధానం, 2. సంస్కృతికి సంబంధించినవి – భారతీయ సంగీతం, నాట్యం, ఆహారం, దుస్తులు, భాష – ఇలాటివిషయాల్లో తెల్లవారికి ఆసక్తి కలిగించడం. వీటివిషయం నేను అట్టే చెప్పక్ఖర్లేదు. ఇండియన్ రెస్టారెంట్లు బాగానే ప్రాచుర్యంలోకి వచ్చేయి. భాష కనీసం యూనివర్సిటీల్లో కనిపిస్తోంది. ఆమధ్య హాలివుడ్‌లో Indian Film Festival జరిపి,

భారతీయతారలని అమెరికనులకి పరిచయం చేసేరు. విమర్శకులు మెచ్చుకున్నారు వీలున్నంతమేరకి.

తెలుగువాళ్ళు మెడిసిన్, ఇంజినీరింగ్ రంగాలలో మాత్రమే కాక ఇతర రంగాల్లో– రాజకీయ, ఆర్థిక, సామాజిక, సమాచార రంగాల్లో కూడా కనిపిస్తున్నారు. 60, 70 దశకాల్లో పేర్లు అమెరిన్ తీరులోకి మార్చుకున్నారు కానీ 90వ దశకంలో చక్కని తెలుగు ఇంటిపేర్లతో సహా కనిపిస్తున్నాయి. ఇవన్నీ బాహ్యదృష్టికి తేలిగ్గా విశేషాలు. ఆత్మనా, తెలుగువారం అంటూ ఆత్మగౌరవం ప్రదర్శించుకోగలగడం జరుగుతోందా అంటే నేను చెప్పలేను. ప్రధానంగా నాకు బయటిప్రపంచంతో సంబంధం లేదు కనక.

తోలురంగు విషయం–పేరుకి నల్లవాళ్లు అన్నా, అందరూ ఒకే నలుపు కాదు. అందులో ఛాయలున్నాయి. వారిలో కూడా కాస్త తక్కువ నలుపుఛాయ గలవారికి ఆదరణ ఎక్కువట. నల్లఅబ్బాయిలు కొంచెం తెలుపుఛాయగల అమ్మాయిలని కోరతారు. అలాగే అమ్మాయిలు కూడా తెలుపుఛాయగల అబ్బాయిలనే ఇష్టపడతారు. దీనికి కారణం తెల్లవారు గొప్పవారు అన్న భావం కాదంటాడు కథకుడు. ఆయన అభిప్రాయంలో ఇది ఆర్థికవిషయానికి సంబంధించినది. ఉదాహరణకి పత్రికలలో ఉద్యోగ ప్రకటనలు "Light-colored man wanted" అని ఉంటాయి. తరతరాలుగా పిల్లలకి తెల్లరంగు అందివ్వగల అవకాశాలకోసం నల్లవారు చేసే త్యాగం అది. ఒక్కమాటలో ఆయన చెప్పడం "it is no disgrace to be black, but it's often very inconvenient." మనసమాజంలో కూడా నల్లనివాడు పద్మనయనంబులవాడు అని కీర్తిస్తూన్నా, నిత్యజీవితంలో తెల్లతోలుకే పెద్దపీట.

(ఆగస్ట్ 10, 2013)

నిడదవోలు మాలతి e-పుస్తకాలు

వ్యాసమాలతి సం. 1, 2

కథామాలతి సం. 1, 2, 3, 4, 5

PDF ఫార్మాట్ లో తెలుగు తూలిక బ్లాగులో లభ్యం. లింకు ఇక్కడ